నవరసాలు-పంచరంగులు
సంగీతం-సాహిత్యం
కలసి మెలసి వెలిగించిన
తెలుగు వెలుగు!



టి.వి.యస్. ప్రొడక్షన్స

# జీవనజ్యోతి



నిర్మాత: టి.వి.యస్. రాజు
దర్శకత్వం: కె.విశ్వనాథ్
సంగీతం: కె.వి.మహదేవన

విజయ రిలీజ్




మే 1975

సచిత్ర మాసపత్రిక సంపుటి 13 సంచిక 4


# విషయ సూచిక



ముఖచిత్రం అనిల్ ప్రొడక్షన్స్‌వారి సంసారం లో
ఎన్ టి రామారావు జమున


సంస్థాపకులు: కీ శే వి వి రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్: శ్రీమతి వి లీలావతి రాఘవయ్య

జ్యోతి 40/1 మూసా సెయిట్ స్ట్రీట్ టి నగర్ మద్రాసు 600017
ఫోన్ 440548 సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో) రు 42/-

డెట్ ఉతికే బిళ్ల

సబ్బు కంటె 1½ రెట్లు ఎక్కువ శక్తివంతమైనది ఉప్పు నీళ్లలో కూడ.

డెట్ ఉతికే పౌడరు

'ఎంచుకోండుకు వీలుగా' ఎన్నో సైజుల ప్యాకెట్లు మీరు చేయవలసినదంతా బట్టలను తడిపి జాడించడమేను మీ చేతులను మృదువుగా కూడ ఉంచుతుంది

ఎన్-డెట్

మరకలను తొలగించే ఎన్‌జైమ్ ఉతికే పౌడరు గుణకరమైనది కాని హాని చెయ్యదు










# ఇదివరకు ఎన్నడూలేనంత తెల్లదనము—డెట్ ఉత్తమ తయారులతో!

Shilpi HPMA 6A/74

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

## డిపార్ట్‌మెంటు ఆఫ్ ఎంప్లాయిమెంటు అండ్ ట్రయినింగ్

ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు.

# ప్రకటన

ఈ దిగువ నుదహరించబడిన ట్రేడ్స్‌లో ఈ డిపార్ట్‌మెంటువారి ఆధ్వర్యంలో ఈ దిగువ నుదహరించిన వివిధ ఇండస్ట్రియల్ ట్రయినింగ్ ఇన్‌స్టిట్యూట్సులో నిర్వహించబడే ఆల్ ఇండియా ట్రేడ్ టెస్టునకు హాజరు కావలసిన ప్రయివేటు అభ్యర్థుల నుంచి నిర్ణీతమైన ఫారముపైన దరఖాస్తులు కోరబడుచున్నవి.

## ట్రేడ్స్ పేర్లు:

(1) వెల్డర్, (గ్యాస్, ఎలక్ట్రిక్) (2) మెకానిక్ (మోటార్) (3) మెకానిక్ (డీజిల్) (4) డ్రాఫ్ట్సుమెన్ (సివిల్) (5) డ్రాఫ్ట్సుమెన్ (మెకానికల్) (6) ఫిట్టర్. (7) మెకానిక్ (ఇన్‌స్ట్రుమెంట్సు) (8) మెషినిస్టు (10 రోజు) (9) టర్నర్ (10) ఎలక్ట్రీషియన్ (11) మెకానిక్ (రేడియో అండ్ టెలివిజన్) మరియు (12) వైర్‌మెన్.

గమనిక: 1. పైన ఉదహరించిన ట్రేడ్స్‌కొరకు అభ్యర్థులకు ఈ దిగువ నుదహరించిన సబ్జక్టులలో ట్రేడ్ టెస్టు జరుపబడును. అవి: 1 ప్రాక్టికల్, (2) ట్రేడ్ థియరీ (3) వర్కుషాప్ క్యాలకులేషన్స్ అండ్ సైన్స్ (4) ఇంజనీరింగ్ డ్రాయింగ్.

గమనిక: 2. 1, 2, 3 ట్రేడ్స్‌కొరకు ట్రేడ్స్ టెస్టులు 1975 అక్టోబరు నెలలోను, మిగిలిన ట్రేడ్స్‌కొరకు ట్రేడ్ టెస్టులు 1975 జులై నెలలోను నిర్వహించబడును.

ఈ దిగువ నుదహరించిన సెంటర్స్‌లో, ఆయా సెంటర్సునకు ఎదురుగా ఉదహరించిన ట్రేడ్స్‌లో ట్రేడ్ టెస్టులు నిర్వహించబడును

1. విజయవాడ 1, 2, 3, 4, 5 6, 8, 9, 10, 11 మరియు 12.
2. కాకినాడ 1, 2 4 6, 7, 8. 9. 10 11 మరియు 12
3. విశాఖపట్టణం 1, 2, 3 5 6, 7, 8 9, 10, 11 మరియు 12
4. నెల్లూరు. 1, 2, 4, 6 8, 9 10, 11 మరియు 12
5. అనంతపూర్. 1, 2, 5 6, 8, 9, 10, 11 మరియు 12
6. హైదరాబాదు (మల్లేపల్లి) 1, 2 3, 4, 5 6 7 8 9 10, 11, మరియు 12.
7. హైదరాబాదు (వోల్డు సిటీ) 1, 2, 4, 6 8 9 మరియు 10
8. సికింద్రాబాదు 1, 5, 6, 8, 9, 10, 11 మరియు 12
9. వరంగల్. 1. 2, 4, 6, 8, 9, 10, 11 మరియు 12.

## నిబంధనలు

1961 అప్రెంటీస్ ఆక్టు ఇంప్లిమెంటు చేయబడే ఏదైనా ఇండస్ట్రీలోగాని లేక కన్‌సరన్‌లోని అభ్యర్థి కనీసం 3 సంవత్సరములు ఇండస్ట్రియల్ అనుభవం కలిగి ఉండవలెను. లేక అభ్యర్థి ఏ ట్రేడ్‌లో ట్రేడ్ టెస్టు ఇవ్వదలచుకున్నాడో ఆ ట్రేడ్‌లో

కనసరనతోగాని లేక డిపార్టుమెంటుకోగాని. పనిచేసిన మొత్తం ఈ దిగువ నుదహరించిన వివరముతో ఒక సర్టిఫికెటు దాఖలు చేయవలెను ట్రేడ్ వివరము తేదీలతో సహా టోటల్ సర్వీసును ఉదహరించుచూ ట్రేడ్‌లో ఏ పని చేసినది తెలియజేయుచూ ఎంప్లాయర్ నుండి పొంది దాఖలు చేయవలెను.

రికగ్నయిజు కాబడిన ఎస్టాబ్లిష్‌మెంట్సు జారీచేసే సర్టిఫికెట్సులో "This establishment is implementing apprentices act 1961" అని పైన ఉదహరించవలెను.

అభ్యర్థి బోగస్ సర్టిఫికెట్సు దాఖలుచేసిన యెడల ఎటువంటి కారణము తెలియచేయకుండానే నిరాకరించటం జరుగుతుంది. తదుపరి అభ్యర్థిపై తగినచర్య తీసికోబడును.

1. ఇండస్ట్రియల్ ట్రయినింగ్ ఇనిస్టిట్యూటులో ఒక సంవత్సరం ఇనిస్టిట్యూషనల్ ట్రయినింగ్‌లో ఉత్తీర్ణతచెంది ఒక సంవత్సరం అప్రెంటిస్‌షిప్ పూర్తిచేసిన అభ్యర్థులు కూడా ప్రయివేటు అభ్యర్థులతోపాటు నిర్ణీతమయిన రుసుం చెల్లించి, సర్టిఫికేటు దాఖలుచేసి ట్రేడ్ టెస్టునకు హాజరగుటకు అర్హులు.
2. అభ్యర్థులు తప్పనిసరిగా తమ దరఖాస్తులు త్రూ ప్రాపర్ చానల్ అనగా వారి ప్రస్తుత ఎంప్లాయర్ ద్వారా నేరుగా అభ్యర్థి హాజరుకా లచిన సెంటర్‌యొక్క ఇండస్ట్రియల్ ట్రెయినింగ్ ఇనిస్టిట్యూటునకు పరీక్షకొరకు పంపవలెను. ప్రస్తుతం పనిచేయని అభ్యర్థులు సర్వీసు సర్టిఫికెటు డిస్‌చార్జి సర్టిఫికెటు, ఇంతకు ముందు పనిచేసిన ఎస్టాబ్లిష్‌మెంట్సు నుండి వారు పనిచేసిన ట్రేడ్స్‌లో సర్టిఫికెట్సు పొంది దాఖలు చేయవలెను.
3. అభ్యర్థి వయస్సు 1-7-1975 నాటికి 21 సంవత్సరములకు తక్కువగాకుండా ఉండవలెను.
4. అభ్యర్థులు తమ పరీక్ష రుసుము రు. 20-00 (ఇరవై రూపాయలు) ఈ దిగువ నుదహరించిన హెడ్ క్రింద స్టేటుబ్యాంక్ ఆఫ్ హైద్రాబాదులోగాని లేక ప్రభుత్వ ట్రెజరీలోగాని చెల్లించి చలానుపొంది దాఖలు చేయవలెను.

   "హెడ్ ఆఫ్ ఎకౌంట్ 087-లేబర్ అండ్ ఎంప్లాయిమెంటు - ఆదర్ రశీప్ట్స (6) రశీప్ట్స ఆఫ్ ఎంప్లాయిమెంటు అండ్ ట్రెయినింగ్ డిపార్టుమెంటు." స్టేటుబ్యాంక్ ఆఫ్ హైదరాబాదులోగాని. లేక ఏ ప్రభుత్వ ట్రెజరీలోగాని ఒకసారి చెల్లించిన సొమ్ము ఏ పరిస్థితులలోను తిరిగి యివ్వబడదు. తదుపరి పరీక్షకు రుసుముగా కూడా అడ్జస్టు చేసికోబడదు.
5. అభ్యర్థి ఇంతకుముందు ప్రయివేటు అభ్యర్థిగా టెస్టునకు హాజరయి ఉత్తీర్ణత చెందని యెడల తప్పనిసరిగా హాలు టికెట్టు, మార్క్సు సర్టిఫికెటు ఒరిజినల్ జతపరచవలెను. లేనిచో వారి దరఖాస్తులు గమనింపబడవు.
6. డ్రాట్సుమెన్ (సివిల్) డ్రాట్సుమెన్ (మెకానికల్) మరియు మెకానిక్ (రేడియో అండ్ టెలివిజన్) ట్రేడ్స్‌లో అభ్యర్థి ట్రేడ్ టెస్ట్ నకు హాజరు కాదలచిన ఈ దిగువ నుదహరించిన పరీక్షలో ఉత్తీర్ణత చెంది ఉండవలెను.

   హెచ్. యస్. సి. లేక యస్ యస్. యల్. సి. లేక మెట్రిక్యులేషన్ లేక నూపాటరన్ ఆఫ్ ఎడ్యుకేషనల్ సిస్టం క్రింద 10వ తరగతి లేక దానికి సరిసమాన

మైన పరీక్షలో సైన్సు, లెఖలు, ప్రధాన సబ్జక్టులుగా కల్గి ఉత్తీర్ణ
ఉండవలెను. మెకానిక్ (ఇనస్ట్రుమెంట్సు) మరియు, ఎలెక్ట్రీషియన్ ట్రేడ్లకొ
రకు అభ్యర్థి మెట్రిక్యులేషను లేక దానికి సరిసమానమైన పరీక్ష లేక 11 వ
తరగతి అనగా హయ్యర్ సెకండరీ ఎగ్జామినేషన్‌నకు ఒక క్లాసు తక్కువ లేక
సీనియర్ కేంబ్రిడ్జి ఎగ్జామినేషన్, సైన్సు ప్రధాన సబ్జక్టుగా కల్గి ఉత్తీర్ణతచెంది
ఉండవలెను. ఇతర ట్రేడ్స్‌కొరకు అభ్యర్థులు మెట్రిక్యులేషనకు రెండు తరగ
తులు తక్కువ స్థాయికి సరిసమానమైన పరీక్షలలో ఉత్తీర్ణతచెంది ఉండవలెను.
నిర్ణీతమైన దరఖాస్తు ఫారములు ఉచితంగా ఆయా ఇండస్ట్రియల్ ట్రయినింగ్
ఇనిస్టిట్యూట్లు యొక్క ప్రిన్సిపాల్స్‌నుండి స్వయముగా పొందవచ్చును. పోస్ట్
ద్వారా పొందదలచినవారు స్వంత చిరునామా కల్గి, తగినన్ని స్టాంపులు ఉన్న
కవరును దాఖలు చేయవలెను, దరఖాస్తు ఫారములపై ఎటువంటి ఉత్తర ప్రత్యు
త్తరములు జరుపబడవు. పూర్తిచేయబడిన దరఖాస్తు ఫారములు అభ్యర్థి ట్రేడ్
టెస్ట్‌నకు హాజరుకాదలచిన ఆయా సెంటర్ యొక్క ఇండస్ట్రియల్ ట్రయినింగ్
ఇనిస్టిట్యూట్లు యొక్క ప్రిన్సిపాల్స్‌కు 9-5-1975 నాటికి లేక అంతకు ముందుగా
చేరే లాగున ఈ దిగువ నుదహరించిన సర్టిఫికెట్సు జతపరచి దాఖలుచేయవలెను

(ఎ) గెజిటెడ్ ఆఫీసర్‌చే అటెస్టు చేయబడిన జన్మించిన తేదిలేక ట్రాన్సఫర్ సర్టి
ఫికెటు యొక్క ట్రూకాపీలు.

(బి) గెజిటెడ్ ఆఫీసర్‌చే అటెస్ట్ చేయబడిన ఎంప్లాయిర్ నుండి పొందిన సర్వీస్
సర్టిఫికెటు ఒరిజినల్ అదనంగా ఒక ట్రూకాపీ.

(సి) విద్యార్హతలు తెలియజేసే సర్టిఫికెట్సు (గెజిటెడ్ ఆఫీసర్‌చే అటెస్టుచేయబడినవి).

(డి) మెట్రిక్యులేషన్ లేక దానికి సరిసమానమై పరీక్షలో ఉత్తీర్ణత చెందినప్పుడు
వచ్చిన మార్కులు సర్టిపై చేయబడిన కపి.

(ఇ) గెజిటెడ్ ఆఫీసర్‌చే అటెస్టు చేయబడిన మూడు పాస్‌పోర్టు సైజుఫోటోలు.

(యఫ్) ట్రేడ్‌టెస్టు రుసుము చెల్లించి పొందిన ఒరిజినల్ చలాను.

(జి) గెజిటెడ్ ఆఫీసర్ నుండిగాని, యం. పి నుండిగాని, యం. యల్. ఏ. నుండి
గాని యం యల్. సి. నుండిగాని పొందిన క్యారెక్టర్ అండ్ కాండక్టు సర్టిఫి
కెట్టు దరఖాస్తులు ఈకార్యాలయానికి పంపినను లేక నిర్ణయించిన తేది తరువాత
వచ్చే దరఖాస్తులు పూర్తిగా నిరాకరించబడును.

గమనిక: తనిఖీ జరిపిన పిదప అర్హతగల అభ్యర్థులయొక్క హాలు టిక్కెట్లు ఆయా
పరీక్ష కేంద్రాలలో ఉన్న ఇండస్ట్రియల్ ట్రెయినింగ్ ఇనిస్టిట్యూట్లు యొక్క
ప్రిన్సిపాల్స్‌నకు పంపబడును. అభ్యర్థి ట్రేడ్‌టెస్టు పరీక్షకు రెండు రోజులు
ముందుగా ఆయా ప్రిన్సిపాల్స్‌నుండి దరఖాస్తు దాఖలు చేసి స్వయముగ
పొందవలయును పరీక్ష తేది, ఇతర వివరములు ఆయా ఇండస్ట్రియల్ ట్రయి
నింగు ఇనిస్టిట్యూట్లు నుండి పొందవచ్చును.

(సం) వి. యస్. వి. చలపతి,
ఫర్ డైరెక్టర్, ఎంప్లాయిమెంటు అండ్ ట్రయినింగ్,
ఆంధ్ర ప్రదేశ్, హైదరాబాద్.

## ఇదిగో మా నిదర్శనం:




## ఇదిగో మీ నిదర్శనం:




# సిగ్నల్ ఫ్లూరైడ్ మాత్రమే దంతక్షయం, నోటిదుర్వాసన అరికట్టుతుందని నిరూపిస్తుంది.

**దంత పరిశుభ్రతకు అపూర్వమూలపదార్థము కలది**




**సిగ్నల్ ఫ్లూరైడ్ మాత్రమే నిదర్శనం కలది–**
**మీ దంతవైద్యుని అడగండి.**

# తొలిమాట

మద్రాసు నగరంలోని వివిధ కార్యాలయాలలో పనిచేస్తున్న ఉద్యోగులు ఆఫీసులో రోజు విడిచి రోజు పగలు కునికిపాట్లుపడడం ఎక్కువైపోయిందట! రెండు రోజులకోసారి అర్ధరాత్రి ప్రాంతాల కొన్ని గంటలసేపు మాత్రమే పంపులలో నీళ్ళు రావటం కారణంగా చెబుతున్నారు దీనికి. ప్రస్తుతానికి రెండు రోజులకోసారిగా అమృతాన్నందిస్తున్న నీటి పంపులు మే లో మూడు రోజులకోసారి మాత్రమే నోళ్ళు విప్పుతాయట! మద్రాసు నగరం అత్యంత గడ్డు పరిస్థితుల నెదుర్కొంటోంది. నీరులేదు విద్యుచ్ఛక్తి పరిస్థితి మరింత ఘోరంగా వుంది. 'ఈ కష్టాలకు కన్నీటిబొట్లు తర్పణ వేద్దామనుకొన్నవారుకూడా, నీటికరువు దృష్టిలో పెట్టుకొని ఆ పని చేయడానికి కూడా సాహసించలేక పోతున్నారని!' ఒక పెద్దమనిషి చమత్కరించారు. ఇన్ని ఇబ్బందులూ జ్యోతి ఎదుర్కోవడం తప్పలేదు. అందుకే పత్రిక విడుదలలో అప్పుడప్పుడు ఆలస్యమూ తప్పడంలేదు. పాఠకులు గమనించగలరు.

* * *

స్థలాభావంవల్ల ఈ సంచికలో, పాఠకుల ప్రశంసలు పొందిన 'ఆగండి! చదవండి! ఆలోచించండి!' శీర్షిక ప్రచురించడం లేదు. అలాగే సినిమాకు కూడా చాలా తక్కువ పేజీలే కేటాయించవలసి వచ్చింది. వచ్చే సంచికనుండి ఈ శీర్షికలు ఎప్పటిలా ప్రచురించటం జరుగుతుంది.

వె. రాఘవేంద్రరావు


మీ ఇంటిని హాయిగా ఉంచుకోవాలంటే
ఒకసారి సందర్శించండి
చీరెలు, దుప్పట్లు కర్టెన్లు ఇంకా అన్నిరకాల
గుడ్డలకి మీరు కోరుకున్న మేలయిన అద్దకమును
పొందగలరు
బాటిక్ హోమ్
మోహన్ టెక్స్‌టైల్స్ ప్రాసెసర్స్
185, రాయపేట హైరోడ్. మద్రాసు-600014
ఫోన్. 811344
పర్సనల్. 811388

# చీకటి ప్రొద్దున వెలుగురేఖ నవలపై విమర్శకు రచయిత్రి జవాబు




ఏప్రిల్ సంచికలో శ్రీ ఉమామహేశ్వర రావుగారి ఉత్తరం చదివాను. ఆయన నవల పూర్తిగా చదవకుండా, చదివింది సరిగా అర్థం చేసికోకుండా కేవలం వ్యంగ్య ధోరణిలో విమర్శించి నట్లనిపించింది. ఆయన ముఖ్యంగా గుర్తించాల్సింది ఈ కథ కళ్యాణి దృక్పథంతో కళ్యాణి చెప్పుతున్న కథ కనక రచయిత్రి రంగారావుని దుయ్యబట్టటమే ధ్యేయంగా పెట్టుకోలేదని గమనించాలి. పాఠకులు కళ్యాణి దృష్టితో రంగారావుని చూడాలి.

కళ్యాణి కన్నెవయసులో బావకి మనసివ్వడం నేరమా? మనసిచ్చిన వాడిని పెళ్ళిచేసుకోలేక పరిస్థితులకి బానిస అయి నిస్సహాయంగా బలిపశువులా వివాహ వేదిక ఎక్కడంలో ఆమె నేరం ఎంత? పెళ్ళయ్యాక మనసు లేకపోయినా వివాహ బంధాన్ని గౌరవించి కాపురం చేస్తూ ఎన్నాళ్ళకో వచ్చిన, మరి కనపడ దనుకున్న బావ కంటపడితే ఒక్కక్షణం తనని తాను మరవడం అంత క్షమించరాని నేరమా? అంత చిన్న విషయాన్ని- ఉన్న సంగతి విడమరిచి చెప్పినా అర్థం చేసికోని భర్త అనుక్షణం సాధిస్తూ, హింసిస్తూ యిల్లు నరకం చేస్తుంటే ఆత్మగౌరవం వున్న కళ్యాణి తిరగబడ్డంలో తప్పు వుందా? నిజమే భార్య ప్రేమ వ్యవహారాన్ని ఏ భర్తా ఆమోదించడు. సహించనివాడు నిజంగా సహృదయం, సంస్కారంగల వాడయితే భార్య సజావుగా విడిపోదాం అంటే అంగీకరిస్తాడు. ఒకరినొకరు ద్వేషించుకుంటూ కాపురం చేసుకునేకంటె విడిపోదాం అన్న ఆమె కోరికని ఆమోదించకుండా తాను సుఖపడకపోయినా భార్య సుఖపడకూడదన్న ధ్యేయంతో ఆమెని హింసించి ఆనందించడమే ధ్యేయంగా పెట్టుకున్న భర్తని ఏ భార్య అయినా ద్వేషించక ప్రేమించి గౌరవిస్తుందా? భర్త తన యిష్టంవచ్చిన రీతిలో ప్రవర్తిస్తే అతనికి వర్తించని నీతి నియమాలు భార్యకి వర్తింపచేసి లోకం కోసం పతివ్రత అన్పించడం కోసం ఆమె అన్ని సుఖాలు త్యాగంచేసి కృంగి కృశించి పోవాలా? మగడికో నీతి ఆడదానికో నీతి లేదని ధిక్కరించితే అది నేరమా? తాడు తెగేవరకు లాగాక, తెగాక యింక ఎవరికి భయపడడానికి ఏమి లేదన్న మొండి ధైర్యం, ఎవరినీ లెక్కచేయని ధిక్కరింపు ఆమెకి కల్గడంతో అసహజత ఏముంది? కళ్యాణి నేరం అల్లా 'నాధా

శ్రోతల శ్రవణ సుఖం, ఆర్థిక సౌకర్యం
ధ్యేయంగాగల ఒకే ఒక రికార్డు కంపెనీ

# పాలిడార్




సరసమైన ధరలకు సరికొత్త మాక్సి యి. పి. లు
స్వారస్యమైన సంగీతానికి రెండు స్వరమయ ఎల్. పి. లు
"జూలీ" "భోలా భాలా"

డీలర్లు తీసికో[illegible] కావలెను. నేడే వ్రాయండి —

పాలిడార్ మార్కెటింగ్ కంట్రోలర్,
11-ఎ/1, అన్నాసాలై, మద్రాసు-600 002.

ఘోరాపరాధం చేశాను. క్షమించి మీ పాదాల చెంత పడి వుండనీయండి" అని భర్తని ప్రార్థించలేదు. అంచేత కళ్యాణి ప్రవర్తన ఈ పాఠకుడికి నచ్చక పోవడంలో ఆశ్చర్యంలేదు. పతివ్రతల కధలు చదివి, సినిమాలు చూసి రక్తంలో జీర్ణించిన భావంవల్ల సాంప్రదాయాన్ని ధిక్కరించే స్త్రీ తిరుగుబాటు ధోరణి విపరీతంగానే కనిపిస్తుంది. యుగయుగాలుగా ఉగ్గుపాలతో పాతివ్రత్యం, నీతి, ధర్మాలు ఆడదానికి రంగరించి పోసి ఆ నీతి నియమాల ధర్మ పన్నాల ఉక్కు చట్రాలతో స్త్రీని బంధించారు. ఆ ధర్మపన్నాలన్నీ పురుషులు తయారుచేసినవే అని యీనాటి స్త్రీలు యిప్పుడిప్పుడే గ్రహించగలిగి ఆ ఉక్కు పంజరాలని ఛేదించుకుని తిరగబడితే ఆ ధోరణి విడ్డూరంగానూ వింతగానూ కనపడడంలో ఆశ్చర్యంలేదు. ఆ స్త్రీ బరితెగించి, చెడిపోయిన దానిలానే కన్పిస్తుంది. అదే రంగారావు ప్రేమ వ్యవహారం అయితే పాఠకుడికి వింతగా కనపడేది కాదు. ఇదే రంగారావు మరదలుతో ప్రేమ వ్యవహారం సాగిస్తే కళ్యాణి అభ్యంతరాలు రంగారావు సహిస్తాడా? రంగారావు బజారు మనిషితో తిరిగితే కనపడని తప్పు (అది చాలా సహజంగా కన్పించింది పాఠకుడికి. ఎంచేత అంటే మగాడు కనక నీతి నియమాలు పాటించక్కరలేదు) కళ్యాణి నిజాయితీగా బావని ప్రేమిస్తున్నానని నోటిమాటల్లో చెప్పడం విపరీతంగా, విషజ్వరంలా కన్పించింది. అంటే ఆడదానికి ప్రేమానుభూతులు వుండరాదని, వున్నా పైకి చెప్పే అర్హతలేదని భావం కాబోలు (తన బావతో మొగుడిముందు ప్రేమ కలాపాలు సాగిస్తూన్న కళ్యాణికి డబ్బుంది కనక ఛీప్‌గా కనపడలేదన్నారు.) అప్పటివరకు అంటే- ఏప్రిల్ సంచికవరకు- కళ్యాణి ఆనంద్‌ల మధ్య మానసిక బంధం తప్ప శారీరక బంధం లేదు అన్నది పాఠకుడు ముందునించి సరిగా చదివితే అర్థం అవుతుంది, కథ ఫ్లాష్‌బేక్‌లో నడుస్తూంది అని గుర్తించాలి. ఆఖర్న కళ్యాణి ప్రవర్తన అలా మారిందంటే దానికి కారకులు ఎవరు? ఒక ఆడది చెడిందంటే తప్పకుండా పరిస్థితులే కారణం. అంతలా పరువు, ప్రతిష్ఠ, లోకం అన్నిటిని లెక్కచేయకుండా అంతకి తెగించిందంటే ఆ వెనక పరిస్థితులు- ఆమెని ఆ స్థితికి తరిమిన పరిస్థితి అర్థం చేసికోకుండా (అంటే రంగారావు సజావుగావిడిపోవడానికి అంగీకరిస్తే కళ్యాణి చాటు మాటు వ్యవహారం లేక ఆనంద్‌ని రెండో వివాహం చేసుకునేది) కళ్యాణికి, డబ్బుకి వచ్చే బజారు మనిషికి తేడా లేదనడం శోచనీయం.

పైగా తల్లి కళ్యాణిని సమర్థించిందన్న ఆరోపణ. తల్లి ఎన్నడూ కళ్యాణి ధోరణిని సమర్థించలేదు. మొగుడ్ని వదిలి పొమ్మని, కాపురం పాడుచేసుకోమని ఎన్నడూ అనలేదు. ఇలాంటి కలతలువున్నా కాపురం నిలుపుకోవాలనే చెప్పింది.

తరువాత రంగారావుని స్టుపిడ్‌లా ఫూల్‌లా చిత్రీకరిస్తున్న ఆరోపణ. రంగారావు స్థితిలో వున్న మరో ఏ భర్త అయినా భార్య ప్రేమ వ్యవహారం తెలిసి, సహృదయంతో అర్థంచేసికొని ఆమె కోరగానే ఆమెకి విడాకులు యిచ్చి ఆమె కోరుకున్న

జీవితంలోకి వెళ్ళనిచ్చే భర్తలు మన దేశంలో వున్నారేమో ఎవరికివారే ఆత్మ విమర్శచేసుకుని, అంతహృదయవైశాల్యం చూపగలిగే భర్తలు వున్నారు. వుంటారు అని పాఠకుడుగారు భర్తల తరపున వకాల్తా తీసుకు చెప్పగలిగితే తప్పకుండా ఆ పాత్రని పూల్‌గా చిత్రీకరించానని వప్పుకుంటాను. భార్యని హింపించడమే ధ్యేయంగా పెట్టుకున్న అతని షరతులు స్టుపిడ్‌గా వుండచ్చు తిట్టుకుంటూనో, కొట్టుకుంటూనో కలిసి వుండాలికాని విడిపోవడం నామర్దా పరువు తక్కువ అనుకునే భర్త ఏదో విధంగా ఆమె దారులు మూసివేయ డానికి పిల్లల సాకు అడ్డం పెట్టుకుని ఆమెని హింపించాలనుకోడంలో తెలివి తేటలు వున్నాయికాని పూలిష్‌నెస్ లేదు.

ఆఖరుగా ఒక మాట. కళ్యాణి కధ యిలా వక్రమార్గం పట్టిందంటే కారకులు ఎవరు? ముందు తలితండ్రులు, తరువాత భర్త, ఆ తరువాత సంఘం, చట్టాలు, అన్నది అర్థం చేసేకుంటే కళ్యాణిది తిరుగుబోతు మనస్తత్వంగాకాక యీనాటి స్త్రీ తమకేం కావాలో మరెవరో నిర్ణయించడం కాక తాము చెప్పగల ధైర్య సాహసాలు యిప్పుడిప్పుడే అలవరుచు కుంటూందని, జీవితానికి ఎదరీది అంతు చూడాలన్న ధ్యేయం అలవరుచుకుని నీతి నియమాలు, ధర్మసూత్రాలు స్త్రీ పురుషులిద్దరికీ సమానమని గుర్తించగలిగే తెలివి నేర్చుకుందని, యీ మార్పు విడ్డూరం కాదని, సహజమని ఉమామహేశ్వరరావుగారి లాంటి వారికి నచ్చకపోయినా, రోజులు మారాయి, మారుతున్నాయని గ్రహించాలి మరి!

—డి. కామేశ్వరి.



## ప్రతి క్షణం-ప్రత్యక్ష నరకం

ఆనందనామ వత్సర అంతిమ దినాల్లో
ఓ రాక్షస క్షణం - ఓ అగ్ని కణం
వేయి జ్వాలలుగా ప్రజ్వరిల్లి,
పాతికేళ్ళు నిండని నీ పచ్చని జీవితాన్ని
భస్మీ పటలం చేసి,
మంటల్ని పూయిస్తున్న నా హృదయాన్నీ-
మూడేళ్ళు నిండని మన కలల పంటనీ,
నాకు మిగిల్చి-
నిన్ను క్రూరంగా, కఠోరంగా-
అయిదు గంటల్లో
నానుండి శాశ్వతంగా దూరం చేసింది.
విధి బలీయమంటే ఇదా?
మృత్యువు కోరిన వర మిదేనా?
చంద్ర బింబాన్ని కూడా అగ్నిజ్వాలలు
అంతమొందించ గలవా??

(19-3-75 రాత్రి అగ్నిదేవుని కోరలకు చిక్కుకుని నా కళ్ళెదురుగా సజీవ దహనమై స్వర్గధామం చేరుకున్న నా ప్రియాతి ప్రియమైన ధర్మపత్ని శ్రీమతి అందే కృష్ణవేణి. M.A., B.Ed., దివ్యస్మృతికి—)

- అందే గోపాలకృష్ణమూర్తి.



# చో ఆన్ ట్రయల్!!
## (చో పై విచారణ)

'చో' పేరు విననివాళ్ళు తమిళనాడులో వుండరనటం అతిశయోక్తి కాదు. తెలుగునాడులో కూడా బాగా తెలిసిన మనిషి 'చో'. లాయర్‌గా, నాటక రచయితగా, రంగస్థల నటుడిగా, సినీ హాస్యనటుడిగా, తుగ్లక్ పత్రికా సంపాదకుడుగా, రాజకీయ విమర్శకుడుగా, మంచి వక్తగా అందరికీ సుపరిచితుడు.

వ్యంగ్య సంభాషణలతో కూడుకున్న అతని నాటకాలు తమిళ నాటక రంగంలో ఒక కొత్త శకాన్ని ప్రారంభించాయని చెప్పవచ్చు.

అతని నాటకాలలో మూడు- మహమ్మద్ బిన్ తుగ్లక్, ఈజ్ గాడ్ డెడ్, సంభవామి యుగే యుగే- తెలుగులోకి అనువదించి, ప్రదర్శింపబడ్డాయి.

అతని విమర్శలు సూటిగా వుంటాయి. అతన్ని అభిమానించే వాళ్లెంతమందో, విమర్శించే వాళ్ళూ అంతమందే వుంటారు.

మార్చి 26 వ తేదీన 'అప్సరస్' అనే సాంస్కృతిక సంస్థ ఒక సభ ఏర్పాటు చేసింది మద్రాసు మ్యూజిక్ అకాడమీ హాలులో. ఆ సభలో ప్రేక్షకులు 'చో'ని విమర్శిస్తారు. ఆ విమర్శలకు 'చో' సమాధానం చెప్పాలి. న్యాయ నిర్ణేతగా ఫిలిం డైరెక్టర్ వి. శ్రీనివాసన్, జూరీ సభ్యులుగా శ్రీమతి (లాక్ఫ్ర) వై. డి. పార్థసారధి, అప్సరస్ కార్యదర్శి హరిహరన్, మద్రాసులోని సాంస్కృతిక సంస్థల అసోసియేషన్ కార్యదర్శి కృష్ణమూర్తి, స్టూడెంట్ కాంగ్రెస్ లీడర్ నేతాజీ, జర్నలిస్టు జగత్ వ్యవహరించారు.

ప్రశ్నలు వేయటానికి అనువుగా ప్రేక్షకుల మధ్యలో మైక్ అరేంజ్ చేయబడింది. ముందుగా పంపబడిన ప్రశ్నలను ప్రేక్షకుల తరపున జూరీ సభ్యులు 'చో'ని అడిగారు.

సరిగ్గా రెండు గంటలసేపు జరిగిన యీ కార్యక్రమంలో ఎంతో ఉత్సాహంతో ప్రేక్షకులు పాల్గొన్నారు.

బహుశా యిలాంటి కార్యక్రమం యింతవరకు ఎక్కడా జరగలేదేమో!

ఇలాంటి ప్రయోగాలు తెలుగు నాటకరంగం మీద కూడ చేయటానికి ఎవరైనా ప్రయత్నించవచ్చు.

—బి. వి. యస్. మూర్తి.

"మనిషి జీవితంలో ఎప్పుడు పతనానికి స్వాగతం పలుకుతాడో చెప్పలేం" అన్నాడు రామం.

నేనూ-నాయుడూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నాం, రోజూ సాయంకాలం పొద్దుపోక నాగావళీ నది ఒడ్డున ఇసుకలో కూర్చుంటాం.




రాజస్థాన్ వాడి కారప్పూస కొనుక్కుని పొట్లాలు ముందేసుకుని మాట్లాడుకుంటూ ఉన్నాం. రామం ఎప్పుడూ యింతే. ఏదీ వివరంగా చెప్పడు. చెప్పేముందు ఒక సుభాషితమో, తత్వమో ఒకటి వొదుల్తాడు. తర్వాత అసలు విషయం ప్రారంభిస్తాడు. అందువలన ఏం జరిగిందీ ప్రశ్న వెయ్య లేదు, మేము.

"అనుమానానికి ఒక అర్థం వుండాలి. ఆధారాలు వుండాలి. అవన్నీ లేకుండా ఏదో మనస్సులో పెట్టుకుని, ఐదేళ్లుగా కాపురంచేసిన భార్యను, పనసపండులాంటి బిడ్డల్ని వదిలెయ్యడం చాలా దారుణం". అన్నాడు పొట్లాం విప్పుతూ.

"ఇది మామూలేగా ప్రతీ జాతుల్లోనూ

సాధారణంగా జరుగుతోంది కదా'' అన్నాడు నాయుడు.

''అవును మామూలే. అటవిక జాతుల్లోనూ, సంస్కారం లేని మనుష్యుల్లోనూ ఇది తప్పనిసరిగా కన్పిస్తుంది. కానీ చదువుకున్నవాడూ, సంస్కారం కలవాడూ, ఉన్నత వంశ సంజాతుడు న్యాయశాస్త్రం చదువుకున్నవాడు అలాంటి పని చేస్తే ఏం చేస్తారు?'' అన్నాడు.

''ఏం చేస్తాం? వాడి ఖర్మ అని వదిలేస్తాం'' అన్నాడు నాయుడు గోల్డుఫ్లేకు సిగరెట్టు వెలిగించుకుంటూ. వాడిది శ్రీకూర్మం. అయినా ఎప్పుడూ శ్రీకాకుళంలో ఉడిపి లాడ్జింగులో వాడికో గది వుంటుంది. పట్నవాస జీవితమంటే వాడికో మోజు. రాజకీయంగా ఒక స్థానం సంపాదించాలన్న తపన వున్నవాడు. నిస్పృహాయంగా నావేపు చూశాడు రామం.

''ఇంతకీ ఆ ఉత్తముడి పేరు చెబుదూ, వెధవ సస్పెన్సుతో చంపక'' అన్నాను కొంచెం కోపంగా.

''ఎవరో ఏమిటి? మా పక్కింటి మనోహరుడే'' అన్నాడు రామం.

మనోహరం బి. ఎ. బి. యల్. మంచి ప్రాక్టీసువున్న లాయరు. అతను రామం ద్వారా, నాయుడు ద్వారా నాకు బాగా తెలుసు. నాయుడు వాళ్ల నాన్న అతని క్లయింటు. రామం వాళ్ళ పక్కింటి మేడ వాళ్లది. ప్రాక్టీసులో ఆర్జించి క్రొత్తగా 'ఎంబాసిడర్' కారు కొన్నాడు. ముగ్గురన్నదమ్ములు, పెద్ద వుద్యోగాలు చేస్తున్నారు. తల్లిదండ్రులు పెద్దన్నయ్య దగ్గరే ఉంటున్నారు. మనోహరమే ఆఖరివాడు. మా కన్నా ఒకటి రెండు సంవత్సరాలు పెద్దవాడనుకుంటాను. ఒకటి రెండుసార్లు సాయంకాలం అతనితో సరదాగా మాట్లాడుకున్నాం. ఎన్నో విషయాలు అతనికి తెలుసు. గొప్ప మేధావిలా కనిపిస్తాడు.

నేను మొదట నమ్మలేక పోయాను. సాయం సంధ్యలో నా ముఖంలో రంగులు చూసాడువాడు.

''నే చెప్పినది నిజమేరా! అంత కుసంస్కారి అని మేమూ అనుకోలేదు. మా పెరట్లో పిట్టగోడ ఒకటివుంది కదా, ఆ అమ్మాయి వచ్చిన తరువాత గోడ పెంచేసాడు. అలా ఎందుకు చేసాడో ఇప్పుడిప్పుడర్ధమవుతోంది'' అన్నాడు రామం బాధగా. రామం వాళ్లది పెద్ద కుటుంబం. వాళ్లు మంచి సంస్కారవంతులు. రామం కో పెద్ద బటల కొట్టు వుంది.

''అసలింతకీ సంగతేమిట్రా?'' అన్నాను. 'ఒదిలేశాడు' అన్నదానికి కారణం వొకటి వుండాలి కదా మరి, నాకూ చాల బాధవేసింది.

ఎప్పుడో ఒకసారి మురళీ హాల్లో చూశాను. కార్లో వచ్చారు. ఆ దంపతులు. ఇద్దరు పనసపండుల్లాంటి బిడ్డలు. ఆమె తమలపాకు రంగుచీరలో మెరసిపోతున్న స్వర్ణ ప్రతిమలా వుంది. వాస్తవానికి కాకి ముక్కుకు దొండపండులా అమరింది. నయాపైసాకు కొంచెం పెద్దదయిన బొట్టులో మరీ అందంగా వుందామె. ఆమె ముఖాన్ని బట్టి చాలా అమాయకంగా అవుపించింది.

''ఏవుంది? జిహ్వా కో రుచి పుర్రె కో

బుద్ధి'' అన్నాడు రామం. మళ్లా మరో సిగరెట్టు వెలిగించాడు.

"అది కాదురా! ఆమె ఎవ్వరితోనో వుంటోందని వాడి అనుమానం." అన్నాడు.

''అది ఎలాగ సాధ్యం.''

''సాధ్యం కానిది కాబట్టే వాడికి నింద వేసి వదిలేయడానికి సాధ్యమయ్యింది. ఇంతకాలంగా వుంటున్నా ఆమెను నేను చాలా తక్కువసార్లు చూసాను. అసలు వాడి వాదనేమిటంటే వాడొకనాడు కోర్టు నుండి ఇంటికి వచ్చేసరికి అతని భార్య, ఆమె అక్కగారి భర్తగారు ఎదురెదురుగా కాఫీ త్రాగుతూ నవ్వుకుంటున్నారట. అదీ అసలు కారణం.'' అన్నాడు.

''ఈ మాత్రం దానికే! నలుగురు బలగం వున్నవాళ్ళు, బావలు, మేనమామలు, మేనబావలు వస్తే సరదాగా మాట్లాడు కోవటం కూడా తప్పయితే, మనం మన భార్యల్ని ఏనాడో పుట్టింట్లో వొదిలేయాలి'' అన్నాను బాధగా.

నాయుడేం మాట్లాడటంలేదు. పిడికిటిలో ఇసుక తీసుకుని గాలిలో రేణువుల్ని నెమ్మదిగా జారవిడుస్తున్నాడు. చీకటి కరిగి చల్లబడిన కత్తి నెయ్యిలా పేరుకుంటోంది.

''ఆ బావ గూడా వయస్సులో వున్న వాడు కాదు. రెండు మూడు సంవత్సరాలల్లో రిటైరై పోతాడు'' అన్నాడు.

''అయితే ఇప్పు డెక్కడున్నార్రా?'' అనడిగాను. నా మస్తిష్కంలో ఆమె పిల్లలు మెదుల్తున్నారు.

''వాడింటికి చాలామంది పెద్దలు వచ్చారు. ఆ అమ్మాయి నాన్న అమ్మ, తదితర బంధువులు, తర్వాత ఆమె బావగారూ వచ్చారు. 'నా కూతురు లాంటిది నాయనా ఆ పిల్ల' అని తన పిల్లల మీద ప్రమాణం చేసి చెప్పాడు పాపం. కానీ ఆ దరిద్రుడు నమ్మలేదు. వాడి మొఖాన ఏడుస్తూ ఆ పిల్ల తల్లిదండ్రులు, ఆమెను తీసుకెళ్ళి పోయారు.' అన్నాడు.

నా గుండెలు బరువెక్కాయి. ఆమె భవిష్యత్తు మీద, పిల్లల భవిష్యత్తుమీద. అలాంటి దైన్య స్థితి నా చెల్లెలుకే సంభవిస్తే ..

''ఇప్పుడా పిల్లగతి ఎలాగ? స్వగతం లోని మాట బయటికి వచ్చేసింది.

''ఏముంది? విడాకుల వ్యవహారం కోర్టులో నడుస్తోంది.'' అన్నాడు రామం.

ముగ్గురం లేచాం. సెంటరు వద్దకు



వచ్చేసరికి నాయుడు పాత ఖాతా రిక్షావచ్చి దండం పెట్టింది.

"ఏంటిరా సంగతి?" కళ్లెగరేశాడు నాయుడు.

"కొత్త సరుకు వొచ్చింది బాబూ! కాకి వీధిలోవుంది" అన్నాడు. కొంచెం నెమ్మదిగా మా ఇద్దరికి మాత్రమే వినిపించింది.

నాయుడి జీవన సిద్ధాంతం మాకు తెలుసు. ప్రపంచంలో అందినంత అందాన్ని ఎలాగయినా ఆస్వాదించడానికి ప్రయత్నించటమే వాడి లక్ష్యం.

"వస్తానర్రా" అంటూ రిక్షా ఎక్కి వెళ్లిపోయాడు.

"వీడికి బుద్ధి మారదా?" అన్నాను.

"ఎలా మారుతుంది? వీళ్లకి చచ్చినంత డబ్బు మూలుగుతోంది. వాళ్ల నాన్న వ్యవసాయం, బుర్రతిప్పుడు వ్యవహారం, వీడు డబ్బు నీళ్లలా ఖర్చుపెట్టినా రెండు తరాల దాకా వస్తుంది" అన్నాడు.

ఇంటికి వెళ్ళినతరువాత నాకు నిద్దుర పట్టలేదు. స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కులు కావాలని ఘోషిస్తున్న ఈ యుగంలో పురుషుడు వ్యభిచారం చేస్తే తప్పులేదు. కానీ స్త్రీ వ్యభిచరించ గూడదు అన్న సిద్ధాంతం జ్ఞాపకం వచ్చింది. ఈ మనోహరం అనే పురుగుమీద కథ రాయాలనుకున్నాను. కానీ రామం దగ్గర ఇంకా కొంత ముడిసరుకు తీసుకోవాలి.

*     *     *

ఉదయాన్నే రామం మేడదగ్గరకు వెళ్లేసరికి మనోహరం పోర్టికోలో నిలబడి క్రొత్త కారును పని కుర్రాడిచేత తుడిపిస్తున్నాడు. నన్ను చూడగానే విష్ చేసాడు. కొంచెం గడ్డం పెంచాడు. స్నానంచేసి, వెంకటరమణమూర్తి గంధం నయాపైసా అంత పెట్టి మధ్య ఎర్ర కుంకుమ బొట్టు పెట్టుకున్నాడు. మెడలో రుద్రాక్షలు వున్నాయి. సినీమాలో మేకప్ చేసికొన్న మాంత్రికుడులా వున్నాడు. నేను వెళ్ళక తప్పింది కాదు.

"ఏమిటి సార్?" అన్నాను. ఆ ప్రశ్నలో ఏమిటీ వింత వేషం అన్న ఆశ్చర్యార్థకం వుంది.

భుజంమీద చెయ్యివేసి డ్రాయింగు రూం దగ్గరకున్న బెడ్ రూంలోకి తీసి కెళ్లాడు.

అతని ఆప్యాయతకు నాకే ఆశ్చర్యం వేసింది. డబుల్ డన్ లప్ బెడ్ మీద కొన్ని వేదాంత గ్రంథాలు వున్నాయి. జాతక మార్తాండం, తదితర తాళపత్ర గ్రంథాలు వున్నాయి. మధ్యగా తెల్లకాగితాలు స్కేలు, పెన్సిలు వున్నాయి. ఒక ప్రక్కగా అరచేయి అద్ది నలుపు చేసిన కాగితాలు, అవి గాలికి ఎగిరిపోకుండా ఇత్తడి చట్రంలో బిగించిన పెద్ద భూతద్దం పెట్టబడివున్నాయి.

"ఏంటి సార్! జాతకాలు గూడా చూడ్డం మీకు వచ్చా" అన్నాను ఆశ్చర్యంగా. ఎంత మనస్సులో మనిషి మీద అసహ్యం వున్నా సభ్యత కొంచెం పాటించాలి గదా మరి.

"ఆఁ! ఏదో కొంచెం నేర్చుకున్నాను. మీ కిందులో ఏమైనా ప్రవేశం వుందా?" అనడిగాడు, అతను. నాకు రాదని తలూపాను.

"అదేంటి సార్! మీరు బ్రాహ్మణులు

అందులో వైదికులు కదా ..'' అన్నాడు

''మేడిపండు వాటం సార్ నాలో బ్రాహ్మణ్యంతో కూడిన సంస్కారం. అదీ గాక నాకందులో నమ్మకంలేదు.'' అన్నాను వ్యంగ్యంగా.

''అలా కొట్టి పారేయకండి సార్. మీలాగే నాకూ పూర్వం నమ్మకంలేదు. కానీ ఇటీవల నా జీవితంలో సంఘటనల వల్ల నేను నమ్మక తప్పలేదు.'' అన్నాడతను.

తర్వాత మనోహరం ప్రారంభించాడు. గ్రహాలు, వాటి స్థాన చలనాలు, ఉచ్ఛ నీచాలు, తన జీవితంలో ఎలా పరిభ్రమించి ఎలాంటి ఫలితాల్ని ఇచ్చినదీ చెప్పుకు పోతున్నాడు. నాకేం బోధపడలేదు అతని వాగ్ధోరణి, పైగా ఆశ్చర్యం వేసింది. ఇవన్నీ ఎప్పుడు నేర్చుకున్నాడని. ఆ మాటే అన్నాను.

''నేనూ నేర్చుకోక పోదును శాస్త్రి గారూ! ఈమధ్య జీవితంలో నేనొక పెద్ద దెబ్బ తిన్నాను'' అన్నాడు ఉపోద్ఘాతం ప్రారంభిస్తూ క్షణం సేపు మా ఇద్దరి మధ్య నిశ్శబ్దం రాజ్యం చేసింది. అతను కళ్ళు మూసుకున్నాడు. కళ్లు విప్పకుండానే,

''నా భార్య నా ఇంట్లోనే వ్యభిచారం సాగిస్తున్నది. అది భరించలేక పోయాను. ఏదో భగవంతు డిచ్చిన ఆస్తి వుంది. మీ అందరి అభిమానంవల్ల ప్రాక్టీసు బాగా పెరిగింది. ఇద్దరు పిల్లలు నాకేం అని గర్వించాను. కానీ చివరకు నేను ఇంత భవంతిలోనూ ఒక్కడినే ఒంటరిగా మిగిలి పోయాను'' అన్నాడు,భార్యను ఒదిలేశాను. అన్న ధ్వని ఆ మాటల్లో ప్రతి ధ్వనిస్తూ. ఎంతయినా ప్లీడరు, పేచీల బుర్రకదా మరి.

నేను కళ్ళతోనే సానుభూతి ప్రకటించాను.

''అప్పట్నుంచీ నాకీ బాధ పట్టుకుంది. నా జీవితంలో ఎందుకీ ఘటన జరిగిందీ అని పరిశోధిస్తున్నాను. అసలలా ఎందుకు జరిగిందంటారు?'' అతని ప్రశ్న.

నేనేం మాట్లాడలేక పోయాను.

''నేను నా భార్యను ఎంతో ప్రేమించాను. ఆమె నా జీవితంలో నిప్పులు పోసింది. ఆమెకు పెళ్ళికాకముందే ఏవో సంబంధాలు వున్నాయట. ఆ తర్వాత ఇక్కడ నా క్లయింటుతోనే వ్యభిచారం సాగించింది'' అన్నాడు బాధగా.

అతని బాధను చూసి నాకు నిజంగా జాలి వేసింది. కడివెడు పాలల్లో ఒక మజ్జిగ చుక్కలా అయిపోయిందతని జీవితానికి.

''ఇప్పుడు నాడీశాస్త్రం పరిశోధిస్తున్నాను. పరిశీలిస్తున్నాను, అది పూర్తయి పోయిన తరువాత మీరు నాకో సాయంచేసి పెట్టాలి '' అన్నాడతను ప్రాధేయ పూర్వకంగా నా కళ్ళలోకి చూస్తూ.

''ఏమిటి చెప్పండి'' అన్నాను.

''ఏంలేదు. మీరు రచయితలు కదా! నా జీవిత చరిత్రను రాసిపెట్టాలి. అయితే అది పూర్తిగా జీవిత చరిత్ర కాకూడదు. ఒక సందేశాత్మక నవలలా వుండాలి. భార్యలను గుడ్డిగా నమ్మే భర్తలకు ఒక మార్గదర్శి కావాలి.'' అన్నాడు దృఢంగా.

''చూదాం లేండి సార్'' అన్నాను.

''అమ్మమ్మ! అలాగనకండి. నా ప్రయి

వేటు విషయాల్ని మీకు తప్ప మరెవ్వరికీ చెప్పి రాయించలేను. అందువలన మీరు తప్పకుండా ఈ సాయం చెయ్యాలి.'' అన్నాడు నా చేతిని తన చేతిలోకి తీసుకుంటూ.

ఇంతలో ఎవరో క్లయింటు రావడం వల్ల మా సంభాషణ కంతరాయం కలిగింది. నేను వచ్చేసాను.

*　　　*　　　*

'' ఇదిరా సంగతి'' అన్నాను. మనోహరానికి నాకూ జరిగిన కథ చెప్పి. మామ్మూలుగానే ముగ్గురం ఇసుకలో కూర్చున్నాం.

''ఒరేయ్ నమ్మకురా. ఆమెకి ఇల్లు, పిల్లలు, సంసారం తప్ప మరొక ధ్యాస వుండేదికాదు. ఆమె గురించి చెప్పినవాడికీ, విన్నవాడికీ కళ్ళు పోతాయి'' అన్నాడు రామం కోపంగా.

''ఆమె తన క్లయింటుతో వ్యభిచారం సాగించినట్లు దాఖలాలు కొన్ని చెప్పాడు'' అన్నాను నేను. రామం మీద నాకు కోపం వచ్చింది. ఏక పక్షమే వాదిస్తున్నాడు వాడు. నిజానిజాలు యెవరికి తెలుసు.

''అబద్ధం'' అరిచాడు రామం నిస్సహాయంగా. ఆ శబ్దం గాలిలో కలిసిపోయింది. మళ్ళా అంతలోనే తేరుకుని.

''నాయుడుగూడా రెండు మూడు సంవత్సరాల నుండీ అతని క్లయింటు గదా! చెప్పమనరా వాడ్ని.ఆమె ఎలాంటిమనిషో'' అన్నాడు రామం నాయుడి వేపు చూసి.

''ఆమె చాలా ఉత్తమురాలని విన్నానురా! వాస్తవానికి పిల్లల్ని తప్ప నేను యెవ్వర్నీ చూడలేదు'' అన్నాడు.

''మరి అలాంటప్పుడు ఎందుకు అలాంటి పాపానికీ ఒడిగట్టావ్?'' అన్నాడు రామం బాధగా. నా కాశ్చర్యం వేసింది.

అసలు నాయుడుగూడా దక్షిణ నాయకుడే. మనోహరం భార్యతో నాయుడుకు సంబంధం వుందా? రామం ప్రశ్న నన్ను తికమక పెట్టింది. ఆలోచన్ల రంపంపొట్టు రాల్చింది.

''నీకూ ఈ సంగతి తెలిసిందా?'' అన్నాడు నాయుడు దొంగ దొరికినట్లుగా దొరికిపోయి.

''ఎందుకు తెలియదురా! నీ అంతట నీవు చెప్పకపోయినా కనీసం నీవు కోర్టులో సాక్ష్యం ఇచ్చినపుడు విన్న ప్లీడర్లు, జనం ద్వారా నాకు తెలియ దనుకొంటున్నావా'' అన్నాడు రామం.

''ఏమిట్రా అది!'' అన్నాను ఆత్రతగా

''ఈ ప్రబుద్ధుడు మనోహరంగాడు పెట్టుకున్న డైవోర్సు దావాలో వాడిభార్యకు, వీడికి సంబంధం వున్నదని కోర్టులో సాక్ష్యం చెప్పాడు'' అన్నాడు రామం బాధగా.

నాకు వాస్తవానికి నాయుడ్ని తందామనిపించింది, కానీ స్నేహితుడు.

''ఒరేయ్ ఇలాంటి సంఘటనలే నీ చెల్లెలికి జరిగితే ఏంచేస్తావురా?'' అనడిగాను.

కొన్ని కొన్ని ఎదుటివాళ్ళ అనుభవాలు తన పక్షంగా ఆలోచించుకోవటం మంచిది.

నాయుడేం మాట్లాడలేక పోయాడు. అవరిస్తున్న చీకట్లో వాడి ముఖ కవళికలు గుర్తించటానికి అవకాశంలేదు.

ట్వింకిల్ ట్వింకిల్ ఫిల్మ్‌స్టార్!

అడుగుజాడలు కృష్ణవి అవిభావికి బాట
అలాగని కాదెన్నటికీ ఇద్దరిదీ చెరోమాట
నటనలో ఆమె కెన్నో కలికి తురాయిలున్నా
స్వదర్శకత్వంలో తయారయిన మీనాయే
అన్నింట మిన్న
ఆమె పేరులో ఉన్న మొదటి మూడక్షరాలు
నిర్మల అజేయురాలని చెప్పటానికి అవుతాయి
సాక్ష్యాలు.

—జి. ఎన్. సూరి.



''ఒరేయ్ నాయుడూ! మనం చదువుకున్నవాళ్ళం. ఈ తరానికి ప్రతినిధులం. ఇంతో అంతో మానవత్వం ఉన్నవాళ్ళం. ఏ పనయినా ఆలోచించి చెయ్యాలి న్యాయం కోసం, ధర్మంకోసం పోట్లాడక పోయినా కనీసం అధర్మం, అన్యాయం జరగకుండా చూడాలి'' అన్నాడు రామం. నాయుడి మీద వాడికింకా కోపంపోలేదు వాడి మాటల్లో బాధ మాత్రం ప్రతిధ్వనిస్తున్నది.

''మీకు తెలియదురా నే నెటువంటి పరిస్థితుల్లో సాక్ష్యం చెప్పాల్సి వచ్చిందో! విలేజ్ పాలిటిక్సులో మేం వేసిన సివిల్ క్రిమినల్ దావాలన్నీ వాడిదగ్గరే వున్నాయి. నేను మొదట ఒప్పుకోకపోతే మా నాన్నగారి ద్వారా ఒత్తిడి తెచ్చి, అంగీకరింప జేశాడు. వాడో గుంట జిత్తుల నక్కరా. నా పాపానికి విష్కృతి లేదురా!'' అన్నాడు బాధగా.

''సరేలే ఎవరి జీవన పరిణామానికి ఎవరు బాధ్యులు'' అన్న రామం మాటలతో సంభాషణ ముగిస్తూ, గుడ్‌నైట్ చెప్పుకొని ఎవరి గూళ్ళకు వాళ్ళం చేరిపోయాం.

* * *

కొంచెం వర్షం పడుతున్నాది.

హోటల్ రూం కిటికీలోనుండీ చూస్తే కరెంట్ కొరతవల్ల లైట్లులేక నల్లటి తార్పాలిన్ కప్పుకున్నాయి వీధులన్నీ. ఆ రోజు నాయుడు పార్టీ ఇస్తున్నాడు రూంలో. స్కాచ్ విస్కీ కళింగపట్నం నుండి తెచ్చాడు.

గాలిలోకి మూడు గ్లాసులు లేచాయి. చీర్స్ చెప్పుకున్నాయి. గది వెచ్చగావుంది. మధువు శరీరాన్ని వేడెక్కిస్తున్నాది.

''ఎంతవరకూ వచ్చింది మనోహరం గాడి డైవోర్సు'' అనడిగాడు నాయుడ్ని. రామం.

''ఇంకా ఆర్గ్యుమెంట్సు కావాలి'' అన్నాడు.

మనోహరం అంటే నాకు జ్ఞాపకం వచ్చింది.

''ఒరేయ్ వాడు ఎవర్తెనో వెంటేసుకొని కార్లో వైజాగ్ వేపు వెళ్తూ కనిపించాడురా. గెడ్డం గట్రా ఏమీ లేవు. మీసాలు మాత్రం వున్నాయి'' అన్నాను.

''ఎవర్తినో తీసుకుని వెళ్తున్నాడూ. అవునుమరి ఎంతకని వుండగలడు బ్రహ్మచారిగా'' అన్నాడు రామం. వాడికి మనో

హారంమీద గొప్ప కోపం. కొంచమయినా సింపతీ లేదు.

"ఎవర్తో కాదురా! అది వాడికి కాబోయే పెళ్ళాం" అన్నాడు నాయుడు.

మా ఇద్దరి నోటమ్మంట మాటరాలేదు. ఆ పిల్లను గురించి కొన్ని విషయాలు మనోహరం గాడు చెప్పివుంటాడను కున్నాం.

"వివరాలు చెప్పరా" అన్నాను ఆతృతగా.

రెండోరౌండుకు గ్లాసులో విస్కీపోసి సోడావాటర్ కలిపాడు, అయిసుముక్కలు గ్లాసులోకి జారవిడుస్తూ.

"ఏం చెప్పమంటావురా వాడి సంగతి. ఈ రోజు ఉదయం వెళ్లాను. కోర్టు వాయిదాలు తెలిసికోవడానికి. గుమ్మాలన్నీ కొత్త తెరలు కట్టబడివున్నాయి. ఎప్పుడూ మ్రోగని రేడియో వాళ్ళింట్లో శ్రీలంక సంగీతం పాడుతోంది మనోహరాన్ని కేకేశాను. గది గుమ్మం తెర తొలగింది గాజుల చప్పుడు వినిపించింది. నేను తలెత్తి చూశాను అంతే మెరపులా మాయమయ్యింది. ఎక్కడో చూసాను ఆమెను కొన్ని క్షణాల్లో మనోహరం వచ్చాడు కొత్తపెళ్ళికొడుకులా వున్నాడు హుషారుగా డ్రాయింగురూంలో కూర్చున్నాం ఇంతలో ఆమె రెండు కప్పుల కాఫీ తీసుకువచ్చింది కాబోయే భార్యగా ఆమెను పరిచయం చేశాడు. నాకు తల తిరిగిపోయింది ఆమెను ఎక్కడో చూసాను. ఆమె క్షణంసేపు నిలబడి నా వంక దొంగతనంగా చిరునవ్వునవ్వి వెళ్లిపోయింది." అన్నాడు గ్లాసులో విస్కీ సిప్ చేస్తూ.

"ఎవర్రా ఆమె? మీ బంధువా?" ప్రశ్నించాను, ఆతృతగా.

"బంధువూ కాదూ, పాడూ కాదూ, ఒకప్పుడు పెక్కలీలో, పలసాలో మహాజనానికి మరదలు పిల్ల రా! నేనామె పాత ఖాతాదారుడ్ని సోంపేటలో. ఇది వీణ్ణి ఎలాగ ఆకర్షించిందో నా కర్థం కాలేదు. పైగా ఆ మనోహరంగాడు. దాన్నిగురించి 'ప్రశంసిస్తూ' 'ఏ పూర్వ పుణ్యఫలమో నాయుడూ దెబ్బతిన్న నా జీవితాన్కి అలాంటి అమ్మాయి లభించటం' అంటూ ఒకటే యిది. వాడి మాటలు వింటే నాకు ఒంటిమీద జెర్రులు ప్రాకాయి "

"పోనీ మనం 'ఆ అమ్మాయి బజారు మనిషి నీ వెధవ తెలివి ఏడిసింది' అని ఆకాశరామన్న ఉత్తరంరాస్తే . "రామం గొప్ప అయిడియా వెలిబుచ్చినట్లుగా ఫోజు పెట్టాడు.

"దానివల్ల వాడొదిలేసిన అమ్మాయి జీవితం బాగుపడదురా" అన్నాను.

"నిజమేరా! వాడొక డాక్టరు దగ్గర కెళ్ళి తను శారీరకంగా సంసారం చెయ్యడానికి అనర్హుడనని సర్టిఫికేటు అడిగాడు. కానీ మానవత్వం గల డాక్టరు కోపంతో వాడికి గెట్ అవుట్ చెప్పాడు" నాయుడు.

"చూడరా వాడెంత ప్లాను వేశాడో.

అలా సర్టిఫికేటు సంపాదిస్తే తన పిల్లలు, తన పిల్లలు కారని, వేరే యెవరికో పుట్టా రని భార్యమీద నిందవేసి విడాకులు సంపా దించాలని ఆశించాడు'' అన్నాడు రామం బాధగా.

నాకు వొళ్లు గగుర్పొడిచింది. అనాగ రిక జాతులు గూడా చేసుకోలేని ఆత్మ వంచన అతనిది.

''ఒరేయ్ మనోహరంగాడి జీవితంలో ఒక రకమైన హిస్టీరియాలాంటి పురుగు ప్రవేశించింది. అది శరీరంలో నుండే కండరాలనే కాకుండా మనస్సును గూడా తినేస్తుంది. అంతస్థుతో, డబ్బుతో, మందు లతో దాన్ని బాగుచేసుకోలేం. అది బాగు పడడానికి మానసిక సంస్కారం కావాలి. మనోహరంలాంటి చెదపురుగు, తన స్వార్థంకోసం ఏమైనా చేస్తాడు. దానికి అనుమానం అనే విచ్చెనను ఆధారం చేసు కుంటాడు. ఇలాంటి వాడికి సాంఘిక బహిష్కరణ జరగాలి. వాడు చేసిన పాపా నికి వాడు తవ్వుకున్న గోతి లోపలి కాలమే వాడిని సర్వనాశనం చేస్తుంది వాడొక చెదపురుగు వాడి చరిత్ర '' విస్కీ కిక్కు యిచ్చింది. సమంగా మాట్లాడలేక పోయాడు

నాకా రోజు మనోహరం చేసిన రిక్వెస్టు జ్ఞాపకం వచ్చింది.

''అవును సమాజానికి మనోహరం లాంటి చెదపురుగు చరిత్రను చాటి చెప్పే కథను రాయాలి'' అనుకున్నాను వేదనగా. పార్టీ అయిపోయి, యింటికి వెళ్లడానికి రిక్షా ఎక్కుతూ. ★

చ్చదువుకో మన్నంతవరకు చదువుకుని, చేసుకోమన్న పెళ్ళిచేసుకుని. పిల్లలనికని యింకేముంది అయిపోయింది బ్రతుకు అనుకుంటూ వంటింట్లో పడి బ్రతుకీడుస్తున్నారు . .ఆడదాని అదృష్టం బాగుంటే నూటికో కోటికో ఒక స్త్రీ కోరుకున్నట్టు భర్త లభించి అభిప్రాయాలు కలిసి మనసులు కలిస్తే ఆమె అదృష్టవంతురాలు। మనదేశంలో వివాహం లాటరీ లాంటిదే। కొంతమంది ఆడవాళ్లు - వాళ్ళకేం కావాలో కూడా తెల్సుకోలేరు. దొరికిన దానితో సంతృప్తి పడగలిగే అదృష్టవంతులు. మరి కొంతమంది ఆశించింది పొందగలిగిన అదృష్టవంతులుంటారు. ఎటొచ్చీ తమకేం కావాలో తెలిసీ కావల్సింది పొందలేక పొందినదానితో తృప్తిపడలేనివాళ్ళే నిజంగా దురదృష్టవంతులు।। ఈ అనర్థానికంతటికీ కారణం-నేటి భావస్వాతంత్రం, వ్యక్తి స్వాతంత్రం. ఆర్థిక స్వాతంత్రం ఏదీ లేకుండా ఎప్పుడూ పురుషుల ఆధీనంలో వుంచుకుని ఆమె వ్యక్తిత్వానికి విలువ నీయకుండా

''కేవలం ఆర్థికస్వాతంత్ర్యం వున్నంత మాత్రాన సమస్య పరిష్కారం అవుతుందనుకొంటే మీకు ఆర్థికస్వాతంత్ర్యం వుండి ఏం చెయ్యగలిగారు?'' కళ్యాణి ఆవేశాన్ని అడ్డుతూ అడిగింది సుజాత

''నిజమే. ఒక విధంగా నీవన్నదీ నిజమే। మంచి ప్రశ్నే। మనుష్యులలో మార్పు రావాలి. హృదయంలో పరివర్తన రావాలి.



## : జ రి గి న క థ :

డాక్టర్ కల్యాణి దగ్గర హౌస్ కీపర్ సుజాత. కల్యాణి దగ్గర అసిస్టెంటుగా చేరిన రామకృష్ణ, సుజాతలు ప్రేమించుకున్నారు. వారి పెళ్లి కళ్యాణే జరిపించింది. కళ్యాణి భర్త డాక్టర్ రంగారావు త్రాగుబోతు. భార్యను చాలా హీనంగా చూస్తుంటాడు. బావ ఆనంద్ వచ్చి తన దగ్గర వున్నంతకాలం ఉత్సాహంగా ఉండేది కల్యాణి. ఎంతో మంచిదనుకున్న కల్యాణి భర్తను మోసంచేస్తూ బావతో ప్రేమకలాపాలు సాగించడం వింతగా అన్పించింది సుజాతకు. సుజాత అనుమాన నివృత్తిచేస్తూ తనకథ చెప్పసాగింది కల్యాణి.

కల్యాణి మామయ్య కొడుకు ఆనంద్. బీదవాడు. కల్యాణి ఇంట్లోనే ఉండే వాడు. యౌవనంలో ప్రవేశించిన కల్యాణి,ఆనంద్ లు ప్రేమించుకొన్నారు. కల్యాణి తండ్రి వారి పెళ్ళికి వప్పుకోలేదు. కల్యాణి ఎదురు తిరిగింది. ఆనంద్ ఇంట్లోంచి వెళ్ళ గొట్టబడ్డాడు. కళ్యాణిని బలవంతాన పెళ్లికి వప్పించారు. కల్యాణిని చూడటానికె ఆనంద్ చాలా కాలానికి రావడంతో ఆనందం, బాధపట్టలేక అతన్ని కౌగలించు కొని ఊరటచెందింది కల్యాణి. అదిచూచిన ఆమెభర్త రంగారావు వీరిద్దరినీ అనుమా నించి, ఆనంద్ ను అవమానించి పంపాడు. యుద్ధంలో గాయపడ్డ ఆనంద్ ను కల్యాణి ఇంటికి తీసుకురావడంతో భార్యాభర్తల మధ్య కలత లెక్కువయ్యాయి. రంగారావు స్త్రీలోలుడై, తన ప్రియురాలిని ఇంటికి తీసుకురావడంతో పరిస్థితులు మరింత అధ్వాన్నమయాయి. అది సహించలేని కళ్యాణి రంగారావుపై విరుచుకు పడింది. రంగారావు పిల్లల్ని తీసుకుని ఇల్లువదిలి పోయాడు_బిడ్డల ఎడబాటు సహించలేని కల్యాణి రంగారావు దగ్గరకెళ్లి తిరిగి రమ్మని ప్రాధేయపడింది. రంగారావు కల్యాణి అభ్యర్థననూ అంత తేలికగా ఒప్పుకోలేదు. చివరకు తానడిగినంత డబ్బు ఇస్తూ, తనేం చేసినా ప్రశ్నించకుండా వుండే 'కండిషన్' తో తిరిగి ఇంటికి వచ్చాడు.

— ముగింపు చదవండి —

సంఘంలో చైతన్యం రావాలి. ఆడదానికి ఓటుహక్కు వుంది. చదివిస్తున్నాం. ఉద్యోగాలు చేయనిస్తున్నాం యింత కంటే యింకేం కావాలి అంటూ బుజాలు చరుచుకుంటూ, యింట్లో భార్య దగ్గరికి వచ్చేసరికి అన్ని కబుర్లు గాలిలో కలిసి పోయే మనస్తత్వాలు మారాలి! స్త్రీకి ఆర్థికస్వాతంత్రం వుంటే నీవన్న పెద్ద మార్పులేకపోయినా, కనీసం ఏదన్నా జరిగితే ఎదుర్కోగలను అనే మనో నిబ్బరం వుంటుంది ఉదాహరణకి నా విషయమే చూడు నాకే చదువు, ఉద్యోగం లేకపోతే, స్వాతంత్ర్యంగా నా కాళ్ళమీద నేను నిలబడే అర్హతే నాకు లేక పోతే నా బ్రతుకింకెంత నరకమయ్యేదో ఆలోచించు...ఆయనెంత హింసించినా నీవే

దిక్కు అని పడుండాల్సిందే తప్ప నేను నోరు తెరిచి నన్ను సమర్థించుకునే అవకాశమన్నా నాకు వుంటుందా? ఆయన ఈ మాత్రంగానైనా నన్ను వదిలారంటే కారణం ఆర్థికంగా ఆయన మీద ఆధార పడక్కరలేదు. నా బ్రతుకు నేను బ్రతకగలను అన్న ధీమా నాకుందని ఆయన గ్రహించబట్టేకదా! '' సుజాత అంగీకారంగా తల ఊపింది.

''ఏమిటో ఒకదాన్లోంచి ఒకదాన్లోకి వెళ్ళిపోతున్నాను ఎంత చెప్పుకున్నా మన సమాజంలో ఆడదాని స్థితి ఏమీ ఎదగలేదు! వస్తున్నమార్పులు, వచ్చేమార్పులు అన్నీ స్త్రీ వ్యక్తిత్వానికి సంబంధించనివి. ఎవరో రచయిత్రి అన్నట్టు 'మన అభ్యుదయం చేతికి వాచికట్టుకు మొగుడితో సినిమాకి వెళే వరకు వచ్చింది' అన్నదానిలో రవ్వంతయినా అబద్ధంలేదు. ఎంత చదువుకున్నా, పురుషులతో సమానంగా ఉద్యోగం చేసినా నోరు తెరిచి ఏ విషయంలోనన్నా మన అభిప్రాయం చెప్పుకోలేని మనం సాధించిన అభ్యుదయం ఏమిటో అర్థంగావడంలేదు! ఎవరన్నా కాస్త తెగువకల ఆడది చెప్పితే ఆమెని అందరూ బరి తెగించింది, చెడిపోయింది అని వెలేస్తారు ఆమెని! జీవితాంతం కలిపి బ్రతకాల్సిన వ్యక్తిని ఎన్నుకోడంగా స్వాతంత్రం కూడా లేని మనం ఏం ప్రగతి సాధించాం? మనసులు కలవని మనిషితో విడిపోయే అవకాశం, ధైర్యంగా విడిపోయి సమాజంలో గౌరవంగా బ్రతకగలిగే స్థాయికి చేరని మనం సాధించిన స్వాతంత్ర్యం ఏమిటి?''

''నిజమే మీరన్నట్టు విడిపోవడం పెద్ద కష్టంకాదు. ఆ తర్వాత ఎదుర్కోవలసిన పరిణామాలని తలుచుకునే-అంటే వాళ్ళకి పుట్టిన పిల్లలకి పుట్టగతులుండవు సవ్యంగా పెళ్ళిళ్ళు కావు భర్తనించి విడిపోయిన ఆడదాన్ని రెండోపెళ్ళి చేసుకునే సంస్కారవంతులు అయిన మొగాళ్లు యింకా మనదేశంలో కరువయినప్పుడు ఆ ఆడది ఒంటరి జీవితం భరించలేక, ఆ సమాజంలో రక్షణదొరక్క ఏదో మొగుడు యిక్కడే పడుందామనుకుంటోంది. అలా విడిపోయిన ఆడదానికి మామూలుగా ముట్టాల్సిన గౌరవమర్యాదలు లభించవు. ఆ అవమానాలని, అవహేళనలని సహించే శక్తి ధైర్యంలేక, భవిష్యత్తు వుండదన్న భయంతోనూ, పిల్లల జీవితాలు పాడవుతాయన్న భయంతోనూ ఏ ఆడదీ తనున్నది నరకం అని తెలుసుకున్నా బయటికివస్తే అంతకంటె నరకంలో పడాల్సివస్తుందన్న భయంచేతే బయట పడలేకపోతూంది . అంచేతే ఏ కాపురం చూసినా బలవంతంగా తప్పదు అన్నట్లు కలిపి మెలిపి బ్రతుకుతూ జీవితం గడిపేస్తూంటారు మనదేశంలో ఆడవాళ్లు.'

''నిజంగా సుజాతా, నీలాంటి అదృష్టవంతులు—అంటే ప్రేమించిన మనిషిని పెళ్ళిచేసుకోగలిగే అవకాశం మనలో ఎందరాడవాళ్ళకివుంది? మనసుకినచ్చిన మనిషిని పొందితే ఆ బ్రతుక్కి అర్థం కలిస్తుంది. లేకపోతే ఆ బ్రతుకు ఎవరికోసమో బ్రతికే బ్రతుకే అవుతుంది! అలాంటి జీవితంలో ఏ ఆనందాలు, అనుభూతులు వుంటాయి!'' కళ్యాణి దీర్ఘంగా నిట్టూరుస్తూ అంది.



ట్వింకిల్ ట్వింకిల్ ఫిల్మ్‌స్టార్!

ఆర్జాని సినీపరిభాషలో తర్జుమా చేస్తే
అంజనేయుడు
ఆ కేరక్టర్ పోషించటంలో ఆయన
కడుసమర్థుడు
కొండొకచో తిరిగి మరోసారి అవుతాడు
రామభక్తుడు
అదే మనం ఆయనలో చూసే పడవ
నడుపు గుహుండు
ఏ పాత్రలోనైనా అవుతాడు ఇట్టే విలీనుడు
అందుకే ఒకటి రెండు సార్లు అయ్యాడు
విలనుడు.

—జి. యన్. సూరి.

---

"కానీ, ఎంతోమంది ప్రేమించుకుని పెళ్ళిళ్ళు చేసుకొన్నవాళ్లని చూస్తూంటాం. భార్యభర్తలు కాగానే, ఓ ఏడాది తిరగ్గానే అన్ని ప్రేమలు చప్పబడిపోయి వాళ్ళూ మామూలు భార్యాభర్తల మల్లే కీచులాటలు ఆడుకునేవాళ్ళని ఎందరినో చూస్తాం. అంటే ప్రేమ అన్నది దొరకనంతవరకే నిలుస్తుందంటారా? ఎంతటి ప్రేమగాని లభ్యమవగానే విలువని కోల్పోతుంది అని అంటారు. అమాత్రం దానికి అంతటి అస్థిరమైన ప్రేమకోసం ఎందుకింత ఆరాటం, ఆవేదన, పడడం? ఓ ఆర్నెల్లలోపోయే ప్రేమకోసం ఎందుకింత బాధపడడం.''

"కాదు సుజాతా! అమాట నిజంగాదు ప్రేమ అన్నది—నిజమైన ప్రేమ అయితే హృదయపూర్వకంగా ప్రేమించిన ప్రేమ ఆ హృదయం అన్నది వున్నంతకాలం వుంటుంది. బాహ్యాకర్షణ చూపి మోజులో పడి, ఆకర్షణలకి లొంగి అది ప్రేమను కుంటే తప్పకుండా అలాంటి ప్రేమలు ఆర్నెల్లు తిరిగేసరికి ఉద్రేకాలు చప్పబడిపోగానే పోతాయి. ఒకరిపట్ల ఒకరికి వుండేది ఆకర్షణ మాత్రం అయితే ఆ ఆకర్షణ కోరింది లభ్యమవగానే కొద్దిరోజులకే పోతుంది. ప్రేమకి, ఆకర్షణకి అర్థం తెలియక ప్రేమించామనుకొని ఒకరినొకరు మోసం చేసుకోడంకాక, ఆత్మవంచన చేసుకొంటారు. ప్రేమకి, ఆకర్షణకి తేడా—మనసులని స్పందింపచేసేది ప్రేమ శరీరాలకి ఆరాటపడేది ఆకర్షణ. నిజమైనప్రేమ ఆకర్షణ పోయినంతమాత్రాన పోయేది గాదు. అందం కరిగిపోయి, యవ్వనం కరిగిపోయినా ఒకరికొకరు కావాలనిపించేది, ఒకరికోసం ఒకరు తపించేది ప్రేమ! ఎన్నేళ్ళుగడిచినా ఒకరినొకరు నిత్య నూతనంగా కనిపింపచెయ్యాలి! అలా కనపడకపోతే అది ప్రేమేకాదని నా ఉద్దేశం! దురదృష్టవశాత్తూ యీ ప్రేమించుకున్నా

మనుకొన్న వాళ్ళందరూ ప్రేమించుకున్నా మన్న అపోహలోపడి పెళ్లిళ్ళు చేసుకోగానే ఆ ప్రేమ పోయిందనుకుంటూ వాపోతారు. అది ప్రేమకాదని తెలుసుకోలేక ''

సుజాత అర్ధమయిందన్నట్టు తలాడించింది తనూ, రామకృష్ణా అంతేనా! కాదు కాదు తననితానే, నమ్మించుకుంటూ అనుకుంది సుజాత.

'సుజాతా, ఏ ఆడదానికీ సంసార సుఖానికి దూరమై, ఆ ఇల్లు నరకం అనుకుంటూ ఆ యింట్లోనే మగ్గే దురవస్థ రాకూడదని నాకోరిక అలా అనుకుంటూ ఆ యింట్లో బ్రతికే ఆడది జీవచ్ఛవంతో సమానం. అలాంటి ఆడవాళ్ళకి యిప్పుడే కాక పోయినా, మరొకనాటికన్నా ధైర్యంగా ఆ యింట్లోంచి వెళ్ళగలిగే సాహసం రావాలని, అలావెళ్ళిన ఆడదానికి మామూలు గౌరవ మర్యాదలు ముట్టే రోజులు రావాలని, అలాంటి ఆడదాని జీవితంలో కోరుకున్న వసంతం మళ్ళీ పొందగలిగే అవకాశాలు దొరకాలని, దొరికే రోజులు రావాలని నా ఆకాంక్ష! అలా వెళ్ళగలిగిన స్త్రీని సానుభూతితో చూడగలిగే స్థాయికి మనుష్యులు ఎదగాలని కోరిక! మనసులు కలవక విడిపోవడం అన్నది నేరంగా కాక, సహజంగా తీసుకొనే సంస్కారంగా యీ మనుష్యులు అర్ధంచేసుకునే రోజులు వస్తాయని ఆశిస్తాను. అలాంటి తల్లికి పుట్టిన పిల్లలు ఏ పాప ఫలాలుకాదని, వాళ్ళని సమాజం మామూలుగా ఆదరించే రోజు ముందు తరంలోనైనా వస్తుందని ఆశిస్తాను. నా దురదృష్టం, యీనాడు నేను పడుతున్న వేదనకి ముందు తరం స్త్రీ లోను గాకూడదని నా ఆశ!'' కళ్లు మూసుకుని ఆవేదనగా అంది కళ్యాణి.

''ఆంటీ, క్షమించండి, నేనూ మిమ్మల్ని గురించి హీనంగా తలచిన సందర్భంవుంది. మిమ్మల్ని, మీ ఆవేదనని అర్ధంచేసికోలేక నేనూ ఏదో అనుకొన్నాను.''

కళ్యాణి శుష్కహాసం చేసింది. ''నీ తప్పేముంది? తెలియనివాళ్లెవరన్నా అలాగే అనుకుంటారు. అయినా సుజాతా, యిప్పుడింక ఎవరు ఏం అనుకొన్నా నాకేం లెక్కలేదు. బావకోసం యీ లోకం అంతా కలిసి ఎన్నన్నా భరించగలను! నాక్కావలసిన బావని పొందడానికి 'వ్యభిచారిణి' అన్న ముద్రని సంతోషంగా వేయించుకోగలను. యింకీ లోకం నన్నేం చెయ్యగలదు''.

''అవునుగానీ, ఆ తర్వాత మీ బావగారి రాకపోకలకి రంగారావుగారూ అభ్యంతరం చెప్పలేదా? అడ్డుకోలేదా?''

''ఆయనకి యింకా నన్ను అడ్డుకునే, అభ్యంతరం చెప్పేశక్తి ఏమన్నా మిగిలిందనా నీ ఉద్దేశం? ఆయనని చూస్తున్నావుగా అంతలా అలవాట్లకి బానిస అయిన ఆయనలో ఆత్మ విశ్వాసం, ఆత్మ స్థైర్యం యింకా ఏంవుంది? శారీరకంగానే కాక మానసికంగా ఆయనలో యింకేశక్తి మిగలలేదు. అన్నివిధాల బలహీనులు అయిపోయారు. నన్ను కాదంటే డబ్బురాదని, డబ్బు లేకపోతే సంపాదించుకోగల సామర్థ్యం ఏమి మిగలని ఆయన నన్నేవిధంగా కాదనగలరు?'' అయినా అప్పుడప్పుడు పాత పౌరుషం మరిచిపోలేనట్లు బావని చూసి ఎగిరిపడుతుంటారు. నన్ను ఏదో హేళనగా, వ్యంగ్యంగా ఎత్తి పొడు

స్తూంటారు. మమ్మల్ని యిద్దర్నీ మింగేసేట్లు చూస్తూంటారు. అయితే సాధారణంగా ఆయన నన్ను తప్పించుకోడానికే ప్రయత్నిస్తారు. బావ వచ్చినప్పుడు అసలు ఎదుట పడాల్సివస్తుందనో, చూసి వూరుకోడం తనకి అవమానమో అన్నట్లు బావ వచ్చిన సంగతి తెలిస్తే యింటి పట్టున వుండరు. ఎప్పుడన్నా కంటబడినప్పుడు మాత్రం ఏదో అంటూంటారు. అంతకంటె ఆయనలో ఏ శక్తీ లేదు. నాలుగు రోజులక్రితం డాక్టర్ మిత్రా ఫోనుచేశారు. ఆయన వంట్లో బాగులేదని ఎగ్జామ్ చేయించుకోడానికి అక్కడికి కెళ్ళారని. ఆయన లివర్ బాగా దెబ్బతిందని యిలాగే యింకా త్రాగుతూంటే యింకో రెండు సంవత్సరాలకంటె ఎక్కువ బ్రతకడని, మీరు చూస్తూ ఎలా వూరుకుంటున్నారు, ఆయనచేత యీ త్రాగుడు మాన్పించకపోతే ప్రమాదం' అని హెచ్చరించారు మిత్రా! చూస్తూ వూరుకోక నేను చెయ్యగలిగింది ఏముంది? ఆయనని నేను ఎంత ద్వేషిస్తున్నా భార్యగా కాకపోయినా, తోటి మనిషిగా బొత్తిగా చూస్తూ వూరుకోలేకపోయాను. ఎంతయినా ఆయన నా పిల్లల తండ్రి! ఎంత కాదనుకున్నా వివాహ బంధం యింకా మిగిలేవుంది! కావాలని ఆయన నాశనం కోరలేనుగదా! ఆ డాక్టరు చెప్పాక ఆయననే వారిని హెచ్చరించమని కోరాను. ఆయనకి మాత్రం తెలీదా ఆయనా డాక్టరేగదా, తన స్థితి ఆయన తెలుసుకోలేరా? అయినా వుండబట్టలేక ఆయనని హెచ్చరించడం భార్యగా కాకపోయినా తోటి మనిషిగా ధర్మమని భావించి మొన్న ఆయనతో ఆ డాక్టరు అన్నమాట చెప్పాను. ఆయన తలెత్తి వికారంగా నవ్వి హేళనగా "ఆహా .. నామీద క్రొత్తగా ప్రేమ, దయ పుట్టుకొచ్చిందా? ఏం నటన? నే చస్తే వాడిని కట్టుకుందామని ఎదురుచూస్తున్న నీవు నా ఆరోగ్యం గురించి పాపం బాధపడ్తున్నావా? మైడియర్ గర్ల్ డోంట్‌వర్రీ నేను చావను నిన్ను వదిలి నేను చావను. ఒకవేళ చావాల్సివస్తే నిన్ను నాతో తీసికెడతానులే" క్రూరంగా, కసిగా నవ్వాడు. అలాంటి మనిషికి ఇంకేం చెప్పను? ఆయన ఆరోగ్యం పూర్తిగా పాడయింది. కానీ, నేను చెయ్యగలిగింది ఏమిలేదు ..." కళ్యాణి వ్యధగా అంది. సుజాత విచారంగా తల వంచుకొంది.

"సుజాతా! నా యీ చీకటి జీవితంలో నాలుగు మూలలనించి చుట్టుముట్టిన యీ అంధకారంలో చిన్న వెలుగురేఖ బావ. యీ చీకటిలో ఆ చిన్న వెలుగే నాకు బ్రతకగలిగే ఆసరానిస్తూంది. బావకేమన్నా అయితే మిగిలిన యీ చిన్న వెలుగు ఆరిపోతే యింక యీ చీకటిలో తడుములాడుకుంటూ బ్రతికే ఓపిక నాకు లేదు సుజాతా. యీ యుద్ధాలన్నీ నా మనశ్శాంతిని హరించడానికే వస్తున్నాయి. అనుక్షణం ప్రాణాలుగ్గబెట్టుకొని ఏ కబురు వినాల్సివస్తుందోనని ..కళ్యాణి మాట పూర్తికానేలేదు. 'టెలిగ్రాం' అన్న పిలుపు వినిపించింది. కళ్యాణి మొహం క్షణంలో నల్లబడిపోయింది. సుజాత ముందుకు వెళ్ళి టెలిగ్రాం సంతకంచేసి తీసుకొని కళ్యాణికి యియ్యబోయింది. 'నేను చదవలేను ... చదువు' వణుకుతున్న పెదాలతో అస్పష్టంగా

అంది కళ్యాణి. తుపానులో చిగురుటాకులా ఆమె శరీరం కంపించసాగింది. వళ్లంతా అరక్షణంలో చెమటలు పట్టేసాయి.

సుజాత కాస్త కంపిస్తూ టెలిగ్రాం చింపింది. చదువుకున్న ఆమె మొకంలో భావం పసిగట్టి . కళ్యాణి భయంతో 'సుజాతా' అని మాత్రం అంది

"ఏంలేదు ..ఏంలేదు మరేం భయం లేదు ఏం అవలేదు మీరు కంగారుపడకండి'' ఆమె మొహంలో భావానికి భయపడుతూ నెమ్మదిగా ధైర్యం చెప్పబోయింది.

"నిజం చెప్పు ఏం జరిగింది బావ కేమయింది? ఏం జరగకపోతే టెలిగ్రాం ఎందుకువస్తుంది. అక్కడినించేనా వాళ్లేనా యిచ్చారు' భయవిహ్వలయి అదురుతున్న పెదాలతో అంది కళ్యాణి.

"భయపడడానికి ఏంలేదు, 'మిస్సింగ్' అని మాత్రం యిచ్చారు. ఎక్కడో క్షేమంగా వుండే వుంటారు. మీరేం దిగులు పడకండి ''

ఆమాత్రం కూడా ఆశించని కళ్యాణి ఆ మాటకి కాస్త ప్రాణం పోసుకుంది. ఆరాటంగా సుజాత చేతిలోంచి టెలిగ్రాం లాక్కుని చదివింది. నిన్నటినించి ఆనంద్ " మిస్సింగ్ అన్నది చదువు తూంటే అంతవరకు భయంతో కరడు గట్టిపోయిన ఆమె మనసు తిరిగి స్పందించడం ఆరంభించింది. ఆమె కళ్ళు నీళ్లతో నిండాయి.

మీ రనవసరంగా భయపడుతున్నారు. ఆయనెక్కడో క్షేమంగావుండే ఉంటారు. సుజాత అనునయిస్తూంది. ధైర్యం చెప్పబోయింది.

"ఎక్కడున్నాడో.. ఏమయ్యాడో.... ఏం తెలుస్తుంది! ఏం జరిగిందో కూడా తెలియకుండా ఎన్నాళ్ళిలా బాధపడాలో! ఎక్కడ దెబ్బతిని పడిపోయాడో ఎక్కడ విమానం కూలి ఎవరికంటాబడకుండా వుండిపోయాడో. బ్రతికున్నాడో లేదో ఎవరినడగను, ఏం చెయ్యను ఎందుకు నన్నిలా చిత్రహింస పెడ్తున్నాడు దేముడు! యింకా నా మీద కక్ష తీరలేదుగాబోలు బావా ఏమయ్యావు?'' వెక్కివెక్కి ఏడుస్తున్న కళ్యాణిని ఓదార్చడానికి మాటలు కరవయిపోయాయి సుజాతకి. "క్రితంసారి దెబ్బలు తగిలినా కంటికి ఎదురుగా కని పించాడు. యీసారి అదీ కరవయింది. నేనే పాపంచేశానని యింతంత శిక్ష విధి స్తున్నాడు. బావా, నీకేమన్నా అయితే నేనెలా బ్రతకగలను? నన్నెంచేసిపోయావు బావా!''

ఆమె దుఃఖాన్ని తీర్చగల శక్తి సుజాత కేది?

## 55

"కళ్యాణీ! ఎన్నాళ్ళిలా ఏడుస్తావు నా కోసం? నీ వుండగా నాకేం లోటు కళ్యాణీ, నాకంటివెలుగువి నీవుండగా నాకు వచ్చిన కష్టం ఏమిటి? లే, కళ్యాణీ'' మంచంమీద కూర్చున్న ఆనంద్ క్రింద కూర్చుని తనవడిలో తలపెట్టి హృదయ విదారకంగా ఏడుస్తున్న కళ్యాణి తలనిమిరాడు ఓదారుస్తూ—

"బావా! నా చీకటి బ్రతుకుకి నీవు వెలుగువనుకున్నాను. ఎప్పటికన్నా ఏనాటికన్నా నా బరువులు బాధ్యతలు అన్నీ వదుల్చుకుని నీ దగ్గిరికి వచ్చి నీ వడిలో

ట్వింకిల్ ట్వింకిల్ ఫిల్మ్‌స్టార్!

తెలుగు నాటకరంగంపై ఒకప్పుడు
తిరుగులేని "దొర"బాబు
చలనచిత్రసీమకు ఇప్పుడు విభిన్నపాత్రల్ని
అందిస్తున్న షరాబు
డైలాగు డెలివరీలో అమెచ్యూర్లకు
ఈయనొక కితాబు
నటుడిగా తెలుగువాళ్లు గర్వించే
మరొక షొహరాబు (మోడి)
గంభీర స్వరరావు గోపాలరావు
సంభాషణలతోనే చేస్తాడు
అందర్నీ ఘెరావ్.

—జి. ఎస్. సూరి.



విశ్రాంతిగా యిన్నాళ్ళ నాశ్రమని, నా కష్టాలని మరిచి విశ్రమిద్దామనుకున్నాను. యీ చీకటిని చీల్చుకుని వెలుగులోకి ఎప్పటికన్నా పయనించగలనన్న నిబ్బరంతోనే రోజులు లెక్కపెట్టుకుంటూ నెట్టుకొస్తున్నాను. నాకు వెలుగు నియ్యాల్సిన నీ జీవితం అంతా అంధకారంలో నిండిపోతే ఎలా భరించను బావా! ఇంకే ఆశతో యీ బ్రతుకును నెట్టను బావా! ఎప్పటికీ విశ్రాంతి అన్నదిలేకుండా యిలా నేను జీవితాంతం మగ్గిపోవలసిందేనా.''

"హు ఉన్నవాళ్లు చాలరన్నట్టు నేను ఒకడిని తయారయ్యాను. యీ మోస్తున్న భారం చాలదన్నట్టు మరింత భారం మోపాను కదూ'' వ్యథగా అన్నాడు.

"బావా! అలా మాట్లాడకు అలా మాట్లాడి నన్ను మరింత హింసపెట్టకు. నేనన్నది నీ కర్థంకాదు. నా ఆవేదన అది కాదు.''

"అర్థమయింది కళ్యాణీ. నీ పిల్లలు పెద్దవాళ్ళయి, తల్లిగా నీ బాధ్యత నెరవేర్చుకున్నాక యీ యిల్లు వదిలి నా దగ్గరకి రావాలని, యిన్నాళ్ళశ్రమని మరిచిపోయి నా రక్షణలో నా ప్రేమలో సేదతీరి హాయిగా మిగిలిన రోజులు నిశ్చింతగా దొర్లిద్దామనుకున్నావు. చివరి రోజుల్లోనయినా ప్రశాంతిగా బ్రతకాలనుకున్న నీ ఆశలని, కలలని సమూలంగా నాశనం చేశాను. కళ్యాణీ, నిన్ను దగ్గిరికి తీసుకుని నీకు శాంతి చేకూర్చాల్సిన నేను ఇలా ఎందుకూ పనికిరాకుండా, అనుక్షణం ఒకరిమీద ఆధారపడుతూ బ్రతకాల్సిన అప్రయోజకుడినైపోయాను. ఇంక నిన్నే విధంగానూ ఆదుకోలేని అసమర్థుడినైనాను. నీవే నన్ను ఆదుకోవలసిన నిస్సహాయ స్థితి నాది... కళ్యాణీ యీ బ్రతుకుకంటే చావు వచ్చివుంటే కనీసం దేశంకోసం చచ్చిపోయానన్న తృప్తైనా మిగిలేది.

ఎవరికోసం యీ బ్రతుకు?'' భారంగా అంటున్న ఆనంద్ నోరు మూసింది కళ్యాణి 'అలా మాట్లాడకు బావా' అంటూ.

''బావా, నీకు కళ్లులేకపోతే నాకళ్ళు వెలుగు యిస్తాను. నీకు కాలులేకపోతే నిన్ను నడిపించే చేతులు నాకున్నాయి. నీకు నేనుండగా నీకు ఏలోటు రాదు బావా. నా కంఠంలో ప్రాణంవుండగా నీకే ఇబ్బంది జరగదు. యీ విధంగానైనా నీవు నాకళ్ల ముందు నిలిచావన్న తృప్తి మిగిలింది. యీ చిన్న తృప్తితో ఈ బ్రతుకుభారాన్ని యీడుస్తూంటాను.''

''హు అంతకంటె చెయ్యగలిగింది ఏముంది? మన యిద్దరికలలని శాశ్వతంగా సమాధిచేసుకుని చావలేక బ్రతుకుతూందాం ఎంత దౌర్భాగ్యులం మనం! కళ్యాణీ అన్నింటికంటె నా యీ అవిటితనం. గుడ్డితనం వీటన్నికంటె నన్ను బాధిస్తున్నది నీ సంగతే కళ్యాణీ జీవితాంతం యింక నీవిక్కడ మగ్గాల్సిందేనని. యిలా యింటిభారాన్ని మోస్తూ నా అసహాయత్వానికి నీవు బలి అయిపోతావన్నదే నా గుండెలని పిండుతూంది. నేనేం చెయ్యను? నీకేవిధంగా యింక సంతోషం యీయగలను! అబ్బ! కళ్యాణీ, యీ నిరాశని, యీ నిస్సహాయతని భరించలేను'' బాధగా నిస్సహాయంగా జుట్టు పీక్కున్నాడు ఆనంద్.

ఒకరినొకరు ఓదార్చుకోడానికి కూడా మాటలులేనట్టు ఒకరికోసం ఒకరు ఏడుస్తూ కూర్చోడం గత పదిరోజులుగా కళ్యాణి ఆనంద్‌ల దినచర్య అయింది.

ఆనంద్ కనపడడంలేదన్న టెలిగ్రాం వచ్చిన రోజు మొదలు యీరోజువరకు కళ్యాణి ఏడవని క్షణంలేదు. ఆనంద్ కనపడడంలేదన్న వార్తకి కొన్నాళ్లు. ఆతరువాత ఆనంద్ ఆచూకి దొరికిందని. కానీ దురదృష్టవశాత్తు ఆనంద్ విమానం క్రింద పడిపోయిందని. కూలిపోయే ముందు ఆనంద్ క్షేమంగా బేల్ అవుట్ కాగలిగాడని. కాని శత్రువులకి చిక్కకూడదన్న హడావిడిలో పరిగెడ్తున్న ఆనంద్ ఓ మైన్‌మీద కాలువేయడం. కాలు ఎగిరిపోవడంకాక క్రింద కూలిపోతున్న ఆనంద్ కళ్ళలో కూడా ఆ చెణుకులు తగలడం అలా ఒకరోజు ఎవరూ చూడని స్థితిలో పడివుండడం. తరువాత ఆస్పత్రికి చేర్చినట్లు, కాలు తీసివేసారని, కళ్లు దృష్టి వచ్చేది లేనిది యిప్పుడు తెలియదని మిలటరీ అధికారులనించి ఉత్తరం చూసిన కళ్యాణి దుఃఖం ఎక్కువయింది! ఆనంద్ కాలుపోవడం, కళ్ళువస్తాయో రావోనని పదిహేనురోజుల దుర్భరనిరీక్షణ. ఆఖరికి ఆనంద్‌కింక చూపురాదన్న నిజంతో గుండెలు బద్దలుకావడం అవిటివాడయిన, అంధుడైన ఆనంద్ యిల్లుచేరడం వీటిల్లో ఏది కళ్యాణి దుఃఖాన్ని యినుమడించనిది! నెలా పదిహేనురోజుల్లో శోకమూర్తయింది కళ్యాణి. నిద్రాహారాలు లేవు! ఎవరు ఏం చెప్పి ఆమెని ఓదార్చగలరు? ఆమె దుఃఖాన్ని ఉపశమింప చెయ్యగలరు?ఆశక్తి వున్న ఆనంద్ తనకోసంకాక, తనబ్రతుకుకికాక, కళ్యాణి బ్రతుకుకోసం ఏడుస్తున్న ఆనంద్ ఆమెని ఓదార్చగలడు! ఆనంద్ యింటికి వచ్చింది మొదలు కళ్ళ ఎదుట

బావ దుస్థితిచూస్తూ కుమిలి కుమిలి ఏడవడం తప్ప మరో పనిలేదు కళ్యాణికి. గత నెలరోజులుగా పిచ్చిదానిలా తయారయింది ఆమె.

ఆస్పత్రికి వెళ్ళడం పూర్తిగా మానేసింది. ఆస్పత్రిపని అంతా రామకృష్ణ మీదే పెట్టేసింది. ఇంటి పని అంతా ఎలాగూ సుజాతదే। ఆనంద్‌కి మొహం కడిగించడం, కాఫీ త్రాగించడం, పనివాళ్ల సహాయంతో స్నానంచేయించడం, బట్టలు మార్చడం, భోజనం తినిపించడం నిద్ర పుచ్చడం మిగతాసమయంలో ఒకరికోసం ఒకరు, ఒకరిని కావలించుకు ఒకరు ఏడవడమే దినచర్యగా మారింది. ఒకక్షణం కనుమరుగయితే ఆనంద్‌కేదేనా అవసరం వుంటుందేమోనన్నట్టు భోజనం కూడా ఆ గదిలో తప్పచేసేది కాదు కళ్యాణి.

ఆమె ధోరణికి- ఆమెని మళ్ళీ మామూలు మనుష్యులలో ఎలా పడెయ్యాలో యింట్లో సుజాతకి. రామకృష్ణకి అర్ధంగాలేదు. అలా కొన్నాళ్లుంటేపూర్తిగా పిచ్చిదయిపోయే ఆమె ధోరణికి ఏంచేసి ఆమెని మళ్ళీ మామూలు ధోరణికి తీసుకురావాలో బోధపడలేదు ఎవరికీ. ఆస్పత్రిలో రామకృష్ణ ఒక్కడూ అందరిని సంభాళించుకోలేక అవస్థపడసాగాడు. ఆఢపేషంట్లు కళ్యాణి లేదని అసంతృప్తి ప్రకటిస్తున్నారు. రామకృష్ణతో పరీక్ష చేయించుకోడం యిష్టంలేక చాలా మంది పేషంట్లు తిరిగి వెళ్ళిపోతున్నారు. ఏం చెయ్యాలో తోచనిస్థితిలో కొన్నాళ్లకయినా కళ్యాణి తేరుకుంటుందని మళ్లీ మామూలు నిత్యకృత్యాలలో పడ్తుందని ఆశించిన రామకృష్ణ అదేం కనపడకపోవడంతో ఓరోజు వున్న పరిస్థితి వివరించాడు. అది విని కళ్యాణి నిర్లిప్తంగా వుండిపోయింది. 'రామకృష్ణా నన్ను బాధపెట్టకు-ఏంచేస్తావో ప్లీజ్ నీవే చూసుకో నేను బావని వదిలి రాలేను నన్ను బాధపెట్టకు' అంది.

"కళ్యాణీ ఏమిటీ పిచ్చి, ఎన్నాళ్ళిలా నాదగ్గిర కూర్చుంటావు పనులు మానుకుని, నాకేం కావాలన్నా సుజాతని అడుగుతాను. నీవు ఆస్పత్రికి వెళ్ళకపోతే ఎలా కళ్యాణీ." ఆనంద్ మందలించాడు.

"ఆంటీ, ఆనంద్‌గారికే లోటు రాకుండా నేను చూస్తాను. మీరేం భయపడద్దు. యిలా యిరవై నాల్గు గంటలు యిక్కడ కూర్చుంటే ఏడవడంతప్ప ఏం చెయ్యడంలేదు. యిలా ఎన్నాళ్ళు గడుపుతారు? పనిలోకి వెడితే మనసు కాస్త తిరుగుతుంది. కాస్త ప్రశాంతంగా వుంటుంది." సుజాత నచ్చచెప్పసాగింది.

"మేడమ్. మీరు లేక ఎంతోమంది వెళ్ళిపోతున్నారు. యిలాగే కొన్నాళ్లుంటే, ప్రాక్టీసు అంతా చెదిరిపోతుంది." ఆదుర్దాగా అన్నాడు రామకృష్ణ. "ఈ నెలలో మామూలులో సగంకూడా రాలేదు. ఇలా అయితే ఎలా గెటాన్ కాగలరు?"

"కళ్యాణీ, యీ యింటి భారం నీమీద వుంది. మీ ఆయన ఖర్చులు, యింటి ఖర్చు అటు అత్తయ్య రోగిష్టి, ఇటు నేను, యిందరిని ఏం పెట్టి పోషిస్తావు. రామకృష్ణ ఒక్కడే ఏంచేస్తాడు?

కళ్యాణి విసుగ్గా తల త్రిప్పింది. "బావా, నాకేం చెయ్యాలనిలేదు. నిన్నిక్కడ విడిచి నేనక్కడ కెళ్ళలేను. నా

మనసు దేనిమీద లేదు. నా బుర్ర చెడి పోయింది. నాకేం వద్దు. నన్నిలా పడి వుండనీండి. వెళ్ళు రామకృష్ణా. నర్సుల సహాయంతో నీవేం చెయ్యగలుగుతే అధే చెయ్యి. ఎంతమంది పేషంట్లు వుంటే అంతమందినే చూడు. ఇంటి ఖర్చు జరిగి పోతే చాలు. ఆయనని ఖర్చులు తగ్గించుకో మను. లేకపోతే డబ్బియలేను అని చెప్పేస్తా. నేనింక యీ న్యూసెన్స్ అంతా భరించలేను. నా మనసు సరిగాలేదు. నన్ను యిబ్బంది పెట్టకండి.''

''కళ్యాణీ, నీ వరస ఏం బాగులేదు. నా రాక ఎప్పటికప్పుడు ఏదో ఒక అవాంతరాన్ని, అశాంతినే తెస్తూంది. యిప్పుడు యిలా నీవు పనిపాట్లు మానుకుని ఇరవై నాల్గు గంటలూ నా దగ్గిర ఏడుస్తూ కూర్చుంటే నేను సంతోషిస్తాననుకున్నావా?'' ఆనంద్ తీవ్రంగా అన్నాడు. ''కళ్యాణీ యిప్పుడు నిన్ను కాదని ఎక్కడికీ పోగలగడానికి నిస్సహాయుడినై పోయాను. నీ దగ్గిరే పడివుండాల్సిన నా మీద యింత దయచూపించి నన్ను సిగ్గు పరచకు.''

''బావా!'' తీక్షణంగా అంది కళ్యాణి, ''ఏమిటా మాటలు? రామకృష్ణా, ప్రస్తుతానికి కొన్ని రోజులు వదిలేయ్ నన్ను. కొన్నాళ్ళు నా మనసు స్థిమితపడనీ. తరువాత చూద్దాం.'' రామకృష్ణ, సుజాత ఇంకేమనలేక అక్కడనించి వెళ్ళిపోయారు.

''కళ్యాణీ, ఇలారా'' ఆనంద్ ఆమె చెయ్యి పట్టుకుని దగ్గిరకి లాక్కున్నాడు. ''కళ్యాణీ. ఎందుకింత అభిమానం చూపిస్తావు నా మీద? ఎప్పుడూ నీకు దుఃఖం తప్ప మరింకేమీ యీయలేని నామీద నీ కెందుకింత ప్రేమ! నీ బ్రతుకులో నిప్పులుపోసిన నన్నెందుకింత ఆదరిస్తావు. నీ ప్రేమానురాగాలకి నేననర్హుడిని కళ్యాణీ. నీ ప్రేమ ముందు నేను నిలబడగల అర్హత కూడా నాకు లేదనిపిస్తూంది. నాలో ఏం చూసి ప్రేమిస్తున్నావు యింకా, యీ కుంటివాడ్ని. గుడ్డివాడిని యింకా ఏం మిగిలిందని నామీద యింత అనురాగం చూపిస్తున్నావు?'' వ్యధగా అడిగాడు ఆనంద్. కళ్యాణి శుష్కహాసం చేసింది.

''హు ..పోయిన నీ కళ్ళని, కాళ్లని కాదు బావా నేను ప్రేమించింది. ప్రేమకి నిర్వచనం తెలియచెప్పిన నీవే ఏంచూసి యింకా ప్రేమిస్తున్నావంటే ఏంచెప్పను? ముందులో నీ అర్హతల్ని చూసి ప్రేమించి వుంటే ఆ అర్హత లీనాడు కోల్పోగానే ప్రేమ పోయుండేది నేను ప్రేమించింది నీ మనసుని బావా, ప్రేమకి గుడ్డితనం, కుంటితనం అడ్డం వస్తాయని నీకు తెలియకనే అడుగుతున్నావా? బావా, యిదివరకటి కంటె నిన్నిప్పుడు ఎక్కువ ప్రేమిస్తున్నాను బావా, నా ప్రేమ, నా ఓదార్పు యిప్పుడు నీకు మరింతగా కావాలని నాకు తెలుసు బావా'' ఆనంద్ గుండెలమీద తల ఆన్చి అనురాగంతో అంది కళ్యాణి.

ఆ ప్రేమానురాగాలలో తన్మయించడం మినహా ఆనంద్ ఏం జవాబు చెప్పలేక ఆమె తల నిమురుతూండిపోయాడు.

## 56

రెండు నెలలు గడిచాయి. ఉదయం ఆనంద్‌కి స్నానం చేయించి బట్టలు తొడిగి కుర్చీలో కూర్చోపెట్టి తను స్నానానికి

వెళ్ళింది కళ్యాణి.

"కళ్యాణీ, అప్పుడే స్నానం అయిందా" అన్నాడు ఆనంద్ అడుగుల చప్పుడువిని.

"నేను నీ కళ్యాణిని కాను. కళ్యాణి మొగుడ్ని" రంగారావు అదోలా నవ్వుతూ అన్నాడు. ఆనంద్ ఆశ్చర్య చకితు డయ్యాడు. రంగారావు త న గ ది లో కి రావడం-మాట్లాడడం, ఏమనాలో కూడా తోచలేదు. ఆ గొంతు, ఆ నవ్వులో ఏదో అనుమానం తొంగిచూసింది.

"మిస్టర్ ఆనందరావ్ నేనీ గదిలోకి ఎందుకు వచ్చానా అనుకుంటున్నట్లున్నావు గదూ" రంగారావు ఆనంద్ దగ్గిరగా అడుగులు వేశాడు. "యిదిగో చూడు. యీ చేతిలో ఏముందో చూడు. సారీ మై బాయ్, పాపం గుడ్డివాడివి నీవేం చూడగలవులే." వికటంగా నవ్వాడు. ఆనంద్ ఒక్క క్షణం చలించి అంతలోనే నిలదొక్కుకున్నాడు.

"రంగారావుగారూ, నా కళ్ళు చూసే శక్తిని కోల్పోయాయి గాని, నా మనసు యింకా ఆ శక్తిని కోల్పోలేదు." స్థిరంగా అన్నాడు. "మీ చేతిలో పిస్తోలో, కత్తో వుంది."

రంగారావు ఒక్క క్షణం అడుగు వెనక్కి వేశాడు. అంతలోనే మళ్ళీ తేరు కుని, "గుడ్ అయితే నేనెందుకు వచ్చానో కూడ గ్రహించగలవు."

ఆనంద్ బెదరకుండా, నిగ్రహం కోల్పోకుండా స్థిరంగా అలాగే కూర్చుని, "తెలుసు, కానీండి మీపని. నేను కోరు కునేది అదే. అయితే ఒక్క విన్నపం, ఆ చేత్తోనే కళ్యాణిని చంపండి. అప్పటి కైనా ఆమె యీ బాధలనించి విముక్తి పొందుతుంది. ఈ లోకంలో ఒకటిగా బ్రతికే అవకాశంలేని మాకు పై లోకంలో నన్నా కలిసి బ్రతికే అవకాశం కల్పిస్తే మీ మేలు మరవలేం. అదొక్కటే నా ప్రార్థన."

"నో...నో....నా భార్యని చంపు కుంటానా? సారీ! వెరీసారీ. అంత పాపా నికి వడిగట్టను. ఆమెని చంపి నా పిల్లలని అనాథలని చెయ్యను. కళ్యాణిని అంత సుఖవుగా చంపేసి సుఖపడనీయను మిస్టర్. చచ్చిపోవడంలో ఆమెకి సుఖం దక్క డానికి వీలులేదు. అనుక్షణం ఆమె చిత్ర హింస ననుభవిస్తూ బ్రతుకుతూండాలి. నిన్ను చంపి ఆమెకి నరకం సృష్టించి, కుళ్ళి కుళ్ళి ఏడ్చేట్టు చేస్తాను." కసిగా ఒక్కొక్క మాట నొక్కి పలికాడు.

"హు! ఎందుకంత కక్ష ఆమె మీద మీకు?"

"కక్ష? పగ! నాకు అది చేసిన అవ మానానికి ప్రతీకారం! నన్ను చేసిన మోసా నికి ప్రతిఫలం ప్రతి నిమిషం అనుభ వించాలి. నీవల్ల నా జీవితం నాశనం అయింది. నిన్ను చంపి దాని జీవితం నాశనం చేయడమే నా కోరిక. దాన్ని చంపితే కథేముంది మిస్టర్ ఆనందరావ్. అది బ్రతకాలి. నీ చావుకి అది కుళ్ళికుళ్ళి ఏడుస్తూంటే నేను చూసి ఆనందించాలి. అప్పటికిగాని కసి చల్లారదు. లేకపోతే యీ రెండు నెలలునించి నాకు డబ్బీయ కుండా అల్లరిపెద్తుందా! ముష్టి రెండు వందల రూపాయలు నెలకి పడేస్తూందా. నీవల్లే అది ఆస్పత్రికి కూడా వెళ్ళకుండా కూర్చుంటుంది. అన్ని గొడవలకి నీవే

మూలకారణం. నిన్ను చంపితే తప్ప అది దార్కికి రాదు. ఈ ఇల్లు మామూలు అవదు.

"మిష్టర్ రంగారావుగారూ, పాపం మీరొక్క సంగతి మరిచి పోతున్నారు. నన్ను చంపి అంత సుఖవుగా మీరు తప్పించుకోగల రనుకుంటూరా, మనిషిని చంపిన మనిషీ చావాల్సి వుంటుందన్న నిజం మరిచిపోయినట్టున్నారు."

ఆహా - హా - నీ మాత్రం తెలివి తేటలు నాకు లేవనుకోకు. నే నెలాగో రెండేళ్లు, మూడేళ్లు కంటే బ్రతకనని నాకు తెలుసు - డాక్టర్లు చెప్పారు. నిన్ను చంపి తప్పించుకునే ఉద్దేశం నాకు లేదు, జైలు కెడతాను. అదే నాకు కావాలి. నీ కళ్యాణిని కోర్టు కీడ్పించి, బోనులో నిలబెట్టి, దాని బ్రతుకంతా బట్టబయలు చేస్తాను."

"ఛీ! మీరు మనుషులు కారు. యింత హృదయంలేని మనుషులని ఎప్పుడూ అనుకోలేదు. ఆమె పట్ల ఎంత కక్ష. ఆమె ఏం చేసిందని యింత పగ! ఆమెని భార్యగా కాకపోయినా, మీ పిల్లల తల్లి అని అయినా ఆలోచించలేరా!" ఉద్వేగంతో అన్నాడు ఆనంద్.

"ఆ, ఆ పిల్లలకోసమే, దాన్ని చంపకుండా వదిలాను. అది బ్రతకాలి, బ్రతుకుతూ అనుక్షణం చావాలి" కసిగా, వికటంగా అన్నాడు.

ఆనంద్‌కి రంగారావు అన్నింటికి తెగించి వచ్చాడని అర్థం అయింది. ఆ క్షణంలో అతని చేతుల్లోంచి తప్పించుకోడం తనకి అసాధ్యం అన్నదీ అర్థం అయింది. తను సహాయానికి అరిచినా, ఈ లోపల అతని పని పూర్తి చేస్తాడు. తనకి ఏలాగో చావు తప్పదు! చావుకి భయపడడు తను! కాని, కళ్యాణి ఏమవుతుంది! ఎలా బ్రతుకుతుంది. ఈ హింస, కోర్టులు, కేసులు అవమానాలని ఎలా తట్టుకుంటుంది. తనేం చెయ్యగలడు? కళ్యాణినెలా రక్షించగలడు. ఏదో చెయ్యాలన్న ఆరాటం ఆనంద్ మొహంలో కన్పించింది. అది రంగారావు పసిగట్టాడు. క్రూరంగా నవ్వి, "మిష్టర్, నిన్నెవరు ఆదుకోడానికి రారు. నీవు నా చేతిల్లోంచి తప్పించుకోలేవు అన్నది నీకూ తెలుసు, కళ్యాణి స్నానం చేస్తుంది. రామకృష్ణ మేడ మీద వున్నాడు. సుజాత వంటగదిలో వుంది. ప్రక్క గదిలో ముసలది మంచం లోంచి కదలలేదు. అంచేత ఈ క్షణంలో నా చేతిలో నీకు చావు తప్పదు. ఓ నిమిషం టైము యిస్తాను. పాపం ఆ దేవుడిని ప్రార్థించుకో. నీ ప్రియురాలిని మళ్ళీ జన్మలోనైనా పొందే భాగ్యం కల్గించమని." వికటంగా నవ్వసాగాడు రంగారావు. ఆనంద్ వళ్లు జలదరించింది.

సరిగా ఆ క్షణంలో గుమ్మంలో అడుగు పెట్టిన కళ్యాణి, గదిలో దృశ్యం చూసి ముందుకి అడుగు వేయడం మరిచి దిగ్భ్రమరాలై వుండిపోయింది. కళ్యాణి రాకని గుర్తించి రంగారావు, "గుడ్, సరిగా సమయానికి వచ్చావు. మరీ మంచిది నీ కళ్ళతో నీవే చూడమ్మ నీ బావకి పట్టే గతి" కళ్యాణి పరిస్థితి అర్థం చేసుకుని కెవ్వుమని అరిచి ముందుకు వురికింది. అది గుర్తించి రంగారావు, తనమీదికి ఉరికిన కళ్యాణిని ఎడంచేత్తో నెట్టుతూ కుడిచేతితో

పిస్తోలు పేల్చాడు. ఒకటి, రెండు, మూడు పిస్తోల్‌లో గుళ్లు అన్నీ అఖరయ్యేవరకు అలానే కాలుస్తూనే వున్నాడు. రంగారావు చేతిలో పిస్తోలు లాగడానికి పెనుగులాడిన కళ్యాణి మొదటి రెండు గుళ్లు పేలగానే ఆనంద్ వైపు అలా చూస్తూ కొయ్యబారి పోయింది. ఆనంద్ తల వాలిపోయింది. రెండో గుండుకే అతనిలో చలనం ఆగి పోయింది. కుర్చీలోంచి క్రిందకి బోర్ల పడి పోయాడు. కళ్యాణి అరుపులకి, పిస్తోలు శబ్దానికి సుజాత, రామకృష్ణ, పనివాళ్లు అందరూ పరుగెత్తి వచ్చారు. రామకృష్ణ వస్తూనే రంగారావు మీదకి దుమికి చేతి లోంచి పిస్తోలు లాగడానికి ప్రయత్నిం చాడు. అప్పటికే జరగాల్సింది జరిగిందని తెలియక. అందరిని విడిపించి పిస్తోలులో గుళ్లు అఖరయ్యేవరకు కాల్చేశాడు, రంగా రావు. అందరూ చేష్టలు దక్కి బొమ్మల్లా నిలబడ్డారు. కళ్యాణికి ఏం చూస్తుందో అర్థం కాలేదు. ఆమె తల గిర్రున తిరి గింది, కళ్ళముందు చీకటి వలయం, అలా కుప్పగా కూలిపోయి స్పృహతప్పి పోయింది.

రెండు నిమిషాలు జరిగాక రంగా రావు పిస్తోలు క్రిందపారేసి ఫోనువైపు నడిచాడు. రామకృష్ణ తెలివి తెచ్చుకుని రంగారావు దగ్గిరకి కెళ్ళి "ఆగండి, కాస్త ఆలోచించండి తొందరపడకండి ఏం చెయ్యాలో ఆలోచిద్దాం." రామకృష్ణ బుర్ర పనిచెయ్యడం మానేసింది. పోలీసులు ఆయ నకి శిక్ష... యిదంతా ఏమిటీ ఏంచెయ్యాలీ అర్థంగాలేదు అతనికి. కంగారు కంగారుగా ఏదో అన్నాడు. రంగారావు నిర్లక్ష్యంగా నవ్వాడు. "ఇంకా ఆలోచించడానికి ఏముంది? పోలీసులు వస్తారు. నన్ను అరెస్ట్ చేస్తారు. అది తప్పించుకోవాలని నాకేం లేదు. అలా జరగడమే నాకు కావాలి' అంటూ పోలీసు స్టేషనికి డయల్ చేశాడు. ఇంటి ఎడ్రసు చెప్పి హత్య జరిగింది, హంతకుడు ఇక్కడే వున్నాడు వెంటనేరండి అంటూ ఫోను పెట్టేశాడు.

సుజాత తేరుకుని కళ్యాణి దగ్గరకి పరి గెత్తింది. నీళ్లుతెచ్చి మొహంమీద జల్లింది. కళ్లువిప్పిన కళ్యాణి రక్తంమడుగులోవున్న ఆనంద్‌ని చూసి కెవ్వుమని అరచి మళ్ళీ స్మృతి కోల్పోయింది. రామకృష్ణ, సుజాత కలిపి కళ్యాణిని ప్రక్క గదిలోకి తీసికెళ్లి పడుకోబెట్టారు. తెలివి వస్తూండడం ఆనంద్‌ని అడగడం మళ్లీ తెలివితప్పడం ఫిట్స్‌లా రావడం ఆరంభించింది కళ్యాణికి. రామకృష్ణ ఆమెకి ఇంజక్షన్ యిచ్చాడు.

పోలీసులు వచ్చారు. రంగారావే అంతా స్వయంగా వివరించాడు. ఇనస్పెక్టరు ఆశ్చర్యపోతూ విన్నాడు. రామకృష్ణని వివరాలు అడిగాడు. అంతావిని రంగా రావుని అరెస్ట్‌చేశాడు. పోలీసు డాక్టరు, ఫొటోలు జరగాల్సిన తతంగం అంతా జరిగింది.

రెండు మూడు గంటల తర్వాత తెలివి వచ్చిన కళ్యాణి స్థితి, ఆమె దుఃఖం చెప్ప డానికి మాటలులేవు. ఆమె దుఃఖం చూసి సహించడం దుర్లభమయింది అందరికి, మాటిమాటికి తెలివి తప్పిపోతున్న ఆమె పరిస్థితి చూసి రామకృష్ణ బలవంతంగా ఆమెకి ఇంజక్షనిచ్చి పడుకో బెట్టేశాడు. ఇంకా శవాన్ని అక్కడుంచడం మంచిది

కాదని వెంటనే తనే పూనుకుని దహన కాండ జరిపించేశాడు. ఆగది తలుపులు మూయించేశాడు. సాయంత్రం పోలీసు యినస్పెక్టరువచ్చి కళ్యాణిని కల్సుకుని అడిగిన ఏ ప్రశ్నకీ కళ్యాణి జవాబీయ లేదు. ఏం చెప్పలేను నన్నేం అడగద్దు అంది. ఏడ్చి ఏడ్చి ఇంక కన్నీళ్లు లేనట్లు అలా స్థాణువులా కూర్చుండిపోయింది చలనరహితంగా. ఆమె దగ్గిరికి వెళ్ళడానికి, ఓదార్చడానికి, ధైర్యంచెప్పడానికిగానీ ఎవ రికీ నోరురాలేదు.

## 57

"సుజాతా, యింకా ఏడుస్తూనే వున్నావా? ఎంత ఏడ్చినా మాత్రం ఏం లాభం?" సుజాత దగ్గిరకివచ్చి ఆమెని దగ్గిరకి తీసుకుని ఓదార్చసాగాడు రామకృష్ణ అతని గుండె లకి హత్తుకుపోయి ఏడుస్తూ "ఆంటీ ఆవిడది ఎంత దౌర్భాగ్య జీవితం! ఏ ఆడ దానికీ ఆమె జీవితంలాంటి జీవితంవద్దు పాపం విధి ఎప్పటికప్పుడు ఆమెకి ఎదురు తిరిగి ఆమెతో ఆటలాడింది, అన్నీవుండి, ఏ సుఖానికీ నోచుకోని బ్రతుకయి, నిండు జీవితం అర్ధాంతంగా ముగిసిపోయింది" భారంగా అంది సుజాత.

"ఒక విధం ! నాకు ఆవిడ మంచిపనే చేసింది అనిపిస్తూంది. ఆనంద్ పోయాక ఆమె బ్రతకడం అనుక్షణం నరకమే అవును . ఆవిడకి జీవితంలో ఏ ఆశ మిగిలి దని ఆవిడ బ్రతకగలదు! ఒక్క పిల్లలకోసమే ఆవిడ బ్రతకాలి! యిన్నాళ్లూ వాళ్ళకోసమే బ్రతికింది. కాని యిప్పుడు ఆ బంధాన్ని తెంచుకోగల విరక్తి వచ్చింది ఆమెకి. పిల్లలని మనం చూసుకుంటాం అన్న నిబ్బరం ఆమెని చచ్చిపోవడానికి ప్రోత్సహించింది. అందుకే నిశ్చింతగా చచ్చిపోగలిగారు.' కళ్యాణి కథంతా సుజాత ద్వారా విన్న రామకృష్ణకి కళ్యాణి యింక బ్రతకలేదన్నది అర్థం అయింది. సుజాత నిట్టూర్చింది.

"ప్చ్. ఏ ప్రేమకథకీ ముగింపు సుఖాంతం అవదు కాబోలు! ప్రేమికులకి ఎడబాటే దేముడి శాపం అనుకుంటా! ప్రేమకి నిర్వచనం కన్నీళ్లేనా! ప్రేమకి, ఆరాధనకి యిటు కనబడే మనుష్యులు, కనబడనిదేముడు అంతా విరోధులై నిల బడడం ఎంత దురదృష్టం! ప్రేమసాఫల్యం పొందేవరం నూటికో కోటికో ఒకరికే దక్కుతుందిగాబోలు."

"నిజం సుజా, ఆ అదృష్టం ఎందరికి పడ్తుంది! సుజాతా, నిజంగా మనం ఎంత అదృష్టవంతులం. కళ్యాణిగారి దుస్థితి చూశాక, మన అదృష్టం కొట్టవచ్చినట్లు మరీ మరీ కనిపిస్తూంది." సుజాత చేతిని ఆవేశంగా నొక్కుతూ అన్నాడు రామ కృష్ణ.

"అవును. కోరుకున్నది లభ్యమయింది కనక మనకి దాని విలువ అర్థంకాలేదు. కాని యిప్పుడు చూస్తుంటే నేనెంత అదృష్టవంతురాలినో అర్థమవుతూంది ఈ అదృష్టాన్ని ఎన్నటికీ దూరం చెయ్యొద్దని ప్రార్థిస్తాను దేముడ్ని!" సుజాత రామకృష్ణ గుండెలలో మొహం దాచుకుని అంది.

## 58

మంగళ వాయిద్యాలు మారు మ్రోగు తున్నాయి- పెళ్ళిపందిరి కలకలలాడుతోంది. వివాహ మండపంలో వధూవరులు తలం

బ్రాలుపోసుకుంటున్నారు. మధుపర్కాలు, మంగళసూత్రం, జ్యోతులు, తలంబ్రాలు, కర్పూరదండల మధ్య మెరిసిపోతున్న రేఖని తదేకంగా చూస్తూ మైమరిచి పిల్చింది సుజాత.

"అమ్మా, అమ్మా, అన్నయ్య చూడమ్మా కూల్‌డ్రింక్స్ నేనిస్తానంటే వద్దంటున్నాడు" ఎనిమిదేళ్ళ గీత తల్లి కొంగుపట్టుకు లాగుతూ కంప్లైంటు చేసింది.

"చూడమ్మా, అందరికి సరిగా ఇవ్వడం లేదు వద్దంటే వినదు." పదేళ్ళ గోపి కోపంగా అన్నాడు.

"ఆంటీ, బ్యాగులు యింకా కావాలి సరిపోలేదు ఎక్కడున్నాయి" అంటూ వచ్చాడు రవి.

'పెద్దన్నయ్యా చూడు, గోపన్నయ్య నాకు ఫాంటాలు యీయటంలేదు. అంద రికీ యిస్తానంటే వద్దంటున్నాడు' రవి చేయిపట్టుకుని గీత బుంగమూతిపెట్టి అంది.

"ఒరేయ్ గోపీ చిన్నపిల్లదానితో నీకే మిటిరాపాపం అది సరదాపడుతోంది.దాన్ని యీయనీయరా. గీతా నాతోరా నేనిస్తాను ఆంటీ స్టోరుతాళాలియ్యి" అంటూ తాళాలు తీసుకుని గీతని వెంటబెట్టుకు వెళ్ళి పోయాడు రవి.

రవి, రేఖ, గోపి, గీత - నలుగురిని చూపి 'నానాలుగు'కళ్ళు అంటుంది సుజాత ఎప్పుడూ. రవి ఆ మాట నవ్వి 'అంద రికి రెండుకళ్ళయితే నీకు నాల్గు కళ్లెక్కడ వించి వచ్చాయి ఆంటీ' అన్నాడు. 'అవు నురా అసలు కళ్లు రెండు యివిగో యిది రెండు కళ్లు' అంటూ కళ్ళజోడు తీస్తుంది సుజాత.

'అలాగా, అయితే మా నలుగురిలో అసలు కళ్లేవి, కళ్ళజోడు కళ్లేవి' అంది రేఖ గడుసుగా. దానికి జవాబు చెప్పడానికి సుజాత క్షణంకూడ ఆలోచించదు. 'ముందున్న కళ్లు రెండు మీరు-తరువాత వచ్చినవే యీ కళ్లు' అంది నవ్వి గీతని గోపిని చూపించి.

నిజంగానే రేఖ, రవి తన పిల్లలు కారని సుజాతకి ఏక్షణంలోనూ గుర్తు రాదు. వాళ్ళిద్దరూ తన పెద్దపిల్లలనే అను కుంటుంది. ఆ పిల్లలకి తనుతల్లికాదని అన్పించదు ఆమెకి.

'మనకు వేరేపిల్లలు ఎందుకు వీళ్ళిద్ద రున్నారు మనకు చాలు' అంది సుజాత రామకృష్ణతో ఒకసారి.

'ఊహూ - వీళ్ళిద్దరూ పెద్దవాళ్లయి పోయారు. చంటిపిల్లల ముచ్చటతీరద్దూ మనకు' అన్నాడు రామకృష్ణ చిలిపిగా. 'అదికాదు. అదికాదు' సుజాత సందేహం రామకృష్ణకి అర్థం అయింది.

'మనకి పిల్లలుపుడితే వీళ్ళకి అన్యాయం జరుగుతుందని నీకు సందేహం అవునా సుజా. మనం కావాలన్నా వీళ్ళకి అన్యాయం చేయలేం. కళ్యాణిగారికి మనం అంత ద్రోహం ఎలా చేయగలం! అంత నీచు లంగా మనం మారం. ఆ మాత్రం నమ్మకం నాకుంది. నన్ను నమ్ము'అన్నాడు రామకృష్ణ. అన్నమాట ప్రకారమే రామ కృష్ణ ఎన్నడూ ఏ విషయంలోనూ రేఖ, రవిలకి తన పిల్లలకి తేడా చూపలేదు. అలాగే రేఖ, రవి కూడా గోపి గీతలను

తమ తమ్ముడు చెల్లెలిగానే భావించారు యీనాటివరకు.

'సుజా ఏమిటలా నిలబడిపోయావు. అందరూ వెడుతున్నారు-నీకోసం చూస్తున్నారు' అన్న రామకృష్ణని చూస్తూ చిలిపిగా నవ్వింది సుజాత. ముప్పైఎనిమిదేళ్ళకే కన్యాదాత వేషంలో వచ్చీరాని పట్టుపంచె కట్టి ఉత్తరీయంలో వున్న అతన్ని చూస్తుంటే గమ్మత్తుగా వుంది సుజాతకి. 'ఏంలేదు, రేఖని చూడండి-ఎంత అందంగా వుందో అచ్చు ఆంటీలా లేదూ. ఆరోజు ఆవిడ పెళ్ళిలో ఇలాగే వుండి వుంటారని పిస్తూంది.' అంది సుజాత రేఖని చూస్తూ.

"అవును....కానీ ఈనాడు రేఖలో వెల్లివిరుస్తున్న ఆనందోత్సవాలు ఆమెలో వుండివుండవు. కళకళలాడవలసిన ఆ మొహం కళావిహీనంగా కన్నీళ్ళతో నిండి వుండివుంటుంది-" గతం తలుచుకుంటూ అన్నాడు రామకృష్ణ. "ఈరోజు ఆంటీ వుండివుంటే ఎంత సంతోషించేవారో! నా బాధ్యతలు తీర్చుకున్నాను. మరో రెండేళ్ళలో రవి డాక్టరయితే ఆవిడ కోరికలు అన్నీ నెరవేరినట్లే" అంది సంతృప్తిగా సుజాత.

"పద-పద తరువాత తీరికగా ఆలో చిద్దువుగాని, ముందు ఒందర్ని పంపు" అన్నాడు రామకృష్ణ నవ్వి.

(ఐపోయింది)

# మేలుకొలుపు

కూడు నీడలేని వాడ ఓ కనిష్ఠమానవుడా
క్షుద్బాధలో దహించె ఓ ఆశాజీవుడా!
కర్షకుడా కార్మికుడా గనిపనిలో శ్రామికుడా
నవలోకపు సౌభాగ్యం సృష్టించిన నాయకుడా
మానవాభ్యుదయసేవలో మునిగి తేలె సేవకుడా
క్షుత్పిపాసదావాగ్నిలో దగ్ధమయ్యే కార్మికుడా!
రాళ్ళుకొట్టి పిండిచేసి రహదారులు వేశావు
నీ రక్తం ధారపోసి నరజాతిని పెంచావు
సాటివారి మేలు కోరి నీ మనుగడ మరిచావు
చివరకు నరసమాజంలో బహిష్కృతుడవయ్యావు!
నిన్నుచూసి జాలిచూపి పచ్చినీళ్ళు పోయరారు
ఎన్నాళ్ళీ క్షుద్బాధ మేలుకోర సోదరుడా!
నీ ప్రగతిని విస్మరించి వంచకులకు సేవ చేసి
దిక్కులేని పక్షివలె కునుకుతున్న పిచ్చివాడా!
జారచోర స్వార్థపరులు రంగులుమార్చే క్రిములు
వేషభాష నటనలతో వంచించే నరాధములు!
లే లేరా సోదరా మేలుకోర మానవుడా
నీ శక్తిని గుర్తించే వెలుగుబాట చూడరా!!

—మాగాపు అమ్మిరాజు.




రఘురామయ్య దిక్కులేని చావు చచ్చాడు.

అందుకా పల్లెటూళ్ళో విచారించిన వాళ్లెవరూ లేరు. ఒకప్పుడు అతను బాగా బతికినవాడు. పట్నంలో లాయర్ వృత్తి చేసి లక్షలార్జించాడు. వృద్ధాప్యం సమీపించగానే, మకాం బస్తీనుంచి పల్లెటూరుకు మార్చాడు. పెద్దమేడ కట్టించాడు, కొంత డబ్బుతో భూములు కొని, మిగతా డబ్బు బాంకులో నిల్వచేశాడు.

తానెప్పుడు మరణించేదీ తనకే తెలియదు గనుక వీలునామా వ్రాయటం అవసరమని ఆలోచించాడు.

అతనికి భార్యా, ఓ కొడుకూ వున్నారు. మేడను భార్యకు, ఆస్థిని కొడుక్కూ పంచా లనుకున్నాడు. తన చిన్ననాటి స్నేహితుడు, తన ప్రాణానికి ప్రాణమూ అయిన రాఘవయ్యకు ఓ వేయి రూపాయలూ, ఎలిమెంటరీ స్కూలుకు మరో వేయి రూపాయలూ చెందేటట్టు వ్రాయాలి.

అనుకున్న విధంగా వీలునామా తయారుచేశాడు.

కాని అత నసుకున్న దానికి విరుద్ధంగా జరిగింది. అతనికంటె ముందు అతని భార్య స్వర్గస్థురాలవటం మూలాన, వీలునామా మళ్ళా వ్రాయాల్సిన అవసర మేర్పడింది.

వడ్డీలకు యిచ్చిన చిన్న చిన్న మొత్తాలు మినహా ఆస్తంతా కొడుకు పేరట రాసేశాడు.

ఇలా నాలుగేళ్ళు గడిచాయి.

ఒకానొక రోజు రఘురామయ్య చెవిని దుర్వార్త ఒకటి వినవచ్చింది. తన కొడుకు ఎలిమెంటరీ స్కూల్లో పనిచేసే కిరస్తానీ పంతులమ్మతో పట్నానికి పారిపోయాడని!

రఘురామయ్యకు గుండె ఆగినంత పనైంది. కాని అది యినప గుండులాటిది కావటం మూలాన గాబోలు ఆగలేదు.

తన పరువు, ప్రతిష్ఠ మంట గలిపిన కొడుకుని తలచుకుని కుమిలిపోయాడు.

కొద్దిరోజుల తర్వాత క్షమాపణ కోరుతూ, తనను మళ్లా యింటికి రానివ్వవలసిందిగా బ్రతిమాలుకుంటూ కొడుకు వుత్తరం రాశాడు.

"కులం చెడినవాడివి. నువ్వు నా కొడుకువే కావు. ఇక్కడికి రావొద్దు, ఎట్టి పరిస్థితిలోనూ నీముఖం నాకు చూపొద్దు" అని నిష్కర్షగా జవాబు రాశాడు రఘురామయ్య.

వీలునామా మళ్ళా రాయవలసిన అగత్యం ఏర్పడింది. ఈ డబ్బూ, మేడా, పొలాలూ ఏంచేయాలి అని చాలసేపు ఆలోచించాడు.

డబ్బంతా స్కూలు పేరరాస్తే, అది కమిటీ మెంబర్ల కడుపులో పడటం ఖాయం.

ఎంతోదూరం ఆలోచించి తన ఆస్థి యావత్తు తన ఆప్త మిత్రులైన వారందరికీ పంచిపెట్ట నిశ్చయించుకున్నాడు.

అతను అనుకున్న దానికంటె ఎక్కువ కాలం బతికాడు. బాంకులో డబ్బు నేల స్థానానికి దిగింది.

రఘురామయ్య మహావైభవంగా షష్ఠిపూర్తి జరుపుకున్నాడు. అభినందనలు పంపని వాళ్లూ, షష్ఠిపూర్తికి హాజరు కాని వాళ్లూ వారసుల లిస్టులోంచి తీసి వేయబడ్డారు.

పోగా, మిగిలింది ఐదుగురే!

ఆ ఐదుగురూ ఎప్పుడూ రఘురామయ్య వెంబడివుంటూ, అతన్ని పొగడ్తలతో ఉబ్బి తబ్బిబ్బుచేస్తూ, అతని ఉప్పు తిని బతుకుతున్నవాళ్లే.

పిజానికి తన ఆస్తిని అనుభవించటానికి వాళ్లు అర్హులా, కారా అని వారం రోజులు పరీక్షించాక గాని వీలు తయారు చేయలేదు

ఆస్థి ఐదు సమభాగాలు చేయాలి.

పొలాలు, ఇల్లు అమ్మగా వచ్చిన డబ్బును ఐదుగురూ సరి సమానంగా పంచుకోవాలి ఇక సామగ్రి అమ్మి, వచ్చిన డబ్బు పంచుకున్నా సరే లేక సామగ్రినే పంచుకున్నా సరే.

ముందు హాలులోవున్న పెద్ద ఆయిల్ పెయింటింగ్ చిత్రమాత్రం మద్రాసు మ్యూజియంకు అందజేయబడాలి.

ఈ విధంగా తాను వీలు వ్రాసినట్టు అందరితోటీ చెప్పాడు. ప్రతిరోజూ వాళ్లతో, 'నా ఆస్తంతా మీ పేరట రాసేశానోయ్' అని ఏదో ఒక సందర్భంలో అంటూనే వుంటాడు.

వాళ్లు బుజా లెగరేస్తూ, 'మీరు చాల వుదారస్వభావులండీ! లేకపోతే మాలాంటి అభాగ్యులకు ఇంత ఆస్తి ఎవరు రాసిస్తారండీ!' అని తమను తాము కించపరచుకుంటూ, అతన్ని ఆకాశాని కెత్తేవారు. అతను గర్వంగా, చిర్నవ్వు నవ్వుతూ వాళ్ల పొగడ్తలు వింటుండేవాడు.

రఘురామయ్యకు యిప్పుడు అరవై అయిదేళ్ళు - ఐనా ఉక్కు ముక్కలా వున్నాడు.

ఉన్నట్టుండి ఓసారి యిద్దరు స్నేహితులు ఏదో మాటా మాటా వచ్చి మాట్లాడటం మానేశారు. రఘురామయ్య యింటికి వెళ్లటం కూడా మానుకున్నారు. ఇది తెలిసిన రఘురామయ్య వీలునామాలో ఆ యిద్దరి పేర్లూ తీసేశాడు.

పాత వీలు చించేసి కొత్తది రాశాడు. అందులో ముగ్గురి పేర్లే వున్నాయి.

ఇద్దరు ఏదో చిన్న వ్యాపారం చేసుకుంటున్నవారు - మరో అతను పోలీస్ డిపార్ట్‌మెంటులో పని చేసి రిటైర్ అయ్యాడు. ఈ మూడో అతను ప్రతిరోజూ తనకు రాబోయే ఆస్తిగురించి పలవరిస్తుండేవాడు. తనకు పోటీగా మరో యిద్దరు వుండటంవల్ల వచ్చే నష్టాన్ని తలచుకుని విచారించేవాడు.

బాంకులో డబ్బు తరిగిపోతూంది. ఇది తెలుసుకున్న ముగ్గురూ మనసులోనే కుమిలిపోయారు.

'ఈ ముసలాడింకా చావడేం!' అనుకునేవారు. ఇలా వుండగా ఓ దినాన పోలీసు మిత్రుడికి ఓ శుభవార్త అందించి. మిగతా యిద్దరిలో ఒకడు గుండె ఆగి మరణించాడు అని.

వీలు మళ్లా మార్చబడింది.

ఆస్తిని యిద్దరు స్నేహితులకూ రాసి, తన డెబ్బయ్యో జన్మదినోత్సవం దివ్యంగా జరుపుకున్నాడు.

ఇద్దరు స్నేహితులూ లోలోపల బాధపడసాగారు.

'ఈ ముసలి ముండాకొడుకు మనం చచ్చాకగాని చావడుగామోసు!' అని పోలీసు మిత్రుడితో వ్యాపారి అన్నాడు.

ఈ మాటలు రఘురామయ్య చెవిని పడ్డాయి. వెంటనే వీలులోంచి అతనిపేరు తీసేసి, "నువ్వు మళ్లా యీ గడపలో అడుగెట్టావంటే పీక నులిమేయిస్తాను. జాగ్రత్త!" అని వార్నింగ్ యిచ్చాడు.

ఇక మిగిలిన పోలీస్‌మిత్రుణ్ని అందరూ అభినందించసాగారు. "చాలా అదృష్టవంతుడివి" అంటూ.

రఘురామయ్య మంచం పట్టాడు.

వారసుణ్ని పిలుచుకరమ్మని మనిషిని పంపించాడు. కాని అతను ఏదో పనిలో వుండటం మూలాన రాలేకపోయాడు. దాంతో రెచ్చిపోయి —

'నా మాట ఖాతరు చేయనివాడికి నా ఆస్తి అనవసరంగా ఎందుకివ్వాలి? వాడు నా ఆస్తి అనుభవించటానికి అనర్హుడు' అనుకున్నాడు.

అయితే, ఈ డబ్బూ, ఆస్తి ఎవరికి రాసిచ్చేట్టు? ఈ ప్రపంచంలో ఎవ్వరూ నమ్మదగ్గవాళ్లుగా లేరు. ఎవరికీ విశ్వాసం లేదు. అంతా డబ్బుకోసం తన్ను ఆశ్రయించిన వాళ్లే!

చాలసేపు ఆలోచించి, ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాడు. వెంటనే అతి కష్టం మీద బండి చేసుకుని బాంకుకు వెళ్ళి, డబ్బంతా 'విత్‌డ్రా' చేశాడు.

పొలాల్ని అమ్మకానికి పెట్టి, వారం రోజుల్లో అమ్మి డబ్బు దగ్గరుంచుకున్నాడు.

మొత్తం డబ్బును చిన్నపెట్టెలో వుంచి, తలకింద పెట్టుకున్నాడు. తనదగ్గర నమ్మకంగా పనిచేస్తున్న పనివాడికి, ఐదు వందలరూపాయలు యిచ్చి పంపించేశాడు.

ఒంటరిగా, ప్రశాంతంగా చనిపోవాలి– ఇదీ రఘురామయ్య కోరిక.

పెట్టెలోని నోట్లమీద అగ్గిపుల్ల గీచి పడేశాడు—నోట్లన్నీ పూర్తిగా కాలినాక, ఇంటికి నిప్పంటించి, తను లోపలే పడుకున్నాడు!

* * *

పై రింజన్ పక్క వూళ్లోంచి రావలసి వుండటంవల్ల ఆలస్యం అయింది. ఇరుగు పొరుగు వాళ్ల యిల్లు తగలబడిపోకుండా వుండటానికి చేసిన ప్రయత్నాలు విఫలమైనాయి మేడ రూపులేకుండా పరశురామ ప్రీతి అయింది.

అయితే డాక్టర్‌కూ, వూళ్లోనివాళ్లకూ కలిగిన ఆశ్చర్యమేమిటంటే, మన కథానాయకుడు — రఘురామయ్య బతికే వున్నాడు.

కాని యిప్పుడతను లక్షాధికారికాడు– చేత నయాపైసకూడలేని నిర్భాగ్యుడు! ★



# ప్రపంచ తెలుగు మహాసభల స్పెషల్!




"మా ప్రపంచ తెలుగు మహాసభలను గురించి మీ 'కబుర్లు'లో ఇంతవరకూ ఏకనందుకు, నరకనందుకు కృతజ్ఞులము. మీ 'కబుర్లు' తెలుగు సాహితీయోషకు భూషణములు. 'కబుర్లు'లో కాలువలై ప్రవహించెడి హాస్య, వ్యంగ్య రసములకు భయపడిగాక. ముగ్ధులమై తమకు ఈ యుగాది నాడు మరో నూటముప్పదిమంది ఘనా ఘన ఘనా పాఠీలతోపాటు సన్మానము చేయ తలపెట్టితిమి తమరా రోజున తప్పక సభకు విచ్చేసి మేమిచ్చు చందన, తాంబూల, శాలువాది సత్కారా లందుకో ప్రార్థన" అని రాశారు తెలుగు పెద్దలు సవినయంగా ఇంగ్లీషులో ఓ ఉత్తరం.

ఈ ప్రపంచ తెలుగు సన్మానాల్లో శాలువా తప్ప మరేం ముట్టవని తెలిసి "అయ్యా! నే నింకనూ బాలుడను. డాక్టరుగారి సలహాపై కాఫీ, బీరు మాని వేసి పాలు, పెరుగు మాత్రం పుచ్చుకుంటున్న పసివాడను. మీ సన్మానం మరో పదేళ్ళకు వాయిదా వేయ ప్రార్థన. మీ రివ్వదలచిన శాలువా మాత్రం పోస్టులో పంపగలరు. వచ్చే చలికాలంలో మా బుడ్డోడికి కప్పుకు నేందుకు అది పనికి రాగలదు" అని మర్యాదగా జవాబు రాసేసేను.

అయినా ఘనమైన ఏలినవారూ, వారి సాహిత్య సలహాదార్లూ నా హాస్యాన్నీ, వ్యంగ్యాన్నీ గుర్తించేరు గదా! అని లోలోపలే ఆనందించకపోలేదు. అయితే, ఆ ఆనందం ఎక్కువ కాలం నిలవలేదు. మహాకవుల్లోనే నాకు పోటీదార్లు ఎదురయ్యేరు. వారి హాస్యరచనలు పోటాపోటీలుగా ఈ మధ్య దినపత్రికల ముఖంగా స్టేట్మెంట్ల రూపంలో వెలువడి లక్షలాది తెలుగువారిని అలరించేయి.

ఈ మహామహుల్లో ఒకరు కవి సామ్రాట్, కళా ప్రపూర్ణ వగైరా

బరుదులున్న విశ్వనాథ సత్యన్నారాయణ. వీరు చాలా ఏనుగులెక్కిన మహాకవి. మడికట్టుకుని మాత్రమే కవిత్వం రాసే ఏలినవారి ఆస్థానకవి. ఆ మధ్య కాశీలో జరిగిన సాహిత్య రేసుల్లో లక్షరూపాయల జాక్ పాట్ కొట్టేసిన అదృష్టవంతుడు.

మరో మహా పురుషుడు శ్రీశ్రీ. ఈయనకూడా మడికట్టుకునే కాగితం, కలం పుచ్చుకుంటారని విశ్వనాథవారు శెలవిస్తున్నారు. అయితే, శ్రీశ్రీగారు గంగా జలంతోనో, బెజవాడ బందరు కాల్వ నీళ్ళతోనో గాక మ్లేచ్ఛులనుండి వచ్చిన విస్కీ బాటిల్ లోని తుచ్ఛ జలంతో మడి పాటిస్తారట.

విశ్వనాథవారు ప్రభుత్వ ఆస్థాన కవి అయితే, శ్రీశ్రీ ప్రజల ఆస్థాన కవి అని శ్రీశ్రీగారి శిష్యుల నిర్వచనం. శ్రీశ్రీ గారు కూడా ఈ మధ్య ఢిల్లీలో జరిగిన స్మాల్ స్కేల్ సాహిత్య రేసుల్లో ఓ అయిదువేల రూపాయల జాక్ పాట్ కొట్టేసిన ఘనులే.

తామిద్దరం గురుశిష్యులం అని వీరిద్దరూ లోగడ పరస్పరం సర్టిఫికేట్లిచ్చుకుని ఉన్నారు. "అల్లసాని పెద్దనగారికి తెనాలి రామలింగడిమీద ఉండే ప్రేమ లాంటిది విశ్వనాథ వారికి తనమీదా ఉందని శ్రీశ్రీ లోగడ ఓ సర్టిఫికేటు రాసుకుని విశ్వనాథవారిచేత సంతకం చేయించుకున్నాడుకూడా. కాదన్న వారు లేరు. ఇంతకీ అల్లసాని వారికి రామలింగడి మీద ఉన్న ప్రేమ ఏలాంటిదీ?

ఓరోజు పెద్దనగారు భుక్తాయాసంతో తూగుటుయ్యాలమీద చేరబడి, ఖాతా దుకాణంనుంచీ చాకలోడు తెచ్చిన "స్పెషల్ కలకత్తా బంగ్లా పాన్" నములుతూ ఆలోచిస్తున్నారట.

ఇంట్లో వెచ్చాలు అయిపోయాయి. రాయలువారికి దురద పుట్టించు మహా ప్రబంధం మరొకటి రాసి బియ్యం, పప్పులు. కట్టెలు (ఆ రోజుల్లో కిరసనాయిలుగానీ, గ్యాస్ స్టవులుగానీ లేవులెండి) తెచ్చుకోకపోతే రోజులు గడిచేటట్టు లేవ్! ఏం రాద్దాం! ఎంత శృంగారం గుప్పిద్దాం!" అని ఆలోచిస్తూండగా...!

అమెరికన్ సినిమాల్లో సూపర్ మాన్ లాగా అక్కడ ఊడిపడ్డాట్ట తెనాలి రామలింగడు. "ఏమి తాతా! ఊరక కూకుంటిరి! ఊతునా?" అని పరామర్శించేట్ట!

సరే! వీళ్ళ విప్లవం ఏమిటో కూడా చూద్దాం! పోయిందేముంది!" అనుకుని విరసం అధ్యక్షుడయిపోయిన శ్రీశ్రీ లాగా పెద్దనగారు "సరే! పనివా డెలాగూ లేడు! వీడిచేత కాసేపు ఊపించుకుందాం" అనుకుని! "ఓ! యస్! రామలింగా, యువార్ ఎ గుడ్ బోయ్! యుమే స్టార్ట్!" అని శలవిచ్చేరుట. రామలింగడు మరుక్షణం నోట్లో నానుతున్న కారాకిళ్ళీ రసం కాస్తా తుపుక్కున పెద్దనగారి మీదికి ఊసేశాడుట.

ఈ మోట సరసానికి ఉగ్రులై పోయిన ప్రబంధ సామ్రాట్టు తక్షణం కాలినున్న పాంకోడు విసరగా అది తగిలి రామలింగడి ముందు పళ్లు మూడూ అక్కడికక్కడే రాలి పడ్డాయట.

అదీ వారి గురుశిష్య సంబంధం. అదీ వారి సరస శృంగారం.

వారి వారసులం అని తమకు తామే సర్టిఫికేట్లిచ్చుకున్న మన మహాకవుల స్టేట్ మెంట్ల సరసం కూడా ఆ స్థాయి

లోనే ఉందనిపిస్తోంది.

"మనవాళ్లుత్త వెధవాయలోయ్!" అని ఏనాడో అన్నాడు గిరీశం, అనిపించాడు మహాకవి గురజాడ.

విశ్వనాథవారు ఈ కాలపు అపురూప వ్యక్తి. మంత్రించిన దర్భల్ని గాలిలోకి వదిలితే అవే విప్లవాన్ని తెస్తాయని వారి ప్రగాఢ విశ్వాసం. విప్లవం అంటే జంధ్యాన్ని రోజూ ఉతికి పెట్టుకోవటం, తెల్లారకముందే లేచి సచేల స్నానంచేసి పంచముల కంటపడకుండా గుళ్ళోకి మారి తెల్లారేదాకా జపం చేయటం, శూద్రుల్ని ఉప్పు పాతరవేసే హక్కు తన బోంట్లకు ఉండటం అని విశ్వనాథ వారి భావం.

పూర్వం ఓ రాజు మీదికి మరో రాజు దండెత్తగా, ఈ రాజుగారి ఆస్థాన పురోహితుడు ఆవునెక్కి సైన్యాన్ని వెంటేసుకుని నిరాయుధంగా ఆ దండెత్తి వచ్చిన సైన్యం ముందుకు నడిపించేడుట. ఎగదీస్తే బ్రహ్మహత్య, దిగదీస్తే గోహత్య! ఎలాగురా అనుకుని ఆ భారతీయ హిట్లర్ మర్యాదగా వెనుదిరిగిపోయేడుట!

సదరు పురోహితులవారి పవిత్ర రక్తం ఈ కలికాలంలో తనొక్కడిలోనే ఉందనుకునే మహామహుడు విశ్వనాథ.

విప్లవం పూచిక పుల్లల్తో రాదు. చీపురు కట్టల్తో (?) రాదు. తుపాకి గొట్టంలోంచే వస్తుంది. తేగలవాళ్ళు నక్సలైట్లు! నేను నక్సలైటును కాదు! నక్సలైటు కవిని! అనే ఆధునికుడు శ్రీశ్రీ.

వీరిద్దరూ ఉత్తర దక్షిణ ధృవాలు. అలాంటి ఇద్దరూ కలసి "తెలుగు మహాసభల్ని బహిష్కరించండి" అంటూ స్టేట్‌మెంటివ్వటం ఓ పెద్ద ప్రహసనం.

కాదు ఉత్తర దక్షిణ ధృవాలు రెండూ ఒక్కలాగే ఉంటాయంటున్నారు, చూసినవాళ్ళు. కనుక మేమిద్దరం ఒక్కలాంటి వాళ్ళమే సార్! అంటున్నాడు శ్రీశ్రీ.

తనలో విదూషకుడి అంశ ఉందని చాలా కాలం క్రితం శ్రీశ్రీ రాసుకున్నాడు. దాన్ని రుజూ చేసుకునేందుకు ఇంతకన్నా సదవకాశం దొరకలేదేమో! మహాకవి శ్రీశ్రీని చూసి, "అయ్యో, పాపం, శ్రీశ్రీ!" అనుకోవాల్సి రావటం అన్యాయం. అని ఆయన ప్రియశిష్యుల బాధ.

శ్రీశ్రీ తాగుతూ, తాగి మా ఇంటికొచ్చాడు. ఈ నక్సలైటు గాడితో గొడవెందుకని బెమ్మని అడిగినట్టు స్టేట్‌మెంటు రాసిచ్చారు అంటారు కవి సామ్రాట్టు.

ఈయన్లో ఎంత హాస్యం ఉంది! అబ్బా! ఈయన స్టేట్‌మెంట్ చదువుతున్నంతసేపూ విరగబడి నవ్వలేక చచ్చాననుకోండీ! అంటాడు శ్రీశ్రీ.

శ్రీశ్రీ సంగతేమోగానీ ఈ స్టేట్‌మెంట్లు తెలుగులో కాక ఇంగ్లీషులో వచ్చి ఉంటే మాత్రం "బ్రౌరా! తెలుగులో మహాకవులు కూడా చక్కటి హాస్యం సృష్టిస్తారే! తెలుగు దినపత్రికలు పిచ్చోళ్ళ ప్రకటనలు కూడా బాక్సుకట్టి మరీ మొదటి పేజీల్లో వేస్తాయే! ఈ తెలుగువాళ్ళు చాలా పురోగమించిన జాతిసుమా అని ఆశ్చర్యపోక తప్పదు గదా చదివే ఆ పరాయి భాషలవాళ్ళు!

అయ్యో! ఇదీ మన హాస్యం. 




సింహాద్రి మధ్యాహ్నం భోజనానికి ఇంటికి వచ్చేడు. గదిలో చుక్క ముక్కు చీదుతూ కూర్చుని వుంది. ఏందేఇయ్యాలేమొచ్చిందేగట్లఏడుస్తా కూర్చున్నావ్, జల్ది బువ్వెట్టు అత మెద కట్టేసి కుప్పలు పెట్టిచ్చినం బువ్వ తినెల్లి కూలి వడ్లు కొట్టుకో వాల. ఆలస్యంచేస్తే ఏ దొంగ నాయాలో కట్టలు వేసుకపోతడు లే—లే... మా యమ్మ గదూ! నేలమీద కండువ పరచి కూర్చున్నాడు. కొద్దిసేపలాగే కూర్చున్నాడు. చుక్క రాలేదు. విసుగ్గా లేచాడు.

“ఏందే ఈ యేలప్పుడు ఈ ఏడుపేంది. ఎవరు చచ్చిందని ఏడవడం, నేను జల్ది పోవాల్నని చెప్పినా ఆమాత్తరం గేనం లేకుంటే ఎట్ల నువ్వు పెడ్తావా నన్ను పెట్టుక తినమన్నవా” చుక్క బదులు పలకలేదు. “ఓ ఎదవ సంత! ఎదవ కొంప” అక్కడే కంచం పెట్టుకొని,

వడ్డించుకొని త్వర త్వరగా తిని పొలం వెళ్లాడు. తండ్రి అటు పొలం వెళ్ళగానే ఆ కంచంలోనే అన్నం తింది; కంచం తియ్యా బుద్ధి కాలేదు,. అలాగే కూర్చుండి పోయింది. గుమ్మం అవతలవున్న కుక్క వచ్చి కంచం నాకింది. "ఎదవముండ ఎల్లు బయటికి" కంచం కుక్క మీదికి విసరింది. కుయ్యిమంటూ పరుగెత్తింది కుక్క.

ఆలోచనలు చుక్క మెదడులో సుళ్ళు తిరుగుతున్నాయి.

మొన్న పటేలు బండిలో పట్నంవెళ్లి సినిమా చూసినప్పటినుండీ తనకెలాగో వుంది. అందులో ప్యాంటూ, పొడుగు చేతుల చొక్కా వేసుకొన్న బుల్లోడు ఎన్టీవోడనీ ఇద్దరు ఆడవాళ్లని మాటి మాటికీ ప్రేమ ప్రేమ అని కావులించుకొంటాడు. ఆ సినిమాలో ఇద్దరు ఆడవాళ్లు పల్లెలోనే వుంటారు. ఇద్దరు సిల్కు చీరెలు కట్టుకుని కాళ్ళు తడవకుండానే పొలంలో నాట్లు పెడతారు. వడ్లు దంచుతారు. వంగకుండా. చీర అంత బిగుతుగా ఒంటికి అతుక్కుపోయేలా కట్టి గోచీ కట్టకుండా నాట్లు వేయడానికి పొలంలో ఎలా వంగుతారో అర్థం కాలేదు చుక్కకి. ఆ ఇద్దరు ఆడవాళ్ళలో ఒకామె చివరికి ఏడుస్తూ పాట పాడి రెండో ఆమెని కౌగిలించుకుని ఎన్టీవోడి చేతిలో చెయ్యి కలిపి ఎందుకు చచ్చిపోయిందో అంతకన్నా అర్థం కాలేదు. అంత సినిమాలోనూ చుక్కకి 'ప్రేమ' అన్న విషయం ఒక్కటే నచ్చింది. మాటి మాటికీ 'ప్రేమ ప్రేమ' అనుకుంది మనస్సులో. ప్రేమ' అంటే ఏమిటీ అని పటేలుగారి పని మనిషి నడిగితే నాకేం తెలుసు పొమ్మంది. ఆఖరున పాట పాడుతూ ఎన్టీవోణ్ణి గట్టిగా కౌగిలించుకుంది వాణిశ్రీ అని పటేలుగారి పని మనిషి చెప్పింది అడక్కుండానే. మొత్తం సినిమాలో రంగు రంగుల బట్ట వేసుకుని పాటలు పాడుతూ కౌగిలించుకొనే ఎన్టీవోడ్ని ఎన్నోసార్లు మెచ్చుకుంది. అలాంటోణ్ణి ప్రేమించాలనుకుంది. తను వాణిశ్రీలాగే వుంటాననుకుంది. ఆ సినిమా చూసినప్పటినుండీ గోచీ పెట్టడం మానివేసింది. పూసల సైరింటికివెళ్లి ఆరణాల అద్దం తెచ్చుకుంది. మాటి మాటికీ గుండ్రటి, పొడగాటి చుట్ట పెట్టుకుని, తల సిగలు చుట్టుకుని అద్దంలో చూసుకొంటూ వాణిశ్రీ కన్నా బావుంటుందా అనుకునేది. చివరికి వాణిశ్రీ కన్నా తానే అందంగా వుంటానని తేల్చుకుని ఎన్టీవోడిలా ఊళ్లో ఎవరన్నా వాళ్ళని ప్రేమించాలనుకుంది. పటేలు కొడుకొక్కడే అలా వుంటాడు. ఎన్టీవోడిలా వుండడు. కానీ ఆ వూళ్ళో ప్యాంటూ, పొడుగు చేతుల చొక్కా వేసుకొనేది అతనొక్కడే. ఓసారి వాళ్ళింటి బావికి నీళ్ళకెడితే ఎవరూ లేకుండా చూసి తన చెయ్యి పట్టుకొన్నాడు.

"చుక్కా, నా పువ్వులచొక్కా. తొలి వలపుల మొక్కా నువు లేకుంటే నా బ్రతుకే ఎందు మొక్కా" అని మాటల పాట పాడేడు. అదేమీ అర్థం కాకపోయినా సరదాగా అనిపించింది చుక్కకి. 'నిన్నే ప్రేమిస్తున్నాను, నీవు లేని జీవితం ఎడారి బాట' అన్నాడు, ఏడుపు మొహంపెట్టి. "ప్రేమ" అన్న ముక్క మాత్రం

అడుగులు వుంటుంది. యిలా చేశాక దాదాపు 20 రోజులకల్లా గాస్ తయారవుతుంది. ఈ గోబర్ గాసులో ఎంతో ఉష్ణం వుంటుంది కనుక వంట చెయ్యడానికి కట్టెలు, బొగ్గు, ఇండేన్ గాస్ కన్నా కూడా తక్కువ టైము తీసుకుంటుంది. ఈ గాస్ తో వంట చెయ్యడంవల్ల రుచికిగాని, శుచికిగాని ఏమాత్రం భంగం వాటిల్లదు. పోనీ, దీనికోసం అపరిమితమైన డబ్బు ఖర్చుచెయ్యాలా అంటే అదిలేదు. సుమారు 3, 4 వేల రూపాయల ఖర్చుతో యిది తయారవుతుంది.

గోబర్ గాసు ప్లాంటు అనేది ఎంతో వుపయోగకరం: నిజానికి మన దేశంలో పశుసంపద ఎంతగానో వుంది. ఆ పశువుల పేడను వృథా చేసేవారు కొందరైతే, దాని ప్రయోజనాలను చిన్న మోతాదులోనే సాధించేవారు మరికొందరు. కాని, ఈ గోబర్ గాసు ప్లాంటువల్ల పశువుల పేడను సక్రమంగా సద్వినియోగం చేసుకోవచ్చు. మనకున్న ఇంధన సమస్యను పరిష్కరించుకోనూ వచ్చు. ఈ గాసువలన ప్రొద్దుటి నుంచి సాయంత్రం వరకూ యింటి అవసరాలు, వంట అవసరాలు తీరడమే కాదు, వేరే ఎన్నో ప్రయోజనాలు వున్నాయి. మిగిలివున్న గాసునుండి వెలుతురు పొందవచ్చు. ప్రస్తుతకాలంలో ఇంధన సమస్య ఎంతో భయంకరంగా తయారయి కూర్చుంది. గోబర్ గాసు ప్లాంటుల ద్వారా ఆ సమస్యను చక్కగా పరిష్కరించుకోవచ్చు. అంతేకాదు. ప్లాంటులో వినియోగించబడిన పేడ చక్కటి ఎరువుగా పనికివస్తుంది. మామూలు పేడకన్నా యీ గోబర్ గాసు ప్లాంటులోంచి బయటకువచ్చే పేడలో నత్రజని ఎక్కువగా వుంటుంది. అంతేకాదు, మామూలు పేడను కుళ్ళబెట్టడం కొంచెం కష్టంతో కూడుకున్న పని. కానీ, ఈ గోబర్ గాసు ప్లాంటులో మిగిలిన పేడ ఎప్పుడు కావాలంటే అప్పుడు రెడీమేడు ఎరువులాగా వుపకరిస్తుంది. ఎరువు అవసరం లేనప్పుడు ఆ పేడను నిలువ చేసుకుని అవసరమయినప్పుడు పొలానికి వేసుకోవచ్చు.

గోబర్ గాసు ప్లాంటు విజయవంతం కావాలంటే కొన్ని జాగ్రత్తలు వహించాలి. దానికి అవసరమయిన సామానులు స్థానికంగా, సక్రమంగా లభించే ఏర్పాట్లు చేసుకోవాలి. సిమెంటు, ఇనుము వగైరా పదార్థాలు కంట్రోలు రేటుకు అందాలి. అప్పుడే పేదరైతులు సుఖపడగలుగుతారు. మిగిలివున్న గాసును కూడబెట్టుకునే మార్గమే ఆలోచించుకోవాలి. గాసుప్లాంటులో రోజూ పేడ, నీళ్ళు వేస్తూవుండాలి. ఆ పని సక్రమంగా చెయ్యకపోతే, ప్లాంటులోని పేడ ఎండిపొయ్యే ప్రమాదముంది. అంతేకాదు, ప్లాంటులో వేసేటప్పుడు పేడను శుభ్రపరచుకోవాలి. లేని పక్షంలో పేడలో వుండే యిసుక ప్లాంటు పనిని పాడుచేస్తుంది.

ఇలా ఈ గోబర్ గాసు ప్లాంటు మనకు ఎంతో ప్రయోజనకరమైనది. వ్యవసాయ ప్రధానమయిన భారత దేశానికి, ముఖ్యంగా ఆంధ్రప్రదేశానికి యిది ఎంతో అవసరం; హితకరం. పశువుల పేడను సదుపయోగం చేసుకోనూ వచ్చు, పసిడి పంటలు పండించుకోనూ వచ్చు. కనుక గోబర్ గాసు ప్లాంటు స్వల్పఖర్చులో సాగే బహు ప్రయోజన ప్రణాళిక అంటే అతిశయోక్తి కాదు.



పెళ్లికాబోయే యువతులకు ప్రత్యేకం!




ఈ లెక్కని నీకు సంబంధం ఎప్పటికి కుదురుతుందమ్మా?''

అన్నారు నాన్నగారు. ఈసారి ఆయన కంఠం అంత మార్దవంగా ను. కొంత విసుగు ధ్వనించింది.

అక్క పెళ్ళయిపోయిన తరవాత, అత్తయ్య కొడుకు రాజుని నేను ఎకోనని ఖచ్చితంగా చెప్పిన తరవాత ఎన్నో సంబంధాలు వచ్చాయి. నాకు

బి. యె. లో చేరినప్పటినుంచీ. సంబంధం కుదిరేవరకూ చదువుకుంటుంది లెమ్మన్నట్టుగా నా చదువు సాగనిచ్చారు.

కొత్తల్లో నన్ను చూడటానికి వచ్చిన కొందరు కుర్రాళ్ళని తవ్వ మొహం అనీ. కొంగ ముక్కు అనీ, మెల్లకన్ను అనీ, బట్టతల అనీ, బడ్డూఖాన్ అనీ. ఆడంగి అనీ ఏవో వంకలుపెట్టి తప్పించుకున్నాను. అమ్మా నాన్నగారూ కూడా మొదట్లో నవ్వేసి ఊరుకున్నారు నా వ్యాఖ్యానాలు విని. తరవాత కొన్ని సంబంధాలువస్తే యద్ల బేరానికి వచ్చినట్లు ప్రవర్తించారనీ, యూపీయస్సీ ఇంటర్‌వ్యూ అన్నట్లుగా ప్రశ్నలు వేశారనీ, రసిక గృహానికి వచ్చినట్లు నన్ను పాటలు పాడమన్నారనీ, కట్నం కావాలన్నారనీ ఇలా రకరకాల కారణాలు చెప్పి నిరాకరించాను నాలుగేళ్ల పాటు.

ఈసారి వచ్చిన సంబంధం నాన్నగారికి అమ్మకు అన్నివిధాలా నచ్చింది. కుర్రవాడు ఒడ్డూ పొడుగ్గా ఉన్నాడు. స్మార్ట్‌గా ఉన్నాడు. మంచి కుంటుంబంలో పుట్టాడు. కట్నం కానుక లడగటం లేదు. ఎటొచ్చీ అతను చేస్తున్న ఉద్యోగమే నాకు అదోలా అనిపించింది. అతను ఏదో మెడికల్ కంపెనీకి సేల్స్ రిప్రెజెంటెటివ్‌ట మా ఇంట్లో కూర్చున్నంత సేపూ తమ మందుల కంపెనీ అధికృత గురించి మాట్లాడుతూనే ఉన్నాడు. ఏ రోగాలు వచ్చినా అందుకు తగిన మందులు వాళ్ళ కంపెనీ తయారు చేస్తోందనీ, ఈసారి మాకందరికీ రోగాలొస్తే ఆ మందులే వాడాలనీ ఈ ధోరణిలో సాగిందతని సంభాషణ. వాతావరణమంతా రోగ భూయిష్టమైనట్లూ, అతని ప్రపంచమంతా మందుల మయమైనట్లూ అనిపించింది అతను మాట్లాడుతున్నంతసేపూ. అతను మందుల మరాఠీలా కనిపించాడు.

''అతని ఉద్యోగం నాకు నచ్చలేదు'' అన్నాను నాన్నగారితో. ఆయనకి విసుగొచ్చింది.

''ఏమిటమ్మా. ప్రతీసారీ ఏదో ఒక వంక పెడుతూంటావ్! ఈ లెక్కని నీకు సంబంధం ఎప్పటికి కుదురుతుందమ్మా? నేను రిటైరైపోయే రోజులు దగ్గర కొస్తున్నాయి. రిటైరైతే మనమొహం చూసేవాడుండడు. బొత్తిగా బాధ్యత తెలుసుకోకపోతే ఎలాగ?'' అన్నారు.

''ఇష్టంలేని సంబంధం ఎలా ఒప్పుకోనండీ?'' అన్నాను నాన్నగారి దగ్గర చనువు కొద్దీ.

''పోనీ, నీ కెలాంటి సంబంధం ఇష్టమో చెప్పు. నీకు వరుడిలో కావలిసిన లక్షణాలన్నీ చెప్పు. పేపరులో ఎడ్వర్‌టైజ్ చేయిస్తాను. నీ కల నిజమవుతుందేమో!'' అన్నారు సగం పరిహాసంగా. సగం గంభీరంగా.

అప్పటికి నేనేమీ సమాధానం చెప్పకుండా అక్కణ్ణించి మౌనంగా తప్పుకున్నాను. ఆ రాత్రి చాలాసేపటి దాకా నిద్రపట్టలేదు. ఆలోచిస్తూ పడుకున్నాను.

నాకెలాంటి వరుడు కావాలి? వెంటనే నాకు తోచలేదు. ఆ ధోరణిలో నే నింతకు ముందెప్పుడూ ఆలోచించలేదు. ఎలాంటి వాడు నచ్చుడో కూడా ఇదమిద్ధంగా నిర్ణయించుకోలేకపోయాను. శాస్త్రి ఎదురు పడేదాకా నచ్చేదీ లేనిదీ తేల్చి చెప్పలేక పోతున్నాను. ఈ పద్ధతి ఇక లాభంలేదు. వరనిర్ణయంలో కొన్ని నిశ్చితాభిప్రాయాలు ఏర్పరచుకోవటం అవసరం. ఎటువంటి వాణ్ణి చేసుకుంటే నా జీవితం సుఖప్రద మవుతుంది అని నేను ముందుగానే తేల్చుకోవాలి. దాంపత్యజీవితం సుఖప్రదం కావాలంటే జీవిత భాగస్వామికి ఉండవలసిన లక్షణాలేమిటి? అందమా, గుణమా, వంశమర్యాదా, డబ్బా, చదువా, ఉద్యోగమా-అన్నీనా, అందులో కొన్ని మాత్రమేనా, అయితే ఏవేవి?

అందం. అందం కొరుక్కుతింటామా అంటారు పెద్దవాళ్ళు. నిజమే కొంత వరకు. అందంగా లేనంతమాత్రాన మనిషిని కొట్టిపారేస్తామా? అందంగా ఉన్న వాళ్ళు ఎంతమంది ఉన్నారు కనక ఈ ప్రపంచంలో! చూసేవాళ్ళ అభిరుచిని బట్టి కూడా ఉంటుంది అందం అనేది.

గుణం-గుణం మంచి దవునో కాదో ముందుగానే ఎలా తెలుస్తుంది? మరీ వెకిలిగానో క్రూరంగానో కనిపిస్తే తప్ప. గుంభనంగా కూర్చుని వెళ్ళిన వాడిగురించి వెంటనే ఏం తెలుస్తుంది? రెండు మూడు సార్లు మాట్లాడినంతలో తెలుస్తుందా?

డబ్బు—డబ్బులేకుండా గడవటం కష్టమేగాని, కేవలం డబ్బున్నవాడు కదా అని ఏ చవటనో కట్టుకోలేం కదా!

చదువు-అఫ్‌కోర్స్ చదువుండి తీరాలి. ఈ రోజుల్లో ఆడవాళ్ళే చదువుతూంటే మగవాళ్ళకి పెద్ద చదువు ఉండొద్దూ! నాకన్న ఎక్కువ చదువుకున్నవాడై ఉండాలి కదా! ఎంత సమానంగా హక్కులు కావాలని పోరాడినా ఎందుకో భర్త నాకన్న ఉన్నత స్థితిలో ఉండాలనే భావన వదలటంలేదు నన్ను. నాక్లాస్ మేట్స్‌ని చూస్తే నాముందు కుర్రకుంకల్లా కనిపిస్తారు. ప్రేమించి పెళ్ళి చేసుకునేట్లుగా అనిపించదు నాకు. నా లెక్చరర్స్‌లో ఎవరినన్నా ఎంచుకుందామా అంటే అందులో కొంతమంది పెళ్ళయిన వాళ్ళూ, కొంతమంది మరో కులంవాళ్ళూ. నే నెరుగున్న వాళ్ళలో తగినవాడుగా ఎవరూ నాకింతవరకు కనిపించలేదు.

ఎటువంటి ఉద్యోగం చేసేవాణ్ణి చేసుకుంటే జీవితం సుఖప్రదం అవుతుంది?

నాన్నగారు మెటియొరలాజికల్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తున్నారు. అమ్మ ఎప్పుడూ సాధిస్తూనే ఉంటుంది నాన్నగారిని ఆయన ఉద్యోగ నిర్వహణ విషయంలో.

"ఏమండీ, వడియాలు పెట్టాలనుకుంటున్నాను రేపు ఎండ వస్తుందంటారా?" అని అడుగుతుంది పరమ పతివ్రతలా.

నాన్నగారు "ఓ, నిశ్చింతగా పెట్టుకోవచ్చు. పెళ్ళున ఎండ కాస్తుంది" అని వెదర్ రిపోర్ట్ చెబుతారు.

మర్నాడు పొద్దున్న నాన్నగారు ఆఫీసుకి వెళ్ళేముందు మళ్ళీ అడిగేది "ఏమండీ, వడియాలు ఎండపెట్టమన్నారా?" అని.

"పెట్టవే. నామాట మీద నమ్మకం

లేదేమిటి!'' అంటూ వెళ్ళిపోయేవారు.

అమ్మ డాబామీద చాపవేసి దుప్పటి పరిచి దానిమీద వడియాలన్నీ పెట్టడం ఇలా పూర్తి చేసేదో లేదో అకాశం నలు మూలలనుంచీ మబ్బులు కమ్ముకొచ్చేవి. అప్పుడే పెట్టిన వడియాలతో చాపని నలుగురు మనుషులు మోస్తేగాని వడియాలు ముద్దైపోకుండా లోపలికి తీసుకురాలేం. అమ్మ ఒక్కర్తీ (మడిమూలాన్ని) ఆ చాపని చూరుకిందకి ఎలాగో లాగేది. అయినా, వర్షం కుండపోతగా మొదలు పెట్టేసరికి వడియాలన్నీ తడిసిపోయేవి. ఆ సాయంకాలంనుంచి ఇల్లంతా ఊరు పిండి కంపు! నాన్నగారు ఆఫీసునుంచి తడిసి వచ్చిరావటంతోనే చండికలా లేచేది అమ్మ.

''ఈ మగవాళ్ళనినమ్మ కూడదు. అందులోనూ వాతావరణ సూచనచేసే ఆఫీసు వాళ్లని ఛస్తే నమ్మకూడదు'' అనేది.

తెలిసీ గోతిలో పడుతూ ఉంటుంది అమ్మ ఒక్కొక్కప్పుడు. వాతావరణం ఎలా ఉంటుందని నాన్నగారిని అడక్కుండా ఉండలేదు. ఆ తరవాత దెబ్బలాడకుండా ఉండలేదు.

ఓసారి, మబ్బులొచ్చే సూచనలు ఏకోశానా లేవని ఖచ్చితంగా చెప్పారు నాన్నగారు. ఆయనమాట నమ్ముకుని కొత్త పట్టుచీర కట్టుకుని ఎవరింటికో చాలాదూరం నడిచి వెళ్ళింది పేరంటానికి. తీరా తిరిగి వస్తూంటే నడగళ్ళవాన! అమ్మ బాగా తడిసిపోయింది. కొత్తపట్టుచీర పాడవటమే కాకుండా, అసలే తనది వాతం శరీరం కావటంవల్ల మర్నాటినుంచీ ఫ్లూ పట్టుకుంది.

ఆ జ్వరంలో అంది-''ఓ స్కూలు మాస్టర్ని చేసుకున్నా సుఖపడిపోదును. ఈయనతో వేగలేక పోతున్నాను'' అని.

ఇక అక్కయ్య సంగతి చూస్తే, అది



ఎప్పుడొచ్చినా నసుగుతూనే ఉంటుంది మొగుడి ఉద్యోగం గురించి.

"కట్నం తక్కువ అడిగారు కదాఅని చూస్తూ చూస్తూ లైబ్రేరియన్ కిచ్చి చేతులు దులుపుకున్నారు! ఆయన కెంత సేపూ రివిజన్ ఆఫ్ పే స్కేల్సూ, ఎకడమిక్ స్టేటసూ, జీతం, హోదా ఇదే యావ! ఊళ్లో ఉన్న లైబ్రరీల వాళ్ళ నందర్నీ పోగుచేసి కొంపలో మీటింగులు పెడతారు!

లైబ్రేరియన్ కదా అని లైబ్రరీ కొచ్చే పత్రికలు కొన్ని ఇంటికి పట్టుకురండీ అంటే, రూలు ప్రకారం అలా తేవటానికి వీల్లేదు కావాలంటే లైబ్రరీకొచ్చి చదువుకో మంటారు. పెళ్ళానికోసమైనా పత్రికలు ఇంటికి తీసుకు రాలేకపోతే ఎందుకొచ్చిన లైబ్రేరియన్ను! విగ్రహపుష్టి నైవేద్యనష్టి అన్నట్లు! ఓ పుస్తకాల కొట్టువాణ్ణి చేసుకున్నా ఇంతకన్న సుఖంగా ఉండేదేమో" అంటుంది అక్కయ్య.

అన్నయ్య రిసెర్చిలాబ్స్‌లో సీనియర్ సైంటిస్టు, ఎంతసేపూ రిసెర్చి. ప్రోజక్ట్సు అంటూ ఆ లాబ్స్‌లోనే పొద్దుటినుంచి రాత్రిదాకా గడుపుతాడుగాని వదిన సరదాల గురించి పట్టించుకోడనీ, ఆదివారం పూట కూడా చదువులో మునిగిపోతాడనీ, ఒక్క ముచ్చటా తీర్చడనీ వదినముఖం ముడుచుకుంటూ ఉంటుంది. మరీ నిరాశ కలిగినప్పుడు "ఆయన ఓ గుమస్తా అయినా బాగుండేది. హాయిగా పార్కులకీ సినిమాలకీ తీసుకువెళ్ళేవారు" అని నిట్టూర్చుతుంది.

మరి ఎలాంటి ఉద్యోగం చేసేవాణ్ణి చేసుకుంటే నాజీవితం సుఖప్రదం అవుతుంది? ఎంతసేపు ఆలోచించినా డాక్టరుని చేసుకోవాలో, ఇంజనీర్ని చేసుకోవాలో మరే ఉద్యోగస్థుణ్ణి చేసుకోవాలో అర్థం కాలేదు. నాకే తెలియనిది నాన్నగారితో ఏమని చెప్పను?

మర్నాడు పొద్దున్న యూనివర్శిటీకి వెడుతూంటే దారిలో ఒకతను-విలేఖరి-మైక్ పట్టుకుని రోడ్డునపోయే వాళ్ళని కొందర్ని ఆపుచేసి. "పెరుగుతున్న ధరల మీద, ఈ ప్రభుత్వం విధానాల మీదా మీ అభిప్రాయాలేమిటి?" అని అడుగుతున్నాడు. అతని రెండో చేతిలో చిన్న టేప్ రికార్డరుంది. విద్యార్థినిసనిచెప్పి నన్ను కూడా ఆపి నా అభిప్రాయా లడిగాడు. ఏదో తోచినట్లు జవాబు చెప్పాను. అ చెబుతున్నప్పుడే నా మనస్సులో మెరుపులా ఒక ఆలోచన వచ్చింది-నేను ఎరుగున్నవాళ్ల ఇళ్లకి వెళ్ళి రకరకాల ఉద్యోగాలు చేస్తున్న వాళ్ళ భార్యల్ని తమభర్తల ఉద్యోగాలమీదా, తాము గడుపుతున్న జీవితాల మీదా అభిప్రాయాలడిగి, వారి అనుభవాలు కొన్ని విన్నమీదట ఎవరి జీవితం సుఖప్రదంగా ఉందని తోస్తే ఆ రకం ఉద్యోగస్థుణ్ణి వివాహం చేసుకుంటే బాగుంటుందని తోచింది. అప్పుడైతే నాన్నగారితో చెప్పొచ్చు "నాకు ఫలానా ఉద్యోగస్థుడు వరుడుగా కావాలి, అతనికి ఫలానా ఫలానా లక్షణాలుండాలి" అని. అన్నింటికన్నా ముఖ్యం ఉద్యోగంకదా!

ఆ ఆలోచన రావటం తడువు ఎక్కడలేని ఉత్సాహం పుట్టుకొచ్చింది. ఆరోజు లైబ్రరీలోకూర్చుని చదువుకో బుద్ధికాలేదు. క్లాసు కూడా ఎగ్గొట్టి ఇంటికొచ్చేశాను.

కాఫీ తాగి డ్రెస్ మార్చుకుని బయలు దేరాను.

మొట్టమొదట మా అన్నయ్య స్నేహితుడు వేణుమాధవరావు ఇంటికి వెళ్లాను. అతను ఇంజనీరు. అతని భార్య మా వదినతో చాలా సరదాగా ఉంటుంది. నాకూ కొద్దిగా చనువుంది అవిడ దగ్గర.

నన్ను చూడగానే ఎంతో ఆప్యాయంగా పలకరించి వద్దు వద్దంటున్నా మళ్ళీ కాఫీ తాగించింది నాచేత. మొహమాటపడుతుతూ, నే వెళ్ళినపని చెప్పాను. అవిడ పకపక నవ్వటం మొదలు పెట్టింది "యిదో కొత్తరకం స్వయంవరంలా వుంది." అంది నవ్వు ఆపుకుని.

"ఎవరో ఒకర్ని తొందరపడి పెళ్ళి చేసుకుని జీవితాంతం బాధ పడటం నాకు నచ్చదండీ. నాకు నచ్చినవాణ్ణి ఏరి కోరి చేసుకుని నా జీవితం సుఖప్రదం చేసుకోవటంలో తప్పేముంది?" అన్నా...

"నీ ఆత్మ విశ్వాసాన్ని మెచ్చుకుంటున్నాను. నీ ప్రయత్నం సఫలం కావాలని కోరకుంటున్నాను. కానీ, ఒక్కటే హెచ్చరిక నాది. నా అనుభవాన్ని గురించి విన్న తరువాత నువ్వేదో నిర్ణయం తీసుకుంటే ఆ బాధ్యత నాది కాదుస్మీ!" అంది ఆవిడ.

"ఆ మాత్రం నాకు తెలియదుటండీ! ఆ విషయమై మీరేమీ భయపడకండి. మీరు నిస్సంశయంగా మీ అనుభవాన్ని చెప్పండి. నేను మరెవ్వరితోనూ చెప్పను. ఇది నా స్వయం నిర్ణయానికి తోడ్పడటం కోసం మాత్రమే" అన్నాను.

"కానీ...." అంది.

"ఏమిటి సందేహిస్తున్నారు?" అన్నాను, అవిడ ఇచ్చినమాటని ఎక్కడ వెనక్కి తీసుకుంటుందో అని భయపడుతూ.

"అది కాదు, ఒక్క ముక్కలో చెప్పాలంటే కష్టం. ఎక్కడ మొదలు పెట్టి ఎక్కడ ఆపాలో కూడా తోచటం లేదు నాకు. పోనీ, ఓ పని చెయ్యరాదూ? రేపొక్కమారు మళ్లీ రా. అప్పటికి నాకు తోచిన విధంగా కాగితంమీద రాసి వుంచుతాను. ఎదురుగుండా చెప్పాలంటే మనస్సు విప్పి చెప్పగలుగుతానో లేదోననిపిస్తోంది" అంది.

"అంతకన్నానాండీ. రేపు మళ్ళీ వస్తాను. మీరుమాత్రం మరిచిపోకూడదు సుమా" అన్నాను కుర్చీలోంచి లేస్తూ.

ఆ మర్నాడు ఇచ్చినమాట ప్రకారం ఆవిడ రాసిన కాగితాల బొత్తి నా చేతి కిచ్చింది. ఆవిడ ఎదురుగుండా చదవ టానికి మనస్కరించక, ఏదో అర్జంటు పని వుందని చెప్పి, ఆవిడకి థాంక్స్ చెప్పి ఇంటికొచ్చేశాను.

రాత్రి చదవటం మొదలు పెట్టాను ఆవిడ కథ.

ఇంజనీరుగారి భార్య

శేఖర్‌గారింటికి వాళ్ళమ్మాయి పుట్టిన రోజు పండక్కి పిలిస్తే పార్టీకి వెళ్ళాం మేమిద్దరం. తీరా అతిధులందరూ వచ్చాక హఠాత్తుగా దీపాలు పోయాయి. చలి కాలం, సాయంకాలం అవటంవల్ల ఇల్లంతా చీకటి అయిపోయింది. అంతా అయ్యో అయ్యో అనుకుంటూంటే మావారు వెంటనే కమీజు చేతులు పైకి మడిచి 'ఏదీ మెయిన్ స్విచ్ ఎక్కడుంది?' అన్నారు. శేఖర్‌గారు అగ్గిపుల్ల వెలిగించి దారి చూపించారు. మెయిన్ స్విచ్ పరీక్షించి ఫ్యూజ్ పోయిందని గ్రహించి. 'సన్నని వైరేదైనా వుందా?' అని అడిగారు శేఖర్‌గారు లేదన్నట్లు బుర్ర ఊపారు అంతలో వాళ్ళ చిన్నమ్మాయి వచ్చి, "నాన్నా, నా బొమ్మల సామాన్లో పాత వైరు ముక్కలున్నాయి, తీసుకురానా" అని అడిగింది. తీసుకురమ్మన్నారీయన. పది నిముషాల్లో లైట్లు తెప్పించి ఇల్లంతా కలకల్లాడేట్లు చేశారు. శేఖర్‌గారూ భార్యా ఆయనకి చాలా థాంక్స్ చెప్పారు. ఇంజనీరు భార్య నయినందుకు ఆ క్షణంలో గర్వించాను.

మరోసారి ఇంకెవరో స్నేహితులిం టికి వెళ్ళేసరికి భార్యా భర్త లిద్దరూ ఏం చెయ్యాలో తోచక ఏకగ్రీవంగా బాధపడు తున్నారు. వంటింట్లో కుళాయి కట్టెయ్యటం చాతకాక, ఎన్ని గుడ్డలు కుక్కినా ధార ఆగటం లేదు. వంటిల్లంతా వరదలై యే ట్లుగా వుంది. ప్లంబరు ఎక్కడుంటాడో ఆ యింటాయనకి తెలియదుట. ఏం చెయ్యాలో తెలియక తంటాలు పడుతున్న సమయంలో ఆపద్బాంధవుడిలా వెళ్లా రీయన సతీ సమేతంగా. సంగతి తెలుసు కుని వెంటనే కమీజు చేతులు వెనక్కి మడిచారు. పట్కారు అడిగి తీసుకుని బల మంతా ఉపయోగించి కుళాయి బ్రాకెట్ తెరిచారు. శివుడి తల్లో గంగలా హోరు మంటూ ఎగతన్నింది నీరు.

"వాషరు పడులై పోయింది. ఇంకో ... వుందా?" అని అడిగాడు ఆయన. లేదన్నాడా స్నేహితుడు.

"చుట్టు పక్కల దుకాణాలేమీ లేవా?" అని అడిగితే. 'ఉంది, ఒక చిన్న దుకాణం. వెళ్ళి అడిగి చూస్తానుండండి' అని గబ గబా పరుగెత్తాడాయన. అప్పుడు నిము షాల్లో విజయవంతంగా తిరిగి వచ్చాడు. హనుమంతుడు సంజీవి పర్వతాన్ని పట్టు కొచ్చినట్లు. ఈయన పది నిముషాల్లో పని పూర్తి చేశారు తుపాను వెలిసినట్లు ప్రశాంతంగా ఆయింది వంటిల్లు. ఆయన స్నేహితుడు కరచాలనం చేశాడు సంతో షంతో.

"చూశారా, మా ఆయన ప్రతాపం!" అన్నట్లు సగర్వంగా చూశాను. ఆ స్నేహితుని భార్య వైపు.

అసలు మా పెళ్లయ్యాక మొదటి రాత్రే ఇంజనీరు ననిపించుకున్నారాయన.

బంధువులంతా మమ్మల్నిద్దర్నీ గదిలోకి పంపించారు. అది పూర్వకాలపు పందిరి మంచం. వంశ పారం పర్యంగా అందరికీ దానిమీదే కార్యం జరిగిందని చెప్పి దాన్ని అలాగే వాడుతూ వచ్చారు. తీరా మేమిద్దరం మంచం ఎక్కి ప్రేమ కలాపం సాగించటం మొదలుపెట్టేసరికి భూకంపం వచ్చినట్లు మంచం ఇటూ అటూ ఊగటం




మొదలు పెట్టింది. ఈయన వెంటనే మధ్యలో లేచి మంచం అంతా పరీక్షించారు.

"ఏం కాదు లెండి, భయపడకండి" అన్నాను సిగ్గు పడుతూ.

"ఏమీ కాకపోవటమేం! మంచం పట్టీలు విడిపోయాయంటే నడ్డి విరుగుతుంది మనిద్దరికీ" అన్నారు.

నేను ఏం చెయ్యాలో అర్థంకాక సిగ్గు పడుతూ నిలబడ్డాను.

"వెళ్ళి మేకులూ సుత్తీ తీసుకు రా" అన్నారు.

"ఇప్పుడా! ఇంత రాత్రివేళ! ఎక్కడున్నాయో వెతకాలి. అంతా నిద్రపోతూ వుంటారు" అన్నాను మొహమాట పడుతూ.

"సరే అయితే. నేలమీద పడుకుందాం పద" అని, దుప్పటి లాగి నేలమీద పడేశారు. మంచానికి కట్టిన పువ్వుల తోరణాలు నన్ను వెక్కిరించినట్లయి నాకు కళ్ళ నీళ్ల తిరిగాయి.

"ఉండండి, చూసి తీసుకొస్తాను" అని చెప్పి చప్పుడు చెయ్యకుండా స్టోర్ రూమ్‌లోకి వెళ్ళి చెత్తసామాను ఉన్న అలమారంతా వెతికి ఎలాగో ఓ అరడజను

తుప్పు పడుతున్న మేకులూ, ఒక ఇనుప గూటం పట్టుకొచ్చి ఇచ్చానాయనకి. ఆయన వెంటనే చొక్కా చేతులు వెనక్కి మడిచి మంచానికి నాలుగు వైపులా మేకులు కొట్టడం మొదలు పెట్టారు. ఆ చప్పుడికి ఇంటిల్లిపాదీ లేస్తారేమో, ఏం జరుగుతోందోనని వచ్చి చూస్తారేమోనని సిగ్గుతో నా ప్రాణం చితికిపోయి నట్లయింది. పెళ్లి పనులు చేసి చేసి అలసటతో ఒళ్లు మరిచి పడుకున్నట్లున్నారు. ఎవ్వరూ లేవలేదు. బ్రతుకుజీవుడా అనుకున్నాను.

కానీ, మర్నాడు పొద్దున్న కాఫీ తాగుతూ మా మామయ్య అన్నాడు "ఏమిటే అమ్మలూ, రాత్రి చాలా హడావిడి చేసినట్లున్నారు!" అని. ఆయన నాకేసి చూసి కన్ను గీటారు. నేను కాఫీ కప్పులో ముఖం దాచుకున్నాను.

మా అమ్మకి అల్లుళ్లందరిలోకీ ఈయన అంటే చాలా ఇష్టం. ఏ పండగకో ఇంటి కొచ్చినప్పుడు ఈయన చేత పెరట్లో స్నానాల గది పక్కని వానాకాలంలో పొయ్యి తడిసిపోకుండా గోడవారగా రేకు దింపించుకోవటమో, వంటింట్లో చిన్న సిమెంటు గట్టు కట్టించుకోవటమో— ఇలాంటి కట్టుదిట్టాలు చేయించుకునేది. ఇంజనీరు అల్లుడికి ఇష్టమైన అరిసెలూ మినపసున్ని చక్కిలాలూ అన్నీ ఓపిగ్గా చేసిపెట్టేది ఆయన ఉన్న నాలుగురోజులూ. ఆ ఉత్సాహంలో కూతురికి ఏం కావాలో అని కూడా పట్టించుకునేది కాదు.

ఒక్కొక్కప్పుడు నా భర్త ఇంజినీరు అని గర్వించినా, ఇంజినీరు భార్యనని చెప్పుకోటానికి సిగ్గుపడిన క్షణాలు కూడా లేకపోలేదు. అసలు ఈ మధ్య అటువంటి క్షణాలే ఎక్కువవుతున్నాయి. ఆయన ఇంజినీరింగు బుర్ర రోజు రోజుకీ వేడెక్కి చురుగ్గా పనిచెయ్యటం ప్రారంభించింది.

ఎవరింటికైనా వెడితే వూరికే వాళ్ళింట్లో కాఫీ టిఫినూ తీసుకుని తిరిగి రాబుద్ధి పుట్టదాయనకి. వాళ్లు ఏమీ అడక్కపోయినా సరే. గదిలో ఇటూ అటూ చురుగ్గా చూసి. ఆగిపోయిన గోడగడియారం లాంటి దేదైనా కంట పడగానే "ఏమిటండీ, దీన్ని ఇలా వదిలేశారు!" అంటూ వాళ్ళ అభిప్రాయం ఏమిటో తెలుసుకోకుండానే ఆ వస్తువుని తీసి అంతా తెరిచి అరగంటో గంటో తంటాలు పడి ఒక తీరుకి తెచ్చి రుమాలుతో చెమట తుడుచుకునేవారు.

మరీ పాడైపోయిన వస్తువైతే "ఇంకా ఏంచెడగొడతాడులే దీన్ని-ఏదో ప్రయత్నం చెయ్యనీ" అని నిర్లిప్తంగా ఊరుకునేవారు కొందరు.

ఈ మధ్య పాడైపోయిన వస్తువుల మీదే కాకుండా సరికొత్త వస్తువుల మీద కూడా ఈయన దృష్టి పడుతోంది.

ఓ రోజు చక్కని బట్టలు కట్టుకుని ఓ స్నేహితుడి ఇంటికి వెళ్ళాం. అతను కొత్తగా కొన్న కారు కాంపౌండులో ఉంది. "ఏమిటి, కారు కొన్నారేమిటి!" అని కుశలప్రశ్న వేశారీయన. నాగుండె దడదడలాడింది. అనుకున్నంతా అయింది. ఆ స్నేహితుడి చేతిలోంచి తాళం చెవి లాక్కుని అమాంతం కారు స్టార్ట్‌చేశారు. ఏమనుకున్నాడో, ఆస్నేహితుడుకూడా చటుక్కున కారులో దూరాడు. ఆ స్నేహితుడి భార్య, నేనూ చూస్తూండగానే స్పుట్నిక్

లా దూసుకుపోయింది కారు. ఓ అర గంట పోయాక తిరిగి వచ్చారు. మధ్యలో ఏమయిందో తెలియదు. ఈయన బట్టలు కారు మెకానిక్ బట్టల్లా నల్లటిమచ్చలతో, ముఖమంతా జిడ్డు కారుతూ కనిపించారు. నాప్రాణం గిజగిజ కొట్టుకుంది.

పోనీ, కారు, రేడియోలాంటి తెలిసిన వస్తువులైతే పరవాలేదు. అదే కనక, టేపురికార్డరు లాంటి విదేశీ వస్తువేదైనా అయితే ఈయన మరింత ఉత్సాహంగా బాగు చెయ్యటానికి పూనుకుంటుంటే వద్దనలేక ఆ స్నేహితులు బిక్కుబిక్కుమంటూ చూచేవారు ఈయనను.

"వాళ్ళ తంటాలేవో వాళ్ళు పడతారు. ఎవడో చాతనయిన మెకానిక్‌ని పిలిపించుకుని బాగు చేయించుకుంటారు. మధ్య మీకెందుకు ఆ బాధ" అని నేను చాటుగా విసుక్కునేదాన్ని.

"ఈమాత్రం దానికి ఇంకెవడో మెకానిక్ ఎందుకు? ఒకసారి తీసిచూస్తే అదే తెలుస్తుంది - అంటూ ప్రతివాళ్ళ వస్తువూ బాగుచేస్తానంటూ పూనుకునేవారు. ఆ స్నేహితుల ముఖాలు చూడగానే నేను గ్రహించేదాన్ని వాళ్లు లోలోపల ఎంత భయపడుతున్నారో, వస్తువు ఈయన చేతుల్లో పడినందుకు. ఈయనకి ఆపట్టింపేంలేదు. నిర్భయంగా నిస్సంకోచంగా నీది, నాది అని సంశయించకుండా ప్రతి వస్తువూ బాగు చెయ్యటానికి కంకణం కట్టుకునేవారు.

ఎవరైనా కొత్త వాచీ కొనుకున్నామని అనడం తడవు - ఏదీ చూడనీ, అంటూ అమాంతం ఎదుటి మనిషి చేతినుంచి రిస్టు వాచీ లాక్కుని దాన్ని ఇటూ అటూ చూస్తూంటే వాళ్ళ మొహాల్లో నెత్తురు చుక్క వుండేదికాదు! కొంపతీసి స్క్రూలు



విప్పేసి చూస్తారేమోనని! నేను కన్ను లతో ఎన్ని సైగలు చేసినా నన్ను అర్థం చేసుకునేవారు కాదు. అడకత్తెరలో పోక చెక్కలా ఉండేది నా పరిస్థితి.

ఇంట్లో చిలక్కి చెప్పినట్లు చెప్పి తీసుకు వెళ్ళేదాన్ని 'మీరు వాళ్ళింట్లో ఏదన్నా బాగుచేస్తానంటూ కూర్చున్నా. ఏదన్నా కొత్త వస్తువు తెరిచి పరీక్షిస్తా నన్నా నేను మీతో వచ్చేదిలేదు. చెయ్యనని ఒట్టెయ్యండి'' అని కూడా అనేదాన్ని! ఆయన ఒప్పుకుంటేగా!

''అన్నీ తెలుసుకుని ఉండాలి. అవసర మైతే స్వయంగా సరి చెయ్యటం నేర్చుకో వాలి'' అనేవారు.

ఓ రోజు బజార్లో వెడుతున్నాం మే మిద్దరం, దారిలో శర్మగారూ భార్యా కని పించారు.

''మీ టి. వి. ఎలా పనిచేస్తోందండీ?'' అని అడిగా రీయన. వాళ్ల టి. వి. కొను క్కుని మూడు నెలలయిందిట.

''ఏమిటోనండీ, వచ్చిన కొత్తలో బాగానే ఉంది. ఈ మధ్య వారం రోజుల నుంచీ దానికి కటుపులో తిప్పుతున్నట్టుంది! మధ్య మధ్య ఫ్రేము తిరిగిపోతూంటుంది. పిక్చరు మెలికలు తిరుగుతోంది. మొన్ననే కంపెనీవారికి కంప్లెయిన్ చేశాను'' అన్నా డాయన - కులాసాగా వున్నారా అని మాట వరసకి అడిగితే పరసగా ఉన్న రోగాలన్నీ ఏకరవు పెట్టినట్లు. ''అయ్యో పిచ్చిబ్రాహ్మడా. ఆ సంగతి మా వారితో ఎందుకు చెప్పావయ్యా!'' అని మనస్సు లోనే జాలిపడ్డాను శర్మగారిని చూసి. శర్మ గారి మాటలు వినగానే ఈయన ముఖం పెట్రొమాక్స్ లైటులా వెలిగింది. నిగ నిగ లాడే మేక పిల్లనిచూసి పంజాలు సరి చేసుకుంటున్న పెద్ద పులిలా కనిపించా రీయన నా కంటికి.

శర్మగారి టి. వి. ని ఈయన కబంధ హస్తాల్లోంచి ఎలా తప్పించాలా అని పరి పరి విధాల పోయింది నా మనస్సు. పాతి వ్రత్యం మాట మరిచిపోయి శర్మగారి భార్యని చాటుకి పిలిచి ''మా వారిని నమ్మ కండి. నమ్మి ఆయన చేతుల్లో మీ టి. వి. ని పెట్టకండి సుమా'' అని హితబోధ చేద్దా మన్నంత తపన బయలు దేరింది నాలో.

కానీ, అంతలోనే మరో గొంతు విని పించింది నాలో. ''పాపం, ఆయన్ని ఎందు కలా ఆడిపోసుకుంటావ్! తనకి చాతనయిన విద్యని సద్వినియోగంచేసి నలుగురికీ సాయం చెయ్యటం తప్పా? ఎప్పుడైనా ఎవరి వస్తువైనా పాడు చెయ్యగా చూశావా? చాత నయినంత వరకు బాగు చెయ్యటానికే ప్రయత్నిం చాడు కదా! ఏవో కొత్త వస్తువుల్ని చూసి కొంత కుతూహలం కనపరిస్తే అలా గింజు కుంటూ ఏమిటి నువ్వు ఆయన సామ ర్థ్యాన్ని గుర్తిస్తే ఇక ఊళ్లోవాళ్ళు ఆయన్ని ఎంత గౌరవిస్తారు! నీ ఇంజనీరు భర్తనిచూసి నువ్వు గర్వించాలి గాని సిగ్గు పడటం తగునా'' అని చివాట్లేసింది.

నా అంతరాత్మ చివాట్లేసినప్పటి నుంచీ నాకు ఆయనమీద అభిమానం ఎక్కువైంది.

ఇప్పుడు ఎవరన్నా ''మీవారికేం పని?'' అని అడిగితే తలెత్తుకుని సగర్వంగా

చెబుతున్నాను "ఆయన ఇంజనీరు" అని.

"ఏ ఇంజనీరు? మెకానికలా. ఎలెక్ట్రికలా, సివిలా, కెమికలా, న్యూ క్లియరా" అని అడిగితే, 'అన్నీనూ!' అని మరింత రీవిగా సమాధానం చెబుతున్నాను.

* * *

అంతా చదివిన తరవాత నాకు ఇంజనీరుమీద సదభిప్రాయం కలగలేదు. ఆవిడ కాబట్టి ఆ వేణు మాధవరావు లాంటి ఇంజనీరుతో నెట్టుకొస్తోంది. ఇంజనీరు వద్దు బాబూ అనుకున్నాను. కానీ, అంతలోనే అనుమానం వచ్చింది. అందరు ఇంజనీర్లూ అతనిలాగే ఉంటారా అని. ఉండరని మాత్రం ఎలా చెప్పటం? అన్నం ఉడికిందో లేదో తెలియటానికి ఒక్క మెతుకు ముట్టుకుని చూస్తే చాలదూ అని నాకు నేనే నచ్చజెప్పుకున్నాను. అయినా ఇంతలోకే తొందరపడి నిర్ణయించుకోవటం దేనికి? అన్ని రకాల ఉద్యోగస్థుల్నీ ఒక్కొక్కరి చొప్పున ముందు సర్వే చేసి, ఒక రౌండ్ కొట్టిన తరవాత మళ్ళీ అటు నుంచి నరుక్కొస్తే సరి అని సరిపెట్టుకున్నాను.

మా అక్కయ్య అత్తవారి తరపు బంధువు ఒకాయన ఈ ఊళ్లోనే ఉన్నాడు. అక్కయ్య పెళ్లిలో ఆయన్ని అందరూ భయ భక్తులతో చూసి ఆయనకి అడుగులికి మడుగు లొత్తుతున్నట్లుగా ప్రవర్తించారు. ఆయన పోలీసాఫీసరు. మంచి జమా జట్టీలా ఉంటాడు. ఆయన భార్య ఆయన ముందు పిట్టలా ఉంటుంది. కూజా బిందె పక్కన చెంబులా ఉంటుందావిడ. మన్నాడు ఆ పోలీసాఫీసరుగారింటికి వెళ్ళాను.

అసలు సంగతి విన్నాక ఆవిడ ముందుగా కొంచెం భయపడింది వాళ్ళ ఆయనకి తెలిస్తే ఏమంటాడో అన్నట్లుగా.

"నేను మీ చెల్లెలిలాంటిదాన్ని. మా అక్కయ్య దగ్గరికి వెళ్ళినంత చనువుగా వచ్చాను చూడండి మీ దగ్గరికి. నా దగ్గర మీకు మొహమాట మెందుకండీ! చెప్పరా? ప్లీజ్!" అన్నాను. నా మాటలికి ఆవిడ కరిగిపోయి తనగాథ వినిపించటం మొదలు పెట్టింది!

## పోలీసు ఆఫీసరుగారి భార్య

ఎన్ని చెప్పినాసరేగాని ఈ పోలీసాఫీసరుతో కాపరం చెయ్యటం కష్టమే బాబూ!

ఆయనతో సరదాగా సినిమాకని బయలుదేరి సవ్యంగాచూసి ఇంటికొచ్చిన పాపాన పోలేదు ఇంతవరకూ. ఆ సినిమా హాలు దగ్గర బ్లాక్‌లో టిక్కెట్లమ్మే వాడిని ఇట్టే పసిగట్టి వాడిదగ్గర టిక్కెట్లు కొంటున్నట్లు నటించి, వాణ్ణి అమాంతం రెక్కలు విరిచి పట్టుకుని, పోలీసుస్టేషనుకి ఫోన్ చేయించి పోలీసులొచ్చి పట్టుకెళ్ళే దాకా వదలరు. ఈ లోపల న్యూస్‌రీల్ అయిపోవటమే కాక అసలు సినిమాలోని రెండు మూడు రీళ్ళు గిరగిరా తిరిగిపోతాయి మేమిద్దరం లోపలికి వెళ్లేసరికి. ఈయన తెల్లని పేంటూ షర్టూ వేసుకుని వెళ్లేసరికి పోలీసాఫీసరని తెలియక వల్లో పడుతూంటారు పాపం ఆ దొంగతనంగా టిక్కెట్లమ్మే వాళ్లు.

సినిమా హాల్స్‌లోనేకాదు. బస్సులో వెడుతున్నా బజార్లో సరదాగా నడిచి వెడు

తున్నా సరే. ఆయన కళ్లెప్పుడూ వెతుకుతున్నట్లుగానే ఉంటాయి. ఎవడో జేబు దొంగ ఆయన చేతికి దొరక్క మానడు.

ఓసారి ఒక స్కూటర్‌వాణ్ణి కిళ్లీకొట్టు వాడు చాకతో పొడిచెయ్య బోతూంటే ఈయన చూసి అడ్డుకున్నారు. వాడు మరింత కచ్చతో చాకు ఈయన గొంతు దాకా తెచ్చాడు. నేను కెవ్వుమని అరిచాను ఆ దృశ్యాన్ని చూడలేక. పట్టపగలు నడిరోడ్డు మీద జనమంతా పోగయారే తప్ప ఒక్కడూ ముందుకి రాలేదు. సహాయం చెయ్యటానికి. ఈయన బలంగా ఉంటారు కాబట్టి, చెయ్యి తిరిగిన మనిషి కాబట్టి, ఆ కిళ్లీకొట్టువాణ్ణి ఒడుపుగా నేలకి పడగొట్టి వాడి చేతిలోంచి చాకు లాక్కుని దూరంగా విసిరేశారు. పోలీసు లొచ్చేదాకా వాణ్ణి అలాగే తొక్కిపెట్టి ఉంచారు. ఆ క్షణంలో మా వారంటే ఎక్కడలేని గర్వం ఉప్పొంగిందినాలో. కానీ, ఎప్పుడూ గుండె బెదురుగానే ఉంటుంది. ఏ క్షణంలో ప్రమాదంలో చిక్కుకుంటారో అని. అంతే కాదు. ఆయనకి అనుక్షణం దొంగల ధ్యాసే!

ఓరోజు పొద్దున్నే ఆఫీసుకి వెళ్లబోతూ "ఏమ్, ఇలారా" అని ఒక పొలికేక వేశారు. వంటింట్లో ఆయనకోసం భోజనం సిద్ధం చేస్తున్న నేను ఒక్క పరుగున వెళ్ళాను.

"నా జేబులో పదిరూపాయలనోటు ఎవరు తీశారు?" అని నిలదీసినట్లు అడిగారు.

ఆయన మరీ అంత కర్కశంగా అడుగుతూంటే తెల్లబోయి చూశాను నోట మాటరాక. నామౌనం చూసి మరింత అసహనంగా "నువ్వేనా తీసింది!" అని అరిచారు.

ఆయన ఆ మాటలన్న తీరుకి నా కళ్లమ్మట నీళ్ళు తిరిగాయి. పెళ్ళయి అప్పటికి పట్టుమని నెలరోజులు కాలేదు. ఎంతెంత మాట అంటున్నారు నన్ను! కోపం. దుఃఖం ఆగక ఒక్క పరుగున వంటింట్లోకి వెళ్ళిపోయాను మారు మాట్లాడకుండా.

ఆయన నా వెనకాతలే వచ్చారు.

"ఇంటి దొంగని ఈశ్వరుడైనా పట్టలేరంటారు. నీ మొగుడెవరనుకున్నావ్! పోలీస్ ఇన్‌స్పెక్టర్! ఆ ఈశ్వరుడి బాబు!" అన్నారు.

ఇంక ఆయన ధోరణి సహించలేక పోయాను.

"నేనేం దొంగనికాదు. మీరు బాత్‌రూమ్‌లో ఉండగా పనిమనిషి జీతం ఇమ్మని చంపుకుతింది. మీరు బయటికొచ్చాక చెప్పొచ్చులే అనుకొని మీ జేబులోంచి తీసిచ్చాను. తరవాత వంట హడావిడిలో మరిచిపోయాను. ఈమాత్రం దానికే దొంగతనం అంటగట్టాలా?" వెక్కి వెక్కి ఏడ్చాను.

"ఊరికే నాటకం ఆడాను! నువ్వెలా తీసుకుంటావో చూద్దామని." అంటూ నన్ను దగ్గరకు తీసుకోబోయారు. నేను విసురుగా విడిలించుకున్నాను. ఆ రాత్రి నన్ను ప్రసన్నం చేసుకోవటానికి చాలా ప్రయత్నించారు. ఎందుకో నాకు అప్పటి నుంచీ అదుటుగా ఉంటుంది ఏ పని చెయ్యాలన్నా. ఆయనకి ముందుగా చెప్పకుండా

ఒక్కపైసా ముట్టుకోవటానికి కూడా ఆత్మాభిమానం అడ్డొస్తుంది నాకు. ఒక్కొక్కప్పుడు. ఉద్యోగంచేసి స్వయంగా సంపాదించుకుంటామా అన్నంత ఉక్రోషం వస్తుంది. నిజానికి ఆ సంఘటన తరవాత మళ్ళీ ఎప్పుడూ నన్ను అనుమానించినట్లు గాని అవమానించినట్లుగాని సూచనలు కూడా లేవు, కానీ నాకే ఎందుకో స్వేచ్ఛ లేనట్లు ఉంటుంది.

ప్రాంతాల్లో మెలుకువొచ్చింది నాకు. బాత్ రూమ్‌కి వెళ్ళొచ్చి మళ్ళీ పడుకుంటా మరి ప్రయత్నించాను. ఎంతకీ నిద్రపట్టలేదు. ఆయన గాఢ నిద్రపోతున్నారని సన్నని గురకపట్టి తెలుస్తోంది. ఆ గురకవల్ల ఇంక నాకు అసలే నిద్రపట్ట దనిపించింది. ఆయన వైపుకి ఒత్తిగిలి ఆయన్ని మెల్లిగా కదిపిచూశాను. ఆయనకి మెలుకువ రాలేదు. నా చెయ్యి మెల్లిగా ఆయన చొక్కా




నేరస్థుల్ని పట్టుకోవటం, నేరాల్ని నిరూపించటం ఆయనవృత్తి అది ఆయన ప్రవృత్తిగా కూడా మారిందనుకుంటాను.

ఒకసారి ఏమైందంటే, రాత్రి ఇద్దరం పెందరాడే భోంచేసి ఏవో పత్రికలు చదువుతూ పడుకున్నాం. ఆరోజు మరీ పెందరాడే పడుకోవటంవల్ల రాత్రి రెండు గంటల

క్రిందినుంచి దూర్చాను. శరీరాన్ని తాకితే మెలుకువొస్తుంది కదా అని. అంతే!

"దొంగ దొంగ" అంటూ గట్టిగా అరిచారు నా గుండె దడదడ లాడింది. చెయ్యి చటుక్కున వెనక్కి లాగేసుకున్నాను. తీరా పరీక్షగా చూస్తే ఆయన యథాప్రకారం నిద్రపోతూనే ఉన్నారు. నా

స్పర్శకి దొంగ దొంగ అని పలవరించిన ట్లున్నారు! కానీ ఆయన కేకలికి నాపై ప్రాణాలు పైకే పోయినట్లయింది.

ఇంకెప్పుడూ ఈయనతో సరస మాడ కూడదనిపించింది. పట్టపగలు ఆయన చూస్తూండగా ఏమన్నా ప్రేమ కలాపం సాగిస్తే సాగించాలి గాని ఆయన ఆదమరిచి ఉండగా గాని రాత్రిపూట నిద్ర పోతున్నప్పుడ గాని కన్యూర్తి పడ్డానంటే నా పరువు పోయిందన్నమాటే. ఇంట్లో ఎవరూ లేరు కాబట్టి సరిపోయింది. ఆయన అరుపులు ఎవరైనా వినివుంటే అసలు సంగతి తెలిశాక నవ్వరూ?

నేనెంత జాగ్రత్తగా ఉన్నా నా గుండె బేజారైయేటట్లుగా ప్రవర్తిస్తారాయన.

ఓనాడు అర్ధరాత్రివేళ అవతలికి వెళ్ళ టానికి లేచారాయన. అలికిడికి నాకూ మెలకువొచ్చింది. అయినా కళ్ళు విప్ప లేదు. ఆలోచిస్తున్నాను లేద్దామా వద్దా అని. అసలే పౌర్ణమి రాత్రి. చలి మరింత గజగజ లాడిస్తోంది. కప్పుకున్న రొజాయి తీసి తెగించి బయట పడాలంటే ఓ పట్టాన మనసు పుట్టదు. మనస్సు దిటవు చేసుకుని రొజాయి చడీ చప్పుడు కాకుండా అతి సౌమ్యంగా తొలిగించి-చలి లోపల ఎక్కడ దూరేస్తుందోనన్న భయంతో-తల గడా క్రింద పెట్టుకున్న మఫ్లర్ తీసి తలకి చుట్టుకుని బయట కాలు పెట్టాను.

బాత్‌రూమ్ లోంచి బయట కొస్తున్న ఆయన అమాంతం ఒక్కగావు కేక పెట్టారు. నా గుండె అరక్షణం పాటు ఆగిపోయినట్లయింది. నాకు అసలే పురుగూ పుట్రా అంటే చిన్నప్పటినుంచీ భయం. "అమ్మ బాబోయ్" అంటూ ఒక్క గెంతులో మంచం మీది కెగిరాను.

"దొంగ దొంగ" అని అరుస్తూ ఒక్క దూకులోవచ్చి నన్ను గట్టిగా పట్టు కున్నారు. "ఏమిటండీ?" అన్నాను నిలు వెల్లా వొణికిపోతూ. ఆయన అంతకన్నా కంపిస్తున్నారు ఆపాదమస్తకం. ఒక్క పరుగున రావటంవల్ల ఒగురుస్తున్నారు.

దొంగ ఎక్కణ్ణించి వచ్చాడు, ఏమిటి సంగతి అని మళ్ళీ అడిగితే మండి పడతా రని మాట్లాడకుండా వొణుకుతూ కూర్చు న్నాను. చలికి కొంతా, భయానికి కొంతా ఆయన వొణుకుడూ, ఒగుర్పూ తగ్గిన ట్లుంది. కాస్సేపటికి తిరిగ్గా "నీ దుంప తెగా!" అన్నారు.

నేను నివ్వెర పోయాను అర్ధరా త్రప్పుడు నేను చేసిన అపరాధం ఏమిటి చెప్మా అని.

"నువ్వెప్పుడు లేచావ్! నేను లేచి వెళ్ళేసరికి మొద్దులా నిద్రపోతున్నావుగా! నువ్వు గదిలోంచి బయటకొస్తూంటే నీ నీడ గోడమీద పడింది. ఆ మఫ్లరూ నువ్వూ, పచ్చి దొంగలా కనిపించావ్!" అన్నారు.

"అవును లెండి. కామెర్లవాడికి లోక మంతా పచ్చగా కనిపించినట్లు మీకు ప్రతి వాళ్ళూ దొంగల్లాగే కనిపిస్తారు!" అన్నాను ఉడుకుమోత్తనంతో.

ఈ లెక్కన ఈయన నాకు ఏ క్షణాన చేతులికి కడియాలు తొడిగి ఊరేగింపులో తీసుకెళ్ళిశ్రీకృష్ణ జన్మస్థానంలో పెడతారో నన్నట్లు నా ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని బ్రతుకుతున్నాను.

* * *

నాకు నవ్వాగలేదు. ఆవిడ కథ విన్నాక. ఇంటికొచ్చాక కూడా నాలో

నేను ముసిముసి నవ్వులు నవ్వుకుం టూంటే వదిన చూసింది.

"ఏమిటి వసంతా. అంత నవ్వొచ్చే సంగతి!" అంది.

అంతా విన్న తరవాత పడి పడి నవ్వి "నన్నుకూడా నీతో తీసుకు వెళ్ళక పోయావా, ఇంట్లో ఒక్కర్తెనీ కూర్చు న్నాను" అంది.

"సారీ, వదినా! కానీ నువ్వుకూడా ఉంటే ఆ విడ అలా మనస్సువిప్పి మాట్లాడటానికి మొహమాట పడేదేమో! ఎంతయినా నువ్వూ గృహిణివి కదా!" అన్నాను.

"మొత్తంమీద నీ కాలక్షేపం వ్యవ హారం బాగానే వుంది! చూస్తానుగా ఎంతటి ఘనుడైన వరుని చేజిక్కించు కుంటావో!" అంది వదిన నవ్వుతూ.

మర్నాడు యూనివర్సిటీనుంచి వచ్చిన తరవాత కాఫీ టిఫినూ తీసుకుని హడా విడిగా బయలుదేర బోతూంటే వదిన చూసి "ఇవాళ ఏ ఉద్యోగి భార్యని తగులు కుంటున్నావ్" అంది కన్ను గీటుతూ.

నేను ముక్కుమీద వేలేసుకుని "వ్యవ హారంమీద వెళ్ళే వాళ్ళని అలా అడక్కూ డదని తెలియదూ?" అంటూ అసలు సంగతి చెప్పకుండా సస్పెన్స్‌లో పెట్టి చల్లగా, బయటికి జారుకున్నాను.

నిజానికి అప్పటిదాకా ప్లాన్ చేసుకో లేదు, ఎవరెవర్ని కలుసుకోవాలని. ఎవరు గుర్తుకొస్తే వాళ్ళని చూడటం మొదలు పెట్టాను. ఇకముందు అలా కాకుండా ఒక పథకం తయారు చేసుకోవాలని నిశ్చ యించుకున్నాను.

ఆ పూటకి మాత్రం మా పక్కవీధిలో ఉంటున్న డాక్టరుగారింటికి వెళ్ళాను. ఆవిడ నలభై దాటిన మనిషి అయినా చాలా సర దాగా చలాకీగా ఉంటుంది. ఆవిడకి నే నంటే ఇష్టం కూడా. అందుకని ఎంతో ఉత్సాహంగా బయలుదేరాను.

నన్ను చూస్తూనే ఆవిడ "రా, వసంతా, రా" అంటూ పిలిచి, "ఇవాళ పొద్దుటినుంచీ కాకి ఒకటే అరుపు. చుట్టా లెవరొస్తారా అని పొద్దుటినుంచి ఎదురు చూస్తున్నాను" అంది. ఆవిడ ఆప్యా యత చూస్తూంటే అమాంతం ఆవిడ ఒళ్ళో కూర్చోవాలనిపిస్తుంది నాకు.

నేను వచ్చిన పని చెప్పాను సూటిగా. ఆవిడ ప్రేమ మాటల్లో మునిగితే మళ్ళీ తేలటం కష్టం అని.

"ఏవమ్మా, రోగాలు కొని తెచ్చుకో వాలని ఉందా డాక్టర్ని చేసుకోవాలనుకుం టున్నావ్!" అంది పరిహాసంగా.

"అబ్బే! నేనేమీ ఇంకా నిశ్చయిం చుకో లేదండీ మీ అనుభవం గురించి తెలుసుకుని ఏ సంగతి తేల్చుకుందామను కుంటున్నాను."

"అయితే ఉన్న దున్నట్లు చెబుతాను. ఆ పైన నీ ఇష్టం. నా పూచీ ఏం లేదుస్మీ!" అంది ఇంజనీరుగారి భార్యలాగ. నేను బుద్ధిమంతురాలిలా చేతులు కట్టుకుని కూర్చున్నాను. ఆవిడ చెప్పటం ఆరం భించింది.

(డాక్టరుగారి భార్య అను భవాలు, ఇతర వృత్తుల లో వున్న వ్యక్తుల భార్యల అను భవాలు మరికొన్ని — వచ్చే సంచికలో.)

# గర్వం?

నన్ను కని
కన్నీళ్ళను త్రాగి బ్రతుకమని
ఆకలిని నేర్పింది నా కుటుంబం.
పవిత్ర సంస్కృతినీ, నాగరికతనూ
పాత గ్రామ్‌ఫోన్ రికార్డులా వల్లిస్తూ
నన్ను బుద్ధునికీ, గాంధికీ వారసుణ్ణి చేసి
నాలో నైర్మల్య సమిధలను అంటించి
మరోవేపు వీపుమీద ఇనుప కడ్డీలతో కాలుస్తూ
వెనుకనుండి విరగబడి నవ్వుతోంది నా సంఘం.
నా తెలివికీ, మేధకూ మెచ్చి
నా ముఖాన ఓ డిగ్రీని పారేసి
నన్ను చీకటి సముద్రంలోకి తరిమింది నా ప్రభుత్వం.
నేను...
ఆకలిలో,
కన్నీళ్ళలో,
గుండెలనిండా అనంత శూన్యంలో కూరుకుపోతుంటే
నన్ను కన్న నా దేశం హసిస్తోంది ఆకాశంలా.
ఐనా... పరువుకోసం
నేనీ పవిత్ర భారతదేశంలో పుట్టినందుకు గర్విస్తున్నాను.
హుఁ...
గర్విస్తున్నాను!

—రామా చంద్రమౌళి

# రంగదాసు ప్రేమ కథ

రంగదాసుకు ప్రేమపిచ్చి ఎక్కువ.

పాపం ఇప్పటికి కనీసం ఒక పాతిక మంది అమ్మాయిల్ని ప్రేమించి ఉంటాడు. అయితే ఏ ఒక్కరూ ఇతని వైపు కన్నెత్తి చూడక పోవడంతో వచ్చింది చిక్కు.

పట్టుదలకు మారు పేరు రంగదాసు. కొత్త 'ప్రేయసి' కోసం వెదికేందుకు ఓ కొత్తరకం చొక్కా కొందామని షాపు కెళ్ళాడు. షాపంతా రకరకాల రంగు రంగుల రమ్యమైన రెడీమేడ్ షర్టులతో కళకళలాడుతూంది. తన ప్రత్యేకత నిల బెట్టుకోవడం కోసం ఓ చిత్రమైన కొత్త రకం డిజైన్‌గల ఓ చొక్కా తీయించి పాక్ చేయించాడు. బిల్లుతోపాటు ఓ గులాబిరంగు కాగితం ఇచ్చాడు షాపు యజమాని. ఇస్తూనే చెప్పాడు. 'నాలుగు రోజులనాడు మా షాపుకొచ్చిన ఓ యువతి ఈ ఉత్తరం మా కిచ్చారండి. ఈ షర్టు ఎవరు కొంటే వారికిమ్మని '

రంగదాసు గుండె స్థానం తప్పి మళ్ళీ స్వస్థానం చేరింది.

'ఎలా ఉంటుంది? వయసెంత?' అన్నాడు ఉంగార్పంతోషంగా.

'చాలా బాగుంది. ఇరవైకి ఒకటటూ యిటూ."

ఈ మాట వినడంతోనే రంగదాసు క్షణాలమీద బిల్లుచెల్లించి అరక్షణాలమీద రూం చేరుకొని గులాబిరంగు ఉత్తరం విప్పాడు.

శ్రీ.... గారికి,

దయచేసి మీ ఫోటో యీ క్రింది అడ్రసుకు పంప ప్రార్థన.

విధేయురాలు,
సునీత

క్రింది మీదయ్యాడు రంగదాసు. ఇన్నాళ్ళకు ఓ వనిత తనంతట తను 'తన'ను వలచినందుకు ఉబ్బొంగి పోయాడు. వెంఠనే ఓ ఫోటో ఓగేసి ఆ చిరునామాకు పంపేశాడు.

ఆ రోజునుంచీ పోస్టుమాన్ కోసం నిరీక్షణ రంగదాసు కార్యక్రమంలో ప్రధాన పాత్ర వహించింది.

ఫోటో పంపిన సరిగ్గా నాలుగో రోజు.

రంగదాసుకు గులాబిరంగు కవరం దింది.

రంగదాసు స్నానంచేసి, ఒళ్ళంతా పౌడర్ రాసుకొని. అందంగా అలంక రించుకొని, విలాసంగా సిగిరెట్ ముట్టించు కొని మరీ ఉత్తరం చించాడు.

గులాబిరంగు కవర్లో, గులాబిరంగు కాగితం. ముత్యాల్లాంటి అక్షరాలు. శ్రీ రంగదాసుగారికి, నమస్తే. మీ ఫోటో అందింది. కృతజ్ఞతలు. ఇంత పరమ చెత్త ఫాషనుతో వచ్చిన ఆ చొక్కా కొనే ఘంర ఎలా ఉంటాడో చూద్దామన్న నా కోరిక తీర్చారు. మరోసారి థ్యాంక్స్.

ఇట్లు,
సునీత

పి. యస్: ఈ విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు, మా ఇంట్లో నేను పెంచుకొనే బొచ్చుకుక్క కాక మరో మూడు అల్సేషియన్లున్నాయనీ, నా అన్నలు ముగ్గురూ పోలీసు డిపార్టుమెంటులో పెద్ద పదవులలోఉన్నారనీ గమనించ ప్రార్థన. ★

— వేమూరి సత్యనారాయణ.



రాచకొండ రంగనాథశర్మ

ఐదుగ్లాసులు ఒకదానికొకటి చిన్నగా తగిలి వింతశబ్దంచేసి 'వెధవ త్రాగుబోతు మూతుల్ని' సుతారంగా తాకాయ్.

త్రాగినవాడెప్పుడూ నిజాల్నే చెబుతాడంటారు—

ఆలా వాళ్ళదగ్గర్నుంచి కొన్ని నిజాల్ని రాబట్టటమే నా 'మోటో.'

అందుకే నేను అక్కడ ఆరవవ్యక్తిగా మాత్రం ఉన్నాను.

చపలత్వం అనే తెలుగుమాటకు (నాగరిక ప్రపంచంలో) ఖచ్చితమైన యింగ్లీషు పదం 'కంపెనీ' అంటాన్నేను - డోంట్ కేర్-నా అభిప్రాయంతో ఎవళ్ళయినా ఏకీభవించకపోతే-

'కాస్త కక్కుర్తిపడు.'

'కొంచెం ఎంగిలిపడు.'

(లేకపోతే మేం తింటూంటే వెధవన్నర వెధవ కళ్ళేసుకుని చూస్తూ, ఊరుతున్న లాలాజలాన్ని ప్రక్కకు తిరిగి గుటక వేస్తావ్)

యివన్నీ మోటుపదాలు కనుక దాన్ని యింగ్లీషులో 'కంపెనీ' కోసం అంటాం వన్నమాట.

ఇంక ఆ అయిదుగురత్రాష్ఠుల పేర్లూ యివి—

గళ్ళచొక్కా తొడుక్కుని ఎర్రరుమాలు మెళ్ళోకట్టుకుని ద్రాపిమొహంతో ఉన్నాడు చూడండి. వాడు శివలింగం (బొన్సార్: వాడసలు పేరు శివలింగమే కావచ్చు-వాణ్ణి చూసినవాడెవడూ అలా పిలవడు)

యిక వాడిపక్క ... ఉడతమొహం వెధవ సైదులాకులూ - హిప్పీక్రాపూ వెధవకి యెప్పుడూ ఊటబావిలా చొంగ కారుతూనే ఉంటుంది-వాడి పేరు కాంచన

గంగారావు.

శవలింగానికవతల ప్రక్కవాడి పేరు లలాటశాస్త్రి-పితలాటశాస్త్రి అప్రాప్రియేట్ నేమ్-గుంటకళ్ళూ- నక్కబుద్ధులూనూ.

నాలుగోవాడు సూరిగాడు - మీసంలో అక్కడక్కడ నాలుగు తెల్లవెంట్రుకలు మొలుస్తున్నాయని మీసం ఉంచడసలు తాటికాయమీద కళ్లు ముక్కు నోరు అతికించినట్టుంటుంది వాడి మొహం.

పోతే ఐదోవాడు ఆ వెధవమొహం మీద 'నవ్వు' అనేది వాణ్ని లక్షరూపాయలనోట్ల మధ్య పాతేసినా కనిపించదు. ఎప్పుడూ ధుమధుమలాడుతున్నట్టు చేఁవట కాయలు పేలినట్టు దురద-దురదగా ఉంటుందా మొహం. వాడిపేరు మార్తాండమూర్తి!

ఫస్టురౌండు పూర్తిచేశారు.

మళ్లీ ఐదుగ్లాసులూ నింపేను.

సెకెండ్ .. థర్డ్ ఫోర్త్ రౌండ్,

ఒకదొకడిలో అమోఘమైన పేలాపనాశక్తి విజృంభిస్తూంది.

యీ అవకాశాన్నే వినియోగించుకోవాలనుకున్నాను - అయితే అయిదుగురూ ఒక్కసారే ఒకడు చెప్పింది మరొకడు వినిపించుకోకుండా తను చెప్పేదే ఎదుటివాడన్నదానికి జవాబుగా సాగిపోతూంది ధోరణి—

రెండు దస్తాలు పేకతీసాను—టేబుల్ మీద పడేశాను.

అందరూ తయారయిపోయేరు.

నలుగురు పేకాడుకోండి ఒకడు మాత్రం నాతో 'చెస్' ఆడాలి అన్నాను.

పేక వదిలేసి 'గురో—నేను' అంటూ ఎవరికివారే తయారయ్యారు.

అలా కాదు; ఒకరొకర్తో ఆడుతాను. యీలోగా నలుగురు కలిసి 'రమ్మీ' ఆడుకోండి.

అదేం లాభంలేదు. నువ్వుకూడా నాలుగు పెగ్గులేసుకో ఆరుగురం కలిసి 'లిటరేచ' రాడుకుందాం.

'నోనో' అన్నాను.

'మీలో ఫస్టుక్లాస్ ఫూల్ ఒకడుంటాడు-వాడెవడో ముందుకు రండి.'

ఒకళ్ళముఖాలొకరుచూసుకున్నారు.

'మేఁవంతా ఫస్టుక్లాస్ ఫూల్స్ఁవే' ఏకగ్రీవంగా అన్నారు.

నా ప్లాను చెడిపోతూంది-పైగా ఎంత ఖర్చుపెట్టానని?!

ఒరేయ్ శవలింగం-రాస్కెల్. నువ్వు పేకాడతావా? చెస్సాడుతావా!

నలుగుర్తోటి నారాయణా. ఆక్లేదంటే మరి నేనూ అద్దదే-ఏంట్రా ఏఁవంటారు' అంటూ నవ్వటం మొదలెట్టాడు.

నాకు ఒళ్లు మండిపోతూంది.

మరో యిద్దరి వెధవల్నుంచి కూడా నాకు అలానే జవాబు వచ్చింది.

నాలో పేషన్స్ చచ్చిపోతూంది.

మిగతావాళ్లను కూడా అడిగేశాను.

జవాబు విని చాచిలెంపకాయకొట్టి చెవులు మూయాలనిపించింది.

ఆల్‌రైట్! మీ ఐదుగురూ కలిసి మిగతా రెండు బాటిల్సూకూడా కాళీచేసి ఓమూల పడి ఏడవండి-నేవెళ్ళిపోతున్నా' అంటూ లేచి రెండడుగులు వేసాను—యింతలో....

''పోవుచున్నాదే కవిగాడు పీరుకారి

పోవుచున్నాడే'' సూ రి గా డు పాట అందుకుంటే మిగతా స్కౌండ్రల్స్‌లయ బద్ధంగా (పడటంలేదసలు) అడుగులేస్తు న్నారు.

నాకు వెర్రికోపం వచ్చేసి బయటకు నడిచి తలుపు గొళ్లెంపెట్టేసిఅవతలకుర్చీలో కూర్చున్నాను.

''అలుగుటయే యెరుంగని .''

''అలకమానవే చిలకలకొలికీ.''

ఇంకా యేవేవో కలగాపులగంగా. ముద్దముద్దగా లోపల్నుంచి విన్పిస్తూనే ఉన్నాయ్ వాళ్లగురించిన నిజాల్ని వాళ్ళ చేతే చెప్పిస్తే సబువుగా ఉంటుందనే నా ప్లానంతా డర్టీఫూల్స్ నాశనం చేశారు. వాళ్లగురించి నా భాషలో వ్రాయక తప్పటం లేదు.

ఫస్ట్‌ఫూల్ (1) శవలింగం బియ్యే చది వాడు. రెండోక్లాసు పాసయినట్టు కూడా కనిపించడు. పన్నెండేళ్లకే స్త్రీ వాంఛ పట్టు కుంది వాడికి. అది కురుపులా సలిపి జలో దరంలా పెరిగింది. కసుగాయల్నీ కన్నె పిల్లల్నీ రుచిచూశాడు. నేస్టీ ఫెలో మొగుడు చచ్చిన ముండల్దగ్గర వీడి విజ్ఞానం అంతా ఒలకబోసి ఆరిపోయిన కోరికల మీద యింత పెట్రోలు పోసి భగ్గు మనిపించి గుట్టుచప్పుడు కాకుండా వాడింత సుఖపడి వాళ్ళకింత సుఖాన్ని పంచి యిచ్చే వాడు. ఓ ఏభై వేలధికారి చెడిపోయిన వెధవ కూతురి మెళ్లో తాళిగట్టేసి వీడో సంస్కర్తయి కూర్చున్నాడు. యీ సంస్కర్తకు కొంచెం సాహిత్యాభిలాష యేడ్చి. యింటర్వ్యూలూ వెధవ్వేషాలూ అంటూ సానికొంపలంట తిరిగి వాళ్ల కథ కమామిసూ తెల్సుకుని వీడి అనుభవాల్ని జోడించి సెక్స్ పత్రికలకి కథల్రాస్తూం టాడు. ముదిరిపోతున్న వయస్సుకు మెరుగులు దిద్ది మావగార్ని కూడా ముం డల మురాకోరుగా తయారుచేసిన ఘనత కూడా వీడికే దక్కింది. వీడికి యింటా బయటా కూడా రాజకీయంగా ఉన్న ఇన్‌ఫ్లు యెన్సు నుపయోగించి తిమ్మిని బొమ్మిని బొమ్మిని తిమ్మిని చేస్తూంటాడు. ఒకానొక సందర్భంలో వీడి పెళ్ళాన్ని తార్చేసి కావల్సినపన్లు చేయించుకున్నాడు 'ఏరా యిది' అని అడిగితే 'ఒరేయ్' దాన్ని నేను పెళ్ళాడేసరికే నాకు తెల్సున్నంత వరకూ అది సెకండ్‌హాండ్ సరుకే దాన్ని అంగీకరించిన నా సంస్కారం మరెన్ని 'హాండులు' మారినా ఒప్పుకుంటుంది' యిదీవీడి జవాబు. ఇంతతంటె వీడిగురించి ఎనలైజ్ చేయటం సిరాదండుగ అనవ సరం, నెక్ట్స్ అండ్ సెకండ్‌ఫూల్. కాంచన గంగారావు. వాడు ఇంటరు చదివాడు. (పాసయ్యేనని చెబుతాడు) అదర్స్‌కాస్ట్ మీద బ్రతికేయటం అంటే వాడికి నల్లేరు మీద బండి నడిచినట్టే. వాళ్ళనాన్న వడ్డీ వ్యాపారాలు చేస్తూ నానా గడ్డితిని వీడి కోసం సంపాదించి పెట్టేడు. సంపాదిస్తు న్నాడు. వాడి నాన్నకు వీడు మూడో పెళ్లాం కొడుకు. ఒక్కగా నొక్కడు. మొదటి యిద్దరి పెళ్ళాల్నీ సుఖపెట్టలేక పోతే వాళ్ళిద్దరూ తలొకణ్ణి తగులుకుని రూంమ్మని లేచిపోయారు. మూడోది సుఖాల్తో విసుగెత్తి మూడో పెళ్లాంగావచ్చి వీణ్ణి కనేసి తనకర్తవ్యం అయిపోయినట్టు ఓరోజు ఛామ్మని చచ్చూరుకుంది. వీణ్ణి

వాళ్ళ నాన్న ఒకళ్ళమీద బ్రతకటం చిన్నప్పట్నుంచీ నేర్పి దేశంమీదకు వదిలేసాడు. వెధవ రోజుకు పెట్టిన్నర సిగరెట్లు తగిలేస్తాడు. అయితే ఒకటీ కొనడు. పొద్దున్న టిఫినూ సాయంత్రం టిఫినూ కూడా ఇంకోళ్ళ ఖర్చుతోనే మింగుతూ ంటాడు. కొత్తగా తాగడం నేర్చుకునే వాళ్ళకీ తాగినట్టు తెలిస్తే యింట్లో యెవ్వకలేరెస్తా రనుకునే వాళ్ళకీ వీడు గురువు. వీడిగొంతు తడిపి మరీ వాళ్ల కక్కుర్తిపడతారు. యెప్పుడూ బారులంట తనను పోషించే వాళ్లను వెంటేసుకుని తిరుగుతాడు. దొంగసారా వర్తకుల సంఘానికి వీడు ప్రెసిడెంటు 'వేట్' దొరికినా 'నాటు' దొరికినా తాగుతాడు. ఆ భేదం లేదు. అయితే తన స్వంతఖర్చుమీద మాత్రంకాదు. యీ విశాల ప్రపంచంలో ఒకడిగా బ్రతికేస్తున్నాడు మొత్తంమీద బద్మాష్!?

తర్వాత లలాటశాస్త్రి - దేశం ఖర్మం కాలి వాడు 'లా' చదివుంటే అధర్మం నాలుక్కాళ్ళమీద నడిచేది - వాడికింట్లో పొట్టపగిలేలా తిండిపెట్టే తల్లుంది - సత్తె కాలంది. కొడుకుచేత తలకొరివి పెట్టించుకుందుకు సిద్ధగావున్న తండ్రున్నాడు. అభాగ్యుడు. వీడు తెచ్చే తగువులన్నీ తీర్చడానికి మెరికలాటి మేనమామ వున్నాడు. వస్తాదు తిండిపోతు - లలాట శాస్త్రిది, నోరుకాదు. దాన్నేం వనాలో - అంటారో నాకూ తెలీదు. ఆ నోటంట ఒక్క మంచి మాట రాదు. ఎప్పుడూ ఏ యిద్దరికి 'లంకె' పెడదామా అన్నదే వాడి ఆలోచన. అడుగు పెట్టినచోట పిడుగు పడుతుంది. నోరు విప్పినచోట ఘోరాలు జరుగుతాయ్. మాట్లాడేడంటే పోట్లాటకు సిద్ధమవాలన్న మాట - ఉలపి జన్మ - చిలిపి జన్మాను వాడిది. వాణ్ణి చాలామంది లలాట శాస్త్రికి బదులుగా పితలాటశాస్త్రి అంటారు. అంద



రికీ తలలో నాల్కలా ఉన్నట్టుండాలనే వాడి తాపత్రయం-పక్కనే పుచ్చపాదు-పట్టి రాస్కెల్ వాడు వాడి అమ్మకీ-నాన్నకీ కయ్యం పెట్టాడు అమ్మకీ - మేనమావకీ మధ్య పచ్చగడ్డేస్తే భగ్గుమ నేలా చేసాడు. నాన్నకీ - మేనమావకీ పడ కుండా చేశాడు. అసలు వాడికీ వాడి ఆలో చనలకి పడదు. వాణ్ణి భజనచేసేవాళ్ళను నలుగుర్ని తన వెంట తిప్పుకుంటాడు. అందులో ఒకళ్ళతో ఒకళ్ళకు భస్తే సామ్యం ఉండనీడు. ఎవరికివారే హై స్థాయిలో వీణ్ణి భజన చేయాలనుకునే టట్టు తయారు చేస్తాడు - కుంటి పెళ్లానికి సొట్ట మొగుడులాటి బాపతు. వాడి భాష లోనే 'నేను పరమ వెధవని. వెధవన్నర వెధవని - వెధవన్నర వెధవా స్క్వేర్‌ను' వాడి నిత్యస్లోగన్' అది. నేను కాదనను-వాణ్ణి తెల్సినవాళ్లెవరూ కాదన్లేరు. 'గాడె లోన్ కెన్ సేవ్ హిమ్.

పోతే సూరిగాడు. వీడిలో మంచిగుణం ఒకటుంది. అది తను చెడిపోతున్నానని ఏడవక పోవటం. యెదుటివాడు ఏమాత్రం బాగుపడ్డా ఘొల్లు మంటాడు. వాడికి రంభ లాటి పెళ్లాం వున్నా పక్కవాడి 'కొక్కిరాయి'లాటి పెళ్లాన్ని చూస్తే వాడికి జెలసీ. వాడు మల్లెపువ్వులాటి బట్ట లేసుకున్నా పక్కవాడు కొత్త యిస్త్రీబట్ట తొడిగితే వాడి క్కావల్సినంత మంట. వాడి అంద మైన పెళ్లాం అందమైన చీర కట్టుకుని అందంగా తయారైతే వాడికీ 'ఎలర్జీ' - దేశంలో ప్రతి చేతగాని వెధవ రాజ్యాలేలే స్తున్నాడనీ పీఠాలలంకరించేస్తున్నాడనీ వాడి బాధ' పెళ్లాం ద్వారా సంక్రమించిన ఆస్థి రెండు లకారాలుంది. వాడి స్వంతది. పాతది అయినా ముప్పయి వేలుచేసే యిల్లుంది. బాంకులో వడ్డీలు తెచ్చే డబ్బుంది. వాడికిలేనిదల్లా తృప్తి యీ ప్రపంచంలో వున్నదంతా వాడి పేరున రాయించేసుకోవాలన్నంత 'ఆట' వుంది. నో ఎక్స్క్యూజ్. ఆ రాస్కెల్‌ని డబల్ బారెల్ గన్నును గుండెలమీద పెట్టి కాల్చే సినా తప్పులేదు. 'తృప్తిలేని పశువూ ఓ మనిషేనా?'

యిక మిగిలిందల్లా మార్తాండ మూర్తి. వీడికి దేశభక్తి యెక్కువ. పరమ దేశ భక్తుడికి అల్లుడు. వీడి మామ లక్షాధికారి. దేశంకోసం అన్నీ త్యజించడానికి సిద్ధ పడిన వ్యక్తి ఆయన. యెన్నో ప్రజోప యోగ కరమైన పనులు చేశాడు. అందుకు తన ఆస్తిని విరజిమ్మాడు. పూర్తిగా తన యావదాస్తినీ దేశానికి రాసిచ్చేద్దాం అను కుంటూండగానే యీ మార్తాండ మూర్తి ఆయన కూతురుమెళ్లో ఓ తాళి కట్టి పారే శాడు. మామగారు బ్రతికుంటే దేశాని కెక్కువ సేవ చేసేటట్టున్నాడని మామ గార్ని చంపి పారేయించాడు. ఆయన చేయదల్చుకున్న పనులను నేను పూర్తిచేసి ఆయన ఆత్మకు శాంతి చేకూరుస్తానని ప్రెస్ స్టేట్‌మెంట్స్ యిచ్చాడు. దాంతో వీడి ఇన్‌ఫ్లుయెన్స్ తారాపథాని కందు కుంది. పాతిక లక్షల ఆస్తిని మామగారు ఏడు లక్షల వరకూ కరిగించేసరికి అల్లు డుగా వచ్చి మామను పరలోక యాత్ర పంపిన మూడేళ్లలో నలభై లక్షల ఆస్తిని సంపాదించాడు. దొంగ నోట్లు, స్మగ్లింగ్ అవి పొక్కకుండా పార్టీలకు విరాళాలు

ఓహ్, డబ్బు రాజ్యం ఏలుతున్న దేశం యీనాడు మనది. వెధవపనులు చేసేవాళ్లందరికీ, చేయగల దమ్ము న్నవాళ్లందరికీ 'పుష్పక విమానం'లో చోటుంటుంది.

ఎక్కడో భూగర్భంలోవున్న జల సంపదకోసం ప్రజల సంపదను కొల్లగొట్టటం కాదు నాయనా కావల్సింది.

క్రిందివాడు రా యెత్తుతేనే పెద్దవాడు నివసించడానికో భవంతి లేస్తుందన్న నిజం మర్చిపోతే యీ జాతికి మనుగడ ఉందా?'

ఊరికే తలుపులు దబ దబ బాదుతున్నారు. తలుపు తీసాను. ఐదుగురూ ఒక్కుమ్మడిగా నామీద కొచ్చి పడ్డారు.

'ఒరే కవి, నువ్వు కుక్కవీ, నక్కవీ కనుక మా మీద ఓ కథ రాసి పారెయ్. ఏమిటీ?' శవలింగం జోగుతూ నా భుజం మీద ఓ చెయ్యి ఆన్చి నా ముఖంలో ముఖం పెట్టి అడిగాడు.

నేను మాట్లాడలేదు

'రాయ్‌రా - అచ్చయితే నీకు సన్మానం చేయించే బాధ్యత నాది' మార్తాండమూర్తి అన్నాడు.

'ఇంతకీ మమ్మల్నెందుకు పిలిచి మరీ పార్టీ యిచ్చావ్' కాంచనగంగారావు.

'ఛస్తాడా! వాడికథకో ప్లాటు కావల్సినప్పుడల్లా మనకి పార్టీ యిస్తూ ఉన్నాడు' లలాట శాస్త్రి.

'సరే రాసుకో - మా కథే రాసుకోరా ఫూల్. టా టా' తూలుకుంటూ మార్తాండ మూర్తి వెళ్తుంటే గొర్రెల మందలా అనుసరించారు మిగతా నలుగురూ.

'మా కథే రా సు కో రా ఫూల్' మార్తాండ మూర్తి మాటలు నా చెవుల్లో మారుమ్రోగాయ్.

నిజమే నేను ఫూల్‌నే - ఒరి ఫూల్‌ను కాదు. ఐయామ్ ఫూల్ ఆఫ్ ఫూల్స్' కాగితాలూ కలం తీసుకున్నా కథ వ్రాయటానికి.



---

ప్రముఖ స్పానిష్ చిత్రకారుడు (P. R. Picasso) పికాసో, ఒకసారి తన గదిలో పెద్దసైజులో మరియు ప్రత్యేక ఆకారం కలిగిన Wardrobe కావలసియుండి స్థానిక వడ్రంగి వద్దకు వెళ్ళి తనకు కావలసిన సైజు, ఆకారం గురించి అరగంట సేపు చెప్పినా ఆ వడ్రంగికి అర్థం కాలేదట. చివరకు విసుగుతో, దగ్గరలోయున్న కాగితపు ముక్కను తీసుకొని, తనకు కావలసిన Wardrobe ఆకారం, సైజులతో బొమ్మగీసి, 'సరిగ్గా నాకు ఇటువంటిదే కావాలి, ఖరీదెంతవుతుంది' అని అడిగాడట. దానికి ఆ షాపు యజమాని, ఖరీదు అక్కర్లేదు మీరు గీసిన ఆ బొమ్మక్రింద మీ సంతకం చేయండి చాలు అన్నాడట.

సేకరణ: జి. అశోక్ రెడ్డి.

# ★ ★ ....అర్థాలె మారులే ★ ★

ఒక మాటకి 'అర్థం' ఎలా వచ్చిందో చెప్పడం చాలా కష్టం. ఆ స్తికులు ఈశ్వరేచ్ఛ అనీ, నా స్తికులు మానవేచ్ఛ (అంటే వక్తయొక్క ఇచ్ఛ) అనీ అంటూంటారు. ఏదయినా ఫలానా మాటకి ఫలానా అర్థం అని లోకంలో స్థిరపడి పోయింది. ఈ స్థిరపడటం 'స్థిరం' కాదు. కాలాన్నిబట్టి, ప్రదేశాన్నిబట్టి, సందర్భాన్నిబట్టి, ఒక్కొక్కసారి వ్యక్తినిబట్టి కూడా పదానికున్న అసలర్థాలు మారి, కొత్త అర్థాల్ని సంతరించుకుంటాయి.

తాను చెప్పేది స్పష్టంగా బోధపడాలని, హృదయానికి సూటిగా హత్తు కోవాలనీ ప్రతివక్త భావిస్తాడు. అందుకోసం ఉపమానాల్ని గ్రహిస్తూంటాడు. "అతని భార్య సూర్యకాంతం" అని అంటే సినిమాలోని సూర్యకాంతంలా గయ్యాళి అనీ, ఇంటిల్లిపాదిని హడలు కొట్టిస్తుందనీ అర్థం. ఇక్కడ సూర్యకాంతం అనేది ప్రతీకగా వాడబడింది. 'ఈ పిల్లలు కిష్కింధాపుర అగ్రహారీకులు' అని అంటే కోతిమూక అని అర్థం. ఉత్తరప్రదేశ్‌లో వేశ్యని 'టాక్సీ' అని పిలవడం వుంది.

ఇప్పుడు మనం వాడుతున్న 'పేపరు' పాపిరస్ చెట్టునుంచి తయారయిన దానికి పేరు. ఇప్పుడు చింపిరి గుడ్డలు, కొయ్యగుజ్జు మొదలైన వాటితో తయారు చేసినా 'పేపర్' అనే వాడుతున్నాం.

అమంగళకరమూ, అసభ్యమూ, అసహ్యమూ అనిపించిన పదాల్ని వాడకుండా అదే భావానికి సౌమ్యమూ, సభ్యమూ, మంగళకరమూ అని అనిపించిన పదాల్ని వాడుతూ వుంటాం. 'బియ్యం లేవు' అనటానికి 'బియ్యం నిండుకున్నాయి' అనీ, 'చచ్చాడు' అనటానికి 'స్వర్గస్థుడయ్యాడు, కన్నుమూశాడు, శివసాయుజ్యం చెందాడు' అనీ, ఇవన్నీ కూడా అటువంటివే. ఉత్తర భారతదేశంలో కొన్నిచోట్ల వంటవాడ్ని 'మహారాజ్' అనటమూ, పాకీవాళ్ళని 'మహిత్తర్' అని అనటమూ వుంది.

'కింకర్' అంటే సంస్కృతంలో 'కింకరోతి' - ఏం చెయ్యమంటారు అని అడిగేవాడు- అని అర్థం. తర్వాత కింకరుడు అంటే సేవకుడు అని అర్థం వచ్చింది. కైంకర్యం అంటే సేవకోసం అని అసలైన అర్థం. ఇప్పుడు 'కాజెయ్యటం' అనే అర్థం వచ్చింది. 'అదిరిపాటు' అంటే 'గర్వం, పొగరు' అనే అర్థాలు ఇప్పు డున్నాయి. "వాడికెంత అదిరిపాటు?" అనికూడా అంటూ వుంటాం. అయితే పూర్వం ఈ మాటకి ఈ అర్థాలు లేవు. 'అదిరిపాటు' అంటే 'అకస్మాత్తుగా, వున్నట్టుండి' అని మాత్రమే అర్థాలు.

'వాడు నామీద అజ్మాయిషీ చేస్తున్నాడు' అని పెత్తనం అర్థంలో వాడు తూన్న 'అజ్మాయిషీ' పదానికి 'నాడి చూచి పరీక్షించుట' అని అర్థం అంతే. 'రెండు

సార్లు' అనే అర్థంకల 'దోబార్' అనే పదం తెలుగులోకి 'దుబారా' గా ప్రవేశించి 'వ్యర్థమైన, అనవసరమైన' అనే కొత్త అర్థాల్ని కూడా తెచ్చుకుంది. 'వాడు దుబారా చేస్తాడు,' 'దుబారా చెయ్యకూడదు' అనే ప్రయోగాలు మనకి సుపరిచితాలే. తెలుగులో 'అప్పు'గా వున్న బాకీయొక్క పూర్వపు అర్థం 'మిగిలిన' అని. అలాగే 'ఆటగాడు' అనే అర్థం వున్న ఖిలాడీ పదం తెలుగులోకి 'కిలాడీ'గా ప్రవేశించి 'టక్కరి, మోసగాడు' అనే అర్థాల్ని సంతరించుకొంది.

తెలుగులోకి చేరిన ఆంగ్ల భాషాపదాల అర్థాలు కూడా మారాయి. ఇప్పుడు మనం ఒక పెద్ద హోదాగా భావించబడుతున్న 'మినిస్టర్' పదానికి సేవకుడు, ముఖ్యంగా రాజుగారి సేవకుడు అని అర్థం. ఇప్పుడు మనం రక్షకభటుడికి అంటగట్టిన కానిస్టేబుల్ పదానికి 'గుర్రపుశాలలో ఎప్పుడూ నిటారుగా నిలుచుండే వ్యక్తి' అని అర్థం. అల్ఫా, బీటా అనేవి గ్రీక్ భాషయొక్క మొట్టమొదటి అక్షరాలు. 'ఆల్ఫబెట్' అంటే అర్థం అది. ఇప్పుడది 'ఇంగ్లీషు ఆల్ఫబెట్,' 'తెలుగు ఆల్ఫబెట్' అని 'ఆల్ఫబెట్'ని 'వర్ణములు' అనే అర్థంలో వాడుతున్నాం. 'క్రికెట్' అంటే 'వికెట్టులేదా ఒకానొక బంతి ఆటలో ఉపయోగించే బేటు (bat)' అని అర్థం ఇప్పుడీ పదం ఒక ఆటపేరుగా వాడుకలోకి వచ్చింది.

ఒకే పదం భిన్న సందర్భాల్లో విభిన్నార్థాల్ని ఇస్తుంది. తెలుగులో వున్న 'మాట' అనే మాటకి ఇరవై మూడు అర్థాలున్నాయి. అలాగే 'తినుట' అనే పదానికి వున్న అర్థాల్ని చూడండి;

'తన్నులు తిన్నాడు' - 'బిస్కట్లు తిన్నాడు' - 'ప్రాణాలు తినేస్తున్నారు' 'వాడా పని చేస్తాడుగాని కొంచెం తింటాడురా' - 'ఆ సినిమాలో నాగేశ్వర్రావ్ తిన్నాడ్రా' - మొదలయినవి. ఆంగ్ల పదాల్లో కూడా ఇటువంటి విశేషాలు కనబడతాయి. ఉదాహరణకి 'హేండ్' (hand) పదాన్ని తీసుకుందాం.

'ఆ సైకిలు సెకండ్ హేండ్ది.'

'అడ్డాటకి ఇంకో హేండ్ తక్కువైంది.'

'ఆ విషయంలో వాడికీ హేండ్ వుంది.'

'వాడు నాకు హేండ్ ఇచ్చాడు.'

ఇలా ఎన్ని పదాలకు కొత్త అర్థాలు వస్తున్నాయో పరిశీలించాల్సి వుంది. భాషా శాస్త్రం (Linguistics) అనే శాఖ ఒకటి ఏర్పడిన తర్వాతనే ఇటువంటి పరిశీలనలు సాగుతున్నాయి.

—ద్వా. నా. శాస్త్రి

# అనిల్ ప్రొడక్షన్స్
# "సంసారం"

మాపాప పుట్టినరోజు
మరపురాని పండగరోజు
కలతలన్నీ కరిగిపోగా
కలిసీ మెలిసీ మురిసే రోజు

విందులు వేసే మాపాప
కంటికి విందులు చేయాలి
పెరిగి పెద్దదై చదువులు చదివి
పెద్దల మన్నన పొందాలి

మల్లెలలోనీ చల్లదనాలు
మనసులలో విరబూయాలి
మమతల దివ్వెల నవ్వులతో
మన యిల్లంతా వెలగాలి

యెవ్వరికీ తలవంచకనే
యెన్నడు నిరాశచెందకనే
ఆత్మగౌరవం పెంచుకొని
అడుగు ముందుకేవేయాలి





తీయ తీయని జీవితమంతా చేదై పోయింది
ప్రేమలు పొంగే గుండెలోన
వేదన మిగిలింది - వేదనే మిగిలింది ॥

పెనుసుడిగాలికి ఎన్నో పువ్వులు
జలజల రాలినవి
జలజలా రాలినవి
పరిమళమంతా సుడిగాలులలో
కరిగిపోయింది కరిగేపోయింది
గాలినేరమా? పూలనేరమా?
నేరం ఎవ్వరిది?

రివ్వున ఎగిరి నింగిని సాగే
గువ్వకు గూడేది
దారేలేని బాటసారికి
చేరేచోటేది? వేరేచోటేది
కళకళలాడే నీ సంసారం
కలగా మిగిలినది.... ....

చీకటికొంత, వెలుతురుకొంత
జీవితమంతేలే
కన్నీరైనా పన్నీరైనా
కాలం ఆగదులే
బాధలు పొందిన సంసారంలో
స్వర్గాలున్నవిలే "స్వర్గాలున్నవిలే"



లేరా! బుజ్జిమామా!
లేలేరా! బుల్లిమామా!
ఏటవతలగట్టు ఆగట్టుమీద చెట్టు
ఆచెట్టుకింద పుట్ట ఆపుట్టమీద నువ్వు
పుట్టలోన పాముందిరా! మామా!
బుసలుగొట్టు నాగుందిరా. లేలే

కోరలున్నా కోడెత్రాచురా
పొంచిపొంచి చూస్తున్నదిరా
పిల్లపామని తలచవద్దురా
వానపామని వదలవద్దురా
కళ్ళు మూసుకోకు! నువ్
ఒళ్ళు మరచిపోకు

నామాట నమ్మకుంటె, అవుతుంది
పెళ్ళిసీకు.
పుట్టతవ్వి పట్టాలిరా మామా!
నేలకేసి కొట్టాలిరా లేలే

పడగవిప్పుతు వున్నదిరా
బుస్సుమని లేస్తున్నదిరా
ఎప్పుడెపు డంటున్నదిరా
విషము కక్కుతు వున్నదిరా
పక్కపక్కనుంచి.... అది నక్కినక్కి
ఉంది....
కసిబట్టిఉంది.... కాపేసి కూర్చుంది
ప్రాణాలు తీస్తుందిరా మామా! లేలే॥



ఒంటరిగా ఉన్నాము! మన
మిద్దరమే ఉన్నాము
ఉలకవెందుకు! పలకవెందుకు
బిడియమెందుకు! వలపువిందుకు
కలసిపోదాము రా-రా॥

ఎవరికంటబడినా ఏమనుకొంటారు
పడచువాళ్ళ సరదా పోనీయంటారు
ఏదో గుబులు ఎందుకు దిగులు
ఎగిరిపోదాము రా!రా॥

గువ్వజంట యేదో గుసగుస లాడింది
వలపు ఓనమాలు దిద్దుకోమన్నది
ఇపుడేవద్దు ఒకటే ముద్దు
రేపు చూద్దాము రా-రా-

ఇంతమంచి సమయం ఎపుడు దొరుకు
తుంది
మూడు ముళ్ళు పడనీ ప్రతిరోజు
దొరుకుతుంది
అప్పటివరకు అల్లరివయసు
ఆగనంటుంది రా! రా॥

సింగపూరు రౌడిన్రోయ్—నేను
చిచ్చుల పిడుగునురోయ్... నేను
కొమ్ములు తిరిగిన మొనగాణ్ణైనా
గొయ్యిదీసి గొంతువరకు పాతేస్తాను-

సరుకులు కల్తీ చేసేవాళ్ళను
ఎక్కడున్న పురుగేరేస్తాను
అబద్ధాలతో కొంపలార్పితే
నిలువున చర్మం చీరేస్తాను

మంచితనంతో మసిలేవాళ్ళను
నెత్తినబెట్టుక పూజిస్తా
కుట్రలుపన్నే గుంటనక్కలను
పీకపట్టుకొని నొక్కేస్తాను

ధర్మంకోసం నిలబడతా-యమ-
ధర్మరాజునే ఎదిరిస్తా
రౌడీలకు నేరౌడీన్రోయ్! పచ్చి
నెత్తూరే తాగేస్తాను
జాం, జాంగా తాగేస్తా





యవ్వనం పువ్వులాంటిది
జీవితం రవ్వలాంటిది
లోకమే నీదిరా
ఆటలపాటల తియ్యని నవ్వులతేలరా! హో!!

చీకూ చింతా నీకెందుకూ
జల్సా చేద్దాం రా! ముందుకు
నచ్చిన చిన్నది రమ్మన్నదీ
వెచ్చని వలపులు యిమ్మన్నదీ
చక్కని చుక్కలు పక్కనఉంటె
దిక్కులు చూస్తూ కూచుంటావేం!

నిండు మనసుతో ప్రేమించుకో
నీలో ఆశలు పండించుకో
దొరికిన అందం దోచేసుకో
ఆ అనుభవమంతా దాచేసుకో
చేతికి చిక్కిన చక్కదనాలు
ఎగరేసుకపో! ఎగరేసుకపో! రా! రా!

ఈ చిత్రంలోని పాటలు పాలిడార్‌లో దొరుకును

వచ్చే సంచికనుండే

## కొత్త సీరియల్ ప్రారంభం

# మిస్టర్ సంపత్ ఎం. ఏ.

రచన:

మీ అభిమాన రచయిత్రి

## మాదిరెడ్డి సులోచన



జూన్ నెల నవలానుబంధం

ప్రఖ్యాత రచయిత్రి

## చిట్టారెడ్డి సూర్యకుమారి

నవల

## మహారాణి

చదవండి!



ప్రఖ్యాత రచయిత్రి

# యద్దనపూడి సులోచనారాణికి సన్మానం

'అంతర్జాతీయ మహిళా సంవత్సరం' సందర్భంగా, జంట నగరాలలో ప్రసిద్ధి చెందిన 'రసమయి' సాంస్కృతిక సంస్థ, అధ్వర్యంలో, ప్రముఖ రచయిత్రి శ్రీమతి యద్దనపూడి సులోచనారాణిని అభినందించటానికి, రవీంద్రభారతిలో సభ జరిగింది. రసమయి అధ్యక్షురాలు, ప్రఖ్యాత నర్తకి శ్రీమతి సుమతీ కౌశల్ స్వాగత వచనాలు పలికారు. రాయలసీమ అభివృద్ధి మండలి అధ్యక్షులు శ్రీ కె. బి. నరసప్ప ముఖ్య అతిథిగా వచ్చారు. అధ్యక్షత వహించిన డాక్టర్ పి. నారాయణరెడ్డి మాట్లాడుతూ, సులోచనారాణి నవలలు ఎంత ప్రజాదరణ పొందాయో, అంతటి ఆదరణ ఆ నవలల సినిమా రూపాలు కూడా పొందాయన్నారు.

శ్రీమతి సులోచనారాణి, అభినందనలకు సమాధానమిస్తూ, తనకు వేదికల మీంచి, ఉపన్యాసం చేయటం అలవాటు లేదని చెబుతూ, తన సహజధోరణిలో మాట్లాడుతూనే, మాట్లాడటంలో కూడా, ఆమెది ఒక ప్రత్యేకశైలి అని నిరూపించి వినేవారిని ముగ్ధుల్ని చేసారు. స్త్రీలు సాహితీ రంగంలో విజయాలు సాధిస్తున్నట్టుగానే, ఇతర రంగాల్లో, ముఖ్యంగా, రాజకీయ రంగాల్లో విజయాలుసాధించాలని కోరారు. దేశానికి ఒక్క ప్రధానమంత్రే గాకుండా, రక్షణమంత్రి, అర్థికమంత్రిలాటి బాధ్యతాయుతమైన పదవుల్ని స్త్రీలు చేపట్టి, తమ వ్యక్తిత్వం నిరూపించుకోవాలని ఆకాంక్షించారు.

శ్రీమతి సులోచనారాణికి, పాఠకుల్లో ఒక ప్రత్యేకమైన ఆదరణ, అభిమానం వున్నాయనేమాట నిర్వివాదాంశం. ఆమెకి ఎంతో పేరుతెచ్చిన నవలల్లో 'సెక్రటరీ'ది ప్రథమస్థానం అనేమాట కూడా నిర్వివాదాంశమే! ఆ నవలని పాఠకులకి అందించిన జ్యోతి, ఆమెని మరొకసారి పాఠకుల తరఫున అభినందిస్తూ, ఆమె కలంనుండి, మరికొన్ని వైవిధ్యంగల రచనలు రావాలని ఆకాంక్షిస్తోంది!



# ఈ నెల విడుదలలు

అన్ని ఖరీదులు, అంచెలవారీగా యెక్కు-వవుతున్న ఈ రోజుల్లో పాలిడార్ వారు రికార్డు వెల తగ్గించారంటే, యెగిరి గంతే యాలనిపించడం సహజం. ఒక ప్రక్కకు తొమ్మిది నిమిషాలు పాడే చిన్న రికార్డుని హెచ్. ఎం. వి. కొలంబియా కంపెనీల వారు "సూపర్-7" అంటారు. వెల 21 రూపాయలపై చిలుకు. అటువంటి రికార్డునే పాలిడార్ వారు "మాక్సి యి. పి." అంటున్నారు. 16 రూపాయలకే అమ్ముతున్నారు. అద్వితీయమైన నాణ్యం అంటే అందరూ ఒప్పుకొనవలసినదే. ఈ"మాక్సి యి. పి"లు యెనిమిది విడుదలైనవి. అవి "జూలీ"(2253006-007)"హిమాలయ్‌సే ఊంచా" (2221141) "భూలా భట్కా" (2253003) "ఆఖ్రిదావ్" (2253001) "రంగా ఖుష్" (2253002) "దోశత్రు" (2253004) "చోకీ మేరా కాం" (2253005) చిత్రాలవి. ఇవి ఎనిమిదీ పంపుతూ వారికి ఏ చిత్రంలోని సంగీతం బాగా నచ్చిందో తెల్పిన మొదటి పాఠక శ్రోతకు తక్షణ బహుమతి వందరూపాయలు నగదు. త్వరపడండి.

"మాక్సి యి. పి" లోనే "సీసన్స్ యిన్ ది సన్" అన్నది విడుదలైనది. టైటిల్ సాంగ్ సాహిత్యం యెంత హృద్యంగా వుందో చెప్పలేము (2221 879).

కొత్త హిందీ ఎల్. పి లు రెండు విడుదలైనవి రెండూ మంచి సంగీతాన్నే అందిస్తున్నవి. ఒకటి "జూలీ" (2392063) ఈపాటికే ఆంధ్రదేశంలో ఆ పాటలు ఆ బాలగోపాలాన్ని ఆనందింపజేస్తుండగలవు. నాకు బాగా నచ్చినవి. 'దిల్ క్యాకరే' (కిశోర్) 'భూల్‌గయే నబ్ కుఛ్' (లతా-కిశోర్) ఒక్క ఆంగ్ల గీతం అతి సాధారణంగా వుంది, వీటికి సంగీతం అమర సంగీతకారుడైన రోషన్ కుమారుడూ, యువనటుడైన రాకేశ్‌రోషన్ సోదరుడూ అయిన రాజేశ్ రోషన్. ఇతని మొదటి చిత్రం "కువారా బాప్".

రెండవది "భోలా భాలా"(2392-058), సంగీతం ఆర్. డి. రెండుమార్లు వింటే అయిదుపాటల్లో ఏ ఒక్క పాటనూ వదలాలని బుద్ధి పుట్టదు. "ఝల్‌గ యీ ఆంఖే" (లత కిశోర్) వరసా, "వక్త్ వక్త్‌కీ బాత్‌హై" (కిశోర్) సాహిత్యం మొదటి శ్రేణికి చెందినవి.

ఇంకా రెండు యి. పి. లు "పింజుమనం" 2221-154 (తమిళం) "ఏక్‌నావ్ దో కినారే" 2221152 (హిందీ) వచ్చాయి. చాలా పేలవమైన సంగీతం. ఊరికే యిస్తే తీసుకో వచ్చు, దాచుకోవడానికి జాగా ఉన్నవారు.

ఒక కన్నడ ఎస్. పి. "ఒందే రూప ఎరడు గుణ" (2067245) సంగీతం సలీల్ చౌదరి అంటే తెలిసిన వారికి అర్ధమవుతుంది. వరసలుఎలా వుంటాయో, తెలి

యనివారు పుట్టతేనే కన్నెవలపు కలిపి రంగ రించిన ఒచి ఊహించుకొంటే సరిపో తుంది యుగళగీతం (సుశీల-బాలు) ఒక మధురమైన కవనం (ఆర్ ఎస్. జయ గోపాల్) పసుగిరిసల పరిమళాలతో పుల కించిన ఒక ఓవ్యవనం. రెండవప్రక్క "బా బలియలి" (ఎస్. జానకి) శ్రావణ పూర్ణ చంద్రోదయమో, శ్రుత వసంత కుసుమాకరమో శ్రోతలే నిర్ణయించాలి

ఒక మలయాళ ఎస్ పి. ఇంతటిదే "తామరతొని" (2067242) ఇదు శిశిరం రితు కన్యక మొడె ప్రియ శిశిరం (వాణీ జయరాం) వయలార్ సాహిత్యం విన్న ప్పుడే శిశిరఋతువును పిలచే ప్రభావం గలది. ఆర్. కె. శేఖర్ వరన వాద్యగోష్టి ఆ ఆహ్వానాన్ని బలపరుస్తున్నవి. ఒక్క మారు ఈ రెండు ఎస్. పి. లను వినండి.

## మాగాపురామన్ మృతి

ప్రముఖ సినీ జర్నలిష్టు మాగాపు రామన్ హృద్రోగంతో హరాత్తుగా 23-4-75 నాడు హైదరాబాదులో మృతి చెందారు. తెలుగు చలనచిత్ర పరిశ్రమకు జర్నలిస్టుగా శ్రీ రామన్ ఎంతో సేవచేశారు

ఆయన కుటుంబానికి 'జ్యోతి' సానుభూతి తెలుపుతూ, శ్రీ రామన్ ఆత్మకు శాంతి కలగాలని కోరు కొంటోంది.

ఒక కొలంబియా యి. పి. బాబు (Sede 13086.) ఇందులో ఒక ప్రక్క 'ఒక జంట కలసిన' అన్నది ఒక నృత్య నాటిక గీతంలాగున్నది. అక్కడక్కడ విడిగా బాగున్నా సినిమా చూస్తేనే కాని పూర్తిగా అవగాహనకాదు. పాడినది బాల, శీల, రామకృష్ణ ఆత్రేయ రచన అద్భుతా నికి ప్రక్కమెట్టు. 'అయ్యా బాబోయ్' (శీల-బాల) ఓయమ్మ యెంతలేసి (శీల) యీ సంవత్సరపు మేటిహిట్లు కాగల సూచనలున్నవి. చక్రవర్తి వరనలు కొంత కారణం. ఆత్రేయ రచన మిగత!

హిందీ భజనలు మూడు ఎస్. పి.లు వచ్చినవి. మానస్ పాడిన కబీర్, హర్ దాస్ భజనలు (6158 6 5) మనస్సు పూరించే పద్ధతిలో ఉన్నవి. చేతన్ (6158 606) పాడటం వీరిరువురి భజనలే ఇం కొంచెం బాగావుంది. అర్చన పాడిన మీరా భజనలు (6158 604) చక్కనివి. అంతే కాదు ఆమె కంఠంలో అదొక మాదిరి అరు దైన తియ్యదనం మురిపిస్తుంది.



—రి.ఒం;రి.కం.వై;రి.శ్రో.స.



# సరిగమల పోటీ 28

## రూ. 1260-00 బహుమతులు

నిబంధనలు తు. చ. తప్పక వ్రాయాలి

పి. ఎస్. ఆర్. పిక్చర్స్
అనిల్ ప్రొడక్షన్స్

## మాయా మచ్ఛీంద్ర
## సంసారం

ఒక్కొక్క చిత్రానికి ఒక నగదు బహుమతి రూ 102-00లు, పదునొకండు తదుపరి బహుమతులు.

అందరూ అతి స్వల్ప వ్యయ ప్రయాసలతో పాల్గొనదగిన అతి సులభమయిన నిబంధనలు.

1. పోస్టు కార్డుపై మీకు ఆ సినిమాలో నచ్చిన పాట ఒకటి, నచ్చని పాట ఒకటి వ్రాసి, వాటి ప్రక్కనే దానికి కారణం (రచన, వరస, వాద్యగోష్టి, పాడటం, సన్నివేశం, చిత్రీకరణ, నటన, నృత్య దర్శకత్వం. సెట్ లేక ఔట్‌డోర్ — ఇవే వీటిలో ఒకటే వ్రాయాలి.)
2. దాని క్రిందుగా ఆ సినిమా గురించి ఒకే ఒకవాక్యం స్లోగన్ లాంటిది వ్రాయాలి.
3. అడ్రసు వ్రాసే చోట దిగువ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయటమేగాక దానిపైన ఫలానా సినిమా పోటీ అని వ్రాయాలి. దానికి యెడమ ప్రక్క ఖాళీ జాగాలో పిన్‌కోడ్ నెంబరుతో సహా మీ పూర్తి అడ్రసు, ఇంతకు ముందు గెలుపొందిన పోటీల వివరాలు వ్రాయాలి.
4. ఒక కార్డులో ఒక సినిమా గురించే వ్రాయాలి.

ముగింపు తేదీ జూన్ పదిహేను. ఆ నెల 25 వ తేదీలోగా బహుమతులు (రూ. 48-00 విలువ చేయు రికార్డులు, పుస్తకాలు) రిజిస్టర్ పోస్టుద్వారా, నగదు మనియార్డరు ద్వారా విజేతల కందగలవు జూలై 1975 సంచికలో విజేతల జాబితా చూడనగును.

V. A. K. Ranga Rao
'Ram Mahal'
Pycrofts Gardens
Madras-600 006.

సినీ

ఛాయా

చిత్రాలు



'ఆస్తికోసం'లో రామకృష్ణ

'అంబుపాళ్ళు'లో సుజాత, హరిబాబు (పైన)
రమేష్‌బాబు రత్నాంజలి, (దిగువ)





పైన ఎడమ: కృష్ణ 'రక్త సంబంధాలు'లో

కుడి వైపు: చంద్రకళ
'వయసొచ్చిన పిల్ల'లో

మధ్య: పద్మనాభం, 'పెళ్ళికాని తండ్రి'లో

క్రింద ఎడమ: చంద్రమోహన్
'లక్ష్మణ రేఖ'లో

కుడివైపు: రాఘవన్, 'మాఇంటి దేవుడు'లో







పుస్తక సమీక్ష :

# ముక్కామల కథలు

రచన. ముక్కామల వెంకటేశ్వర రావు.

ప్రతులకు. నవోదయ పబ్లిషర్స్, ఏలూరు రోడ్, విజయవాడ-2.

ముక్కామల, 5-హెచ్-20, షారజట్ రోడ్, కలకత్తా-22.

వెల: ఐదు రూపాయలు.

ఈ సంపుటిలో పదకొండు కథలున్నాయి. ఇదివరలో వివిధ పత్రికలలో ప్రచురింపబడిన కథల్ని పుస్తకరూపంలో తీసుకు వచ్చినట్టు రచయిత ముందే చెప్పుకున్నారు. ఆ యా పత్రికల పేర్లను ఉదహరించివుంటే బావుండేది.

వైవిధ్యంగల యితివృత్తాల్ని ఎన్నుకోవటంలో రచయిత పరిశీలనాశక్తి మెచ్చుకోదగ్గది. ఇందులోని పాత్రలు ఏవీ మనకు కొత్తవిగావు. ప్రతిరోజూ మనకు నిజ జీవితంలో తారసపడే వ్యక్తులే యిందులో ముఖ్య పాత్రధారులు.

రచయిత కథకంటే కథనానికే ఎక్కువ ప్రాముఖ్యత యిచ్చారని పిస్తుంది. కథలు చదువుతుంటే కొన్ని కొన్నిచోట్ల పదాలతో గారడీ చేస్తూ కథా గమనాన్ని వెనక్కి నెట్టేసి నట్టనిపించింది. అయినా యిందులోని కథలన్నీ అందులోని 'వెరైటీ' కోసమైనా ప్రతి పాఠకుణ్ణీ చివరంటా ఉత్సుకతతో చదివిస్తాయి.

నగరంలో తోడేళ్లు-కలకత్తా 'స్లమ్స్' లో నివసించే మనవాళ్ళ కథ యిది.

టాయిలెట్-చావు బతుకుల్లోవున్న భర్తని బతికించుకోవాలన్న ఆదుర్దా-'లగ్జరీ' వైపు మొగ్గుచూపే యవ్వనం - ధర్మారావుకూ తనకూ ఏ సంబంధమూ లేదని చెప్పినా నమ్మలేని గుడ్డిలోకం-గౌరి ధర్మారావుకు లొంగిపోటానికి యివీ కారణాలు యీ కథలో.

బంగారు సంకెళ్లు-చక్కటి ఫామిలీ సెంటిమెంటు గల కథ. పిల్లలు లేని రమ మానసిక సంఘర్షణ - 'పాపాయి యాదవదూ' కథ.

ఇవి గాక—

'దొంగ వెధవ'ల్ని బాగుపడని కుళ్ళు సమాజం, డబ్బు మనుషులు 'కలిమి-చెలిమి.,

కట్టుకున్నవాడు లోకం విడిచిపెట్టి వెళ్ళిపోగానే, లోకం కోసం స్మశానంలో మొసలి కన్నీళ్లు కార్చి, మరొకరితో జీవితం పునఃప్రారంభం చేసే ప్రమీల 'వల్లకాటి ప్రేమ', పెళ్ళాం కన్నా ప్రాణం ముఖ్యం అని మునిగిపోతున్న పడవ లోంచి నీటిలోకి గెంతి, విధి వశాత్తు మళ్లా ప్రాణాలతోవున్న భార్యని కలుసుకున్న సింహాచలం కథ 'భద్రాచలం'.

'చావులేని సంస్కృతి.'

రైల్వే 'సార్టర్' నాగభూషణం విషాద గాథ.

'పాపం! పెళ్ళయింది'లో సరికొత్త తరహా పెళ్ళి-

ఉన్నాయి.

ఆఖరి రెండు కథలూ వాస్తవానికి కాస్త దూరంగా ఉన్నాయి.

ఇలాంటి కథా సంకలనాల్ని ప్రోత్సహించవలసిన అవసరం పాఠకుల కెంతైనా వుంది.

అందమైన 'బాపు' ముఖచిత్రమూ, ముచ్చటైన ముద్రణా ఈ పుస్తకానికి ఎస్సెట్సు.

—భరణి,



నవలానుబంధం

# అజ్ఞాతబంధాలు

సి. ఆనందారామం

# "ర...త్న...మ్మ!"

ఒక్కొక్క అక్షరమూ అప్రయత్నంగా వచ్చింది లలిత నోటినుండి.

"రత్నమ్మ కాదు. రాగిణి" కిలకిల నవ్వింది, పల్చని జార్జట్ చీరలో స్పష్టంగా కనిపిస్తోన్న అంగసౌష్ఠవంతో. . విలాసంగా నిలబడి మెడలో మెరుస్తోన్న నెక్లెస్‌తో ధగధగలాడుతోన్న రాగిణి.

"రా! కూచో!" లలిత భుజాలమీద చేతులువేసి కూచోబెట్ట బోయింది రాగిణి.

జడప్రాయంగా నిలబడ్డ లలిత ఆ స్పర్శకు జుగుప్సతో జలద రించింది— రాగిణి చేతులు విదలించింది.

భగ్గుమంది రాగిణి— మనసు ఎంత నిశితమైనదో, అంత సుకుమార మైనది. అన్ని విషయాలూ గాఢంగా అనుభవిస్తుంది. ఆ అనుభూతి గాఢమైనకొద్దీ దానిని వెళ్ళగక్కటానికే ప్రయత్నిస్తుంది. రాగిణి మన సులో మంటలు బయటపడాలి!

"నువ్వే నెగ్గావు రాజా!" అంది రాజువైపు తిరిగి నవ్వుతూ.

అంతవరకూ పాలిపోయిన లలిత ముఖం మీదే చూపులు నిలిపిన రాజు ఎవరో చెయ్యిపట్టుకుని తిప్పినట్లు రాగిణి వైపు తిరిగి "ఇహిహీ!" అని నవ్వాడు.

ఆ నవ్వు విని ఆశ్చర్యపోయింది లలిత. ఆ సందర్భంలో రాజు నవ్వినందుకు కాదు— ఆ నవ్వులో వున్న చవటతనానికి! స్వయంకృషితో I. A. S. ఆఫీసరయిన రాజులో తెలివితేటలు మాత్రమే చూసింది లలిత ఇంతవరకు.

ఎంతటి విజ్ఞానవంతులయినా కొన్నికొన్ని సందర్భాల్లో ఏరికోరి చవటతనాన్ని ఆహ్వానిస్తారా? లేక అద్భుతమయిన మేధను వెన్నంటే అజ్ఞానం దాక్కుని ఉంటుందా? అవకాశం రాగానే బయట పడుతుందా?

"అన్నట్లు లలితా! నీకు మా పందెం గురించి తెలియదుకదూ! చెప్తానుండు! నేను నిన్ను చూడాలనుకున్నాను— నిన్ను తీసుకురమ్మని రాజుతో చెప్పాను. నువ్వే వస్తావన్నాడు రాజు— "లలితకు అభిమానం ఎక్కువ— రాదేమో!" అన్నాను— "రెండు మూడు రోజుల్లో రాకపోతే

చూడు! లలిత నన్ను చూడకుండా ఉండలేదు!" అని పందెం వేసాడు ఏం పందెమో తెలుసా? ఒక తియ్యటి ముద్దు- బండబ్బాయి! పందెం గెలుచుకున్నాడు. ఏయ్ రాజూ! "ఆఫ్టరాల్, ముద్దు మాత్రమేకదా" అనుకునేవు! నా ముద్దు ఖరీదు ఎంతో తెలుసా? అయిదు వందల రూపాయలు!"

పకపక నవ్వింది రాగిణి! రాగిణితో కలిసి నవ్వాడు రాజు! అది నవ్వేనా? నవ్వటం కనిపిస్తోంది మరి!

ఎవరో మనను హిప్నటైజ్ చెయ్యక్కర్లేదు. చాలా సందర్భాల్లో మనను మనమే హిప్నటైజ్ చేసుకుంటూ బ్రతికేస్తాము. అదే నిజం బ్రతుకనుకుంటాము!

తన ముద్దుకు విలువ రూపాయలలో చూపిస్తోంది రాగిణి. ఆ విలువను అలాగే గ్రహిస్తున్నాడా రాజు?

'లలిత నన్ను చూడకుండా ఉండలే'దని పందెం వేసాడు రాజు! ఆ పందెం నెగ్గినందుకు రాగిణితో కలిసి నవ్వుతున్నాడు!

ప్రతిరోజూ రాజు లలితను కలుస్తూనే ఉంటాడు. ఆఫీస్ పని పూర్తయ్యాక లలిత ఇంటికి రావటం- ఇంటనో- బయటనో- ఇద్దరూ సాయంత్రాలు సరదాగా గడపటం పరిపాటి.

వారం రోజులుగా రాజు రాకపోవటంతో లలిత మొదట కోప గించుకుంది- తరువాత తల్లడిల్లిపోయింది. రాజు ఆరోగ్యం పాడయి ఉంటుందనే ఆలోచన తప్ప మరొక ఆలోచన రాలేదు లలితకి. రాజు దగ్గరకి బయలుదేరి వస్తూ తెలిసిన దేవతల కందరికీ మొక్కుకుంది రాజు ఆరోగ్యంగా కనిపించాలని.

దేవతలు కరుణించారు- రాజు ఆరోగ్యంగా కనిపిస్తున్నాడు- కానీ...

దేవతలనేవాళ్ళు నిజంగా ఉండి కోరిన కోరికలన్నీ ప్రసాదిస్తే మానవులు సుఖపడగలరా? అంతులేని ఆశలతో అలమటించిపోతూ ఒకదాని వెనుక మరొకటిగా కోరికలు పెంచుకునే మనుష్యులలో నిజంగా తమకేం కావాలో తమకు తెలిసిన వాళ్ళెందరు?

రాజు నవ్వుతున్నాడు- శత్రువర్గంలో ఉన్న గూఢచారి శత్రువులు తనను గుర్తుపట్టకుండా నవ్వినట్లు నవ్వుతున్నాడు! తనదికాని నవ్వును తనదిగా చేసుకుని నవ్వుతున్నాడు.

లలిత లేచి "వెళ్తాను!" అంది శాంతంగా. ఆ శాంతం రాగిణికి నచ్చలేదు.

"ఉండు లలితా వెళ్ళవుగానీ! ఇదిగో, ఈ పూలు పెట్టుకో! వద్దంటున్నా రాజు ఇన్ని పూలు తెచ్చిపడేసాడు."

దగ్గరగా వచ్చి తలలో పూలు పెట్టబోయింది రాగిణి. విసురుగా తల పక్కకు తిప్పింది లలిత. "వద్దు" అంది.

రాగిణి వెటకారంగా నవ్వుతూ "ఎందుకు అంత కోపం!" అంది.

"కోపం కాదు! ఏ రకం పూలనైనా ఎప్పుడంటే అప్పుడు పెట్టుకునే స్వభావం కాదు నాది!"

లలిత మాటలు రాగిణి కర్థం కాలేదు. అదే రాగిణి అదృష్టం. పైపైకి తోచేవే తప్ప ఆలోచించవలసినవేవీ అర్థం కావు.

రాగిణి ఒక్కసారి లేచి నిలబడి అభ్యాసవశాన వచ్చిన భంగిమలో అంగ సౌష్ఠవాన్ని అందంగా ప్రదర్శిస్తూ "నువ్వెప్పుడూ ఇంతే! అడవి మాలోకానివి!" అంది. "కదు రాజూ!" గారాబంగా దీర్ఘం తీసింది.

"అవునవును! లలితకేం పట్టదు_ అడవి మాలోకం!" అన్నాడు రాజు. కానీ అలా అంటూ లలితను గౌరవంగా చూసాడు. లలితను రాజూ రాగిణీ ఇద్దరూ "అడవి మా లోకం"గానే చూసారు. కానీ ఆ మాటకు రాగిణి అర్థం వేరు, రాజు అర్థం వేరు.

"నేను వెళ్తున్నాను" అంది రాగిణి కొంటె నవ్వుతో ఓరగా రాజుని చూస్తూ.

చటుక్కున రాగిణి చెయ్యి పట్టుకుని "వెళ్ళవుగానిలే, వుండు!" అన్నాడు రాజు.

రాగిణి ఆ చెయ్యి వదిలించుకోకుండా ఆటకాయితనంగా ఊపుతూ "ఎందుకు? ఎప్పటికయినా మీరూ మీరూ ఒకటే! నేనే మధ్యలో వచ్చి మధ్యలో పోయేదానిని" అంది ముద్దు ముద్దుగా.

రాగిణి చెయ్యి వదిలేసాడు రాజు. "ఉండు!" అన్నాడు గొణుగుతున్నట్లు.

"లలితను కూడా ఉండమను! నాకొక్కదానికీ వుండాలని లేదు!" పెంకిగా అంది రాగిణి.

లలిత రాజును చూస్తూ కూచుంది. లలిత చూపులు తప్పించుకున్నాడు రాజు.

ఎంతటి బలహీనులైనా హిప్నటిజమ్ ప్రభావంలో ఎల్లకాలం ఉండలేరు. అప్పుడప్పుడు తాము బయట పడక తప్పదు.

శాంతంగా స్థిరంగా ఉండాలని ఎంత ప్రయత్నించినా ఆ ఇంటి

గడప దాట బోయేముందు కాళ్ళు వణికాయి లలితకి. కొంచెం తూలి తన నెవరయినా పట్టుకునేలోగానే నిలదొక్కుకుని అక్కడనుండి బయట పడింది.

లలిత ముఖంచూసి హడిలిపోయింది లలిత తల్లి జానకి. ఆవిడకు లలితంటే ఎంతో ప్రేమ.

తనకంటె చిన్నదయినా కూతురంటే గౌరవం.

లలిత తండ్రి వెంకట్రావు గుమస్తా. బీదరికం భరించటం కష్టమే. కానీ కేవలం బీదరికం కారణంగానే బ్రతుకులు నాశనం కావు. వీధి దీపాలకింద చదువుకుని వృద్ధిలోకి వచ్చినవా రున్నారు. మేడలూ. మిద్దెలూ. కూలదోసుకుని వీధుల్లో పడినవాళ్ళున్నారు.

వెంకట్రావు స్వార్థపరుడు, పెళ్ళి చేసుకున్నాడు. పిల్లల్ని కన్నాడు. కానీ, వాళ్ళను పైకి తీసుకురావలసిన బాధ్యత తనకుందని ఏనాడూ ఆలోచించలేదు. అన్ని వేళలా తనకి సదుపాయాలు జరగాలి. ఇంట్లోవాళ్ళు తిన్నా తినకపోయినా, తనకు కూరలు కావాలి! పెరుగు కావాలి! వీటన్నిటి కంటె భయంకరమైనది స్త్రీ వ్యసనం. ఉచ్ఛనీచాలు లేక రెండుకీ మూడుకీ లభ్యమయ్యే స్త్రీల దగ్గర సుఖాన్ని వెతుక్కుంటాడు. జానకి గొప్పింటి పిల్ల గాకపోయినా సంస్కారంగల కుటుంబంలోంచి వచ్చింది. కొద్దిగా చదువుకున్నది కావటంవల్ల పిల్లల్ని దగ్గిర పెట్టుకు చదివించేది. మొదటినుండి ఆ సంసారం జానకికి ఎదురీతే అయింది. ఆ కుటుంబం వీధిన పడకుండ ఒక దారిన పడటానికి జానకి ఎన్ని పాట్లు పడిందో ఆ భగవంతుడికే తెలియాలి. దొడ్లో కూరగాయలు పెంచింది. అవి కూరలమ్మేవాళ్ళకు అమ్మింది. లేసులల్లి తెలిసినవాళ్ళను పట్టుకుని గొప్ప ఇళ్ళలో అమ్మించింది. ఇలా చేత నయినంత వరకు సంపాదించడానికి ప్రయత్నించేది. లలిత మెట్రిక్ పాసయ్యాక జానకి కాస్త ఊపిరి తీసుకో గలిగింది. కుటుంబ పరిస్థితి నర్థంచేసుకో గలిగిన లలిత తల్లికి అండగా నిలిచింది. తన ఖర్చులకి డబ్బులు చాలవని లలితని చదివించలేనన్నాడు తండ్రి. లలిత కాలేజి మానింది. కాని చదువు మానలేదు. ప్రైవేటుగా చదివి బి. ఏ. పాసయింది. యు. డి. సి. గా జాయినయింది. తమ్ముడు మోహన్ని తనే కాలేజిలో చేర్పించి చదివించింది. భయపెట్టి బుద్ధులు చెప్పటమే కాక ప్రేమతో అడిగినది కాదనకుండా ఇచ్చే అక్కంటే మోహన్కి కూడ భయభక్తు లున్నాయి.

తనను ఎదిరించి మాటాడే లలితంటే వెంకట్రావుకి మంట. లలిత ముందు తన క్షుద్రత్వం బయట పడుతుందేమోనని అత నేనాడూ భయపడ

లేదు. లలిత తనే సంకోచంతో ముడుచుకుపోయేది.

కుటుంబంకోసం స్థయిర్యంతో నిలబడి ఇంత సాధించిన లలిత ముఖంలో ఏనాడూ చిరునవ్వు మాయమవలేదు. అలాంటి లలిత ముఖం. అంతగా వడిలిపోయి కనిపించే సరికి తల్లడిల్లి పోయింది జానకి.

"ఏం జరిగింది. లలితా!" అంది ఆరాటంగా.

లలిత నవ్వడానికి ప్రయత్నించింది.

"ఏం జరగలేదే!"

జానకి మాట్లాడలేదు. కళ్ళప్పగించి నిలబడింది.

ఆ ముఖం చూస్తే అర్థమయింది లలితకి. తన ముఖంలో తన మనసు ఎంతగా ప్రతిఫలిస్తోందో.

తన మనసు ఎందుకిలా అయిపోతోంది? లోకమంతా శూన్యమయి పోయినట్లు ఈ లోకంలో ఇంక తనది అనేదేమి మిగలనట్లు తన జీవితానికి ఆధారమే నశించినట్లు.

రాజుకూ తనకూ మధ్య ఉన్నది పవిత్ర ప్రేమానుబంధమనుకొంది. ప్రేమ గురించి ఎన్నెన్ని తీయని భావాలున్నాయో, ఎంతటి ఉదాత్త భావాలున్నాయో అవన్నీ తమ అనుబంధానికి ఆపాదించుకొని ఆనందించింది.

అదంతా తన మిథ్యా కల్పన మాత్రమేనా? రాజు తనను ప్రేమించాడా? ప్రేమిస్తే అంత దారుణంగా ఎలా ప్రవర్తించగలడు? తాను ప్రేమిస్తోందా రాజును?

ప్రేమకు అర్థంచెప్పేవాళ్లు, ప్రేమించిన వ్యక్తుల సంతోషమే మన సంతోషమనుకోవటం నిజమైన ప్రేమ అంటారు. దానిని బట్టి రాగిణితో కలిసి ఉన్న రాజు సంతోషమే తన సంతోషమనుకోవాలి. అలా అనుకోగలదా! ప్రేమ అంటే ఏమిటి ? ప్రేమ నిజంగా ఉందా లోకంలో ?

ఈ అశాంతి భరించలేదు, తనను తను మరిచిపోవాలి! వీణ ముందు కూచుంది లలిత.

మనసు ఆర్తితో తన ఆవేదనను విశ్వంలో ప్రతి ధ్వనింప చేస్తోంటే లలిత చేతులు వీణను పలికించాయి. వాతావరణమంతా మధుర విషాద తరంగాలతో నిండిపోయింది.

లలిత వీణ ఆపగానే జానకమ్మ కన్నీళ్ళతో "అబ్బ ఏం రాగం లలితా! తట్టుకోలేకపోతున్నాను. ఇప్పటికే కన్నీళ్ళు పొంగివస్తున్నాయి" అంది.

లలిత కళ్ళల్లోనూ నీళ్ళే? కానీ ఆ కన్నీరు మనసు ముక్కలయిన విషాదానికి చిహ్నం కాదు. మథింపబడిన మనసు పొందే ఉద్వేగానికి చిహ్నం.

లలిత మనసు వీణానాదంతో పెనవేసుకుని ఏ లోకాలల్లోనో తిరగసాగింది. తాత్కాలికంగా సర్వమూ మరిచిన ఒక విచిత్రమైన మైమరపు పొందింది.

ఎదురింటివారి అమ్మాయివచ్చి ఫోన్ వచ్చిందని చెప్పింది. లేచి వెళ్ళింది లలిత.

“హలో!” మత్తుగా ముద్దముద్దగా పలికింది రాజు కంఠం.

గతుక్కుమంది లలిత – తనకు తెలిసినంతలో రాజుకు తాగే అలవాటు లేదు.

అవతలివైపునుండి నర్వస్‌గా నవ్వు ..

“తాగుబోతును కాలేదులే! ఇవాళ ఏదో మనసు చికాగ్గా ఉండి .. కాస్త ఉల్లాసంకోసం...”

లలిత మాట్లాడలేదు.

“హలో!” అన్నాడు మళ్ళీ రాజు.

“హలో!”

“ఎలా ఉన్నావ్? ఇందాక నీ ముఖం చూసి ఎలా ఉన్నావో అని కంగారు పడుతున్నాను! అందుకే ఫోన్ చేసాను. జీవం లేనట్లుగా పాలిపోయావు...”

రాజు కంఠంలో సానుభూతి ఉంది. కానీ అతడు తన అవస్థను అర్థంచేసుకుని జాలి చూపడం భరించలేక పోతోంది లలిత.

“బాగానే ఉన్నాను”

“అయామ్ సారీ లలితా!”

“..................”

“రాగిణి బాగుంటుంది 36” 28” 36” చాలా చమత్కారంగా మాట్లాడుతుంది, భలే థ్రిల్ ...” వినలేకపోతోంది లలిత.

“బైబై, నీకు నామీద కోపం లేదుకదూ!”

“లేదు!”

“గుడ్! మనం స్నేహంగా విడిపోవాలి!”

నవ్వింది లలిత.

“విడిపోయాక స్నేహంకాక మరేమిటి?”

“అంటే?”

అర్థంకాలేదు రాజుకి– రాజుకు అర్థంకాదని తనకింతకుముందెన్నడూ అర్థంకాలేదు.

"గుడ్ బై, లలితా!"

"గుడ్ బై!"

పాలిపోయిన తన ముఖం చూసి జాలిపడగలిగిన మనసుంది రాజుకి. కానీ ఆ మనసుకి రాగిణిని కాదనగలిగే శక్తి లేదు. మనసు చికాకుపడింది. ఆ చికాకు మరిచిపోవడానికి తాగాడు.

తమను తాము మరిచిపోవటంలో ఉండే సుఖమేమిటి? తన్మయత్వంలో, పారవశ్యంలో, మైమరుపులో, మైకంలో, మత్తులో... మనుష్యులు తమను తాము మరిచిపోతారు. అంతమాత్రాన ఈ భావాలన్నీ ఒకటేనా?

తనూ ఒక విధమైన తన్మయత్వంలోనే ఉంది. రాజూ మైకంలోనే ఉన్నాడు. అదీ, ఇదీ, ఒకటేనా?

దుఃఖానికీ, ఆనందానికీ– అశ్రువులు స్రవిస్తాయి. పులకరించినా, జలదరించినా రోమాంచమవుతుంది. బాహ్య చిహ్నాలన్నీ ఒకటే! భేదమంతా అనుభూతులలో, ఆ అనుభూతుల నందుకునే అంతరంగాలలో.

తాగుబోతుకీ మైకం వస్తుంది, కళాతపస్వికీ మైమరపు వస్తుంది. ఆ మైకంలో మనసు అదుపులో ఉండదు. తనను తాను మరిచి బయట పడుతుంది. పైపైకి పోవాలనే ప్రయత్నమే ఉండదు– మాదకత తప్ప.

ఈ మైమరపులో మనసు అదుపులో ఉండదు. తనను తాను తెలుసుకుంటూ బయటపడుతుంది. అందని ఔన్నత్యాలను అందుకోవాలని ఆరాటపడుతుంది. ఇంతే తేడా!

రాజు రాగిణిని స్వీకరించి తనకు గుడ్ బై చెప్పగలిగాడు. రాగిణి! తనను చూసుకుని తాను గర్వపడగలిగిన రాగిణి, పాపం, రాగిణి!

## 2

కారులోంచి దిగి తన దగ్గరకు వచ్చిన రత్నమ్మను నివ్వెరపోయి చూసింది లలిత. పట్టు పరికిణీ– మెడలో సన్నని గొలుసు– ముఖంలో కొత్తగా వచ్చిన విశ్వాసం రత్నమ్మేనా?

"రత్నా..." అని ఏదో అనబోతుండగానే రత్నమ్మ అడ్డుకుని " 'రత్నా' అనకు 'రాగిణీ' అని పిలు– నేను మారిపోలా? నా పేరూ మారిపోయింది" అంది నవ్వుతూ.

"ఏవిటిదంతా?" అంది ఆశ్చర్యంగా లలిత.

"నా అదృష్టం— శ్యామలాంబగారు నన్ను తమ సేవాసదనంలో చ్చుకున్నారు."

దీర్ఘంగా నిట్టూరుస్తూ అంది రాగిణి. ఆ నిట్టూర్పులో విషాదం లేదు, ఆవేదన లేదు. ఏదో సంతృప్తి వుంది. ఒక విధమైన రిలీఫ్ వుంది.

రత్నమ్మ విధిలేక పినతండ్రి ఇంట్లో పెరగవలసి వచ్చింది. వాళ్ళది అంతంత మాత్రం కుటుంబమే! కన్న పిల్లలకే పెట్టుకోవటానికి కటకటలాడే ఈ రోజుల్లో రత్నమ్మను సాకవలసి రావటం పినతల్లికి కష్టంగానే వుండేది. ఆవిడకూ ఇద్దరు ఆడపిల్లలున్నారు. తన పిల్లలకంటె రత్నమ్మ అందగత్తె కావటంకూడా ఆవిడ మనసులో రత్నమ్మపట్ల అసహనం కలగటానికి మరో కారణం.

ఒకే వీధిలో ఉండే రత్నమ్మను చిన్నప్పటినుండీ లలితకు తెలుసు. రత్నమ్మ పినతల్లి చేతిలో దెబ్బలుతిని ఏడుస్తోంటే ఎన్నోసార్లు లలిత తన దగ్గరున్న తాయిలం పెట్టి ఓదార్చింది. ఇంట చాకిరీతో బడికి తిన్నగా రాలేని రత్నమ్మకు తన నోట్సులిచ్చేది. అప్పటికే చదువులో వెనకపడ్డ రత్నమ్మచేత చదివించాలని చూసేది. రత్నమ్మకు తీరికలేకపోవటమేకాదు— చదువులో కూడా ఆసక్తి అంతంత మాత్రమే! పినతల్లి ఏదో వంకతో రత్నమ్మను తిట్టని రోజంటూ లేదు. రత్నమ్మ కుమిలిపోతోంటే లలిత ధైర్యం చెప్పేది. రత్నమ్మ ఎలాగైనా చదువుకుని తన కాళ్ళమీద తను నిలబడాలని లలిత ఉద్దేశం. కానీ రత్నమ్మకు పుస్తకం పుచ్చుకోగానే ఆవులింతలొచ్చేవి. ఎక్కడో, ఎప్పుడో, ఎలాగో, తాను గొప్పదైపోయినట్లు కలలుకంటూ కూర్చునేది. వెలిసిపోయిన చిరుగుల పరికిణీలు—ఎప్పుడూ దిగులుగా ఉండే ముఖం. రత్నమ్మను చూసినప్పుడల్లా జాలితో కరిగిపోయేది లలిత మనసు.

అలాంటి రత్నమ్మ రాగిణిగా వచ్చేసరికి లలితకు విడ్డూరంగా తోచింది.

"శ్యామలాంబగారెవరు? సేవాసదనమేమిటి?" అంది.

"శ్యామలాంబగారు గొప్ప సంఘ సేవకురాలులే! ఆవిడ చేతికింద చాలా సంస్థలున్నాయి. మా ఇంటికొచ్చి ఆవిడ తన సేవాసదనంలో చేర్చుకుంటానంది. పిన్ని ఒప్పుకుంది. పిన్నికావిడ రెండు వందలుకూడా ఇచ్చింది. ఎందుకూ? దండుగకదూ."

లలిత అప్పటికి స్కూల్ ఫైనల్ చదువుతోంది. కొంచెం కొంచెం లోకం తెలుస్తోంది. రాగిణి మాటలు వింటున్న కొద్దీ మతిపోయినట్టవుతోంది లలితకు—

"ప్రత్యేకం ఇంటికొచ్చి అనాథ శరణాలయంలో చేర్చుకుంటా నన్నారా? ఎదురు డబ్బిచ్చారా?" నమ్మలేనట్టు అడిగింది.

"అనాథ శరణాలయం కాదు, సేవాసదనం. అక్కడ ఎవరినంటే. వాళ్ళను చేర్చుకోరు. అందమైన వాళ్ళనే చేర్చుకుంటారు_"

లలిత కేదో అనుమానం తోచింది.

"అక్కడ నీకు బాగుందా?"

"బ్రహ్మాండంగా ఉంది. ఈ పరికిణీ చూసావా? పట్టు పరికిణీ. కంచిపట్టు. ఈ వోణీ కూడా జారీదే! ఎప్పుడు నేనిలా పట్టు పరికిణీ లలో జారీ వోణీలలో ఉండాలని చెప్పారు శ్యామలాంబగారు. అందుకే మెడ బోసిగా ఉందని ఈ చిన్న గొలుసు వేసారు. కొంచెం రోజుల్లో ఇంకా బోలెడు నగలు చేయిస్తానన్నారు."

రాగిణి కళ్లలో కంఠంలో ఆశ అంతులేని ఆశ. లలితకు భయం వేసింది.

రాగిణి రెండు చేతులూ పట్టుకుని "రాగిణీ! ఆవిడ ఇవన్నీ ఊరికే ఎందుకిస్తుంది? బాగా ఆలోచించుకో!" అంది.

రాగిణి చేతులు విడిపించుకుని "ఊరికే ఎందుకిస్తుంది? ఆవిడకు నాతో...మాతో ఏదో అవసరం ఉంటుంది_" అంది ఎటో చూస్తూ.

లలిత నిర్ఘాంతపోయింది.

"నీకు తెలుసా అయితే?"

"ఆ! తెలుసు! ఇకముందు పిన్నితో తిట్లూ చీవాట్లూ తినక్కరలేదని తెలుసు. తిండికి తడుముకోనక్కర్లేదని తెలుసు_దర్జాగా బ్రతకొచ్చని తెలుసు!"

"ఈ బ్రతుకు దర్జా బ్రతుకు అనుకుంటున్నావా?"

"అవును ఎందుకు కాదు? నన్ను చూసాక మా పిన్ని తన కూతుర్ని కూడా తీసుకోమని శ్యామలాంబగారిని అడిగింది. ఆవిడ ఒప్పుకోలేదు. ఈ రకమైన బ్రతుకు కావాలన్నా అందరికీరాదు. అందంగా ఉండాలి!"

గర్వంగా అంది రాగిణి.

లలిత తెల్లబోతూ "అయితే నీకు ఇష్టమయ్యే అక్కడ చేరావన్న మాట!" అంది.

"ఆ! నేనే కాదు. అందరూ అంతే! ఎందు కిష్టంలేదు? ఏ బలవంతమూ లేదు. అక్కడ చేరాలని ఎందరు తాపత్రయపడతారో తెలుసా? ఏం తక్కువయింది? డబ్బు, గౌరవం పలుకుబడి అన్నీ ఉంటాయి. మామూలుగా మీరంతా ఇంతకంటె ఎక్కువ సుఖపడుతున్నారా?"

రాగిణి అర్థమయిపోయింది లలితకి_మరేమి మాట్లాడలేదు. మాట్లాడినా ప్రయోజనంలేదు.

"ఏదో బజారు వ్యవహారమని చికాకు పడుతున్నావేమో! అదంతా ఏం ఉండదు తెలుసా? శ్యామలాంబగారు చెప్పారు. అంతా గొప్ప గొప్ప వాళ్ళతో వ్యవహారం _ మాక్కూడా చాలా గౌరవం ఉంటుంది_" గర్వంగా అంది రాగిణి.

అప్పటికీ లలిత ఏమి మాట్లాడలేదు.

లలిత అలా ముభావంగా ఉదాసీనంగా ఉండటం రాగిణికేం నచ్చలేదు.

"నువ్వోక్కసారి మా సేవాసదనానికి రారాదు?" అంది.

"వద్దులే! నేను రాలేను_" కోపంగా అంది లలిత. అప్పటికయినా ఆ సేవాసదనంలో నుండి రాగిణిని బయటకు తీసుకు రాగలిగితే బాగుండునని లలిత తాపత్రయం.

రాగిణి మనసు చివుక్కుమంది. ఏదో అక్కసు కలిగింది.

"ఎందుకు రావూ? నిన్నూ అక్కడ చేరమంటారని భయమా? పరవాలేదులే! అక్కడ ఎవరిని పడితే వాళ్ళని చేర్చుకోరు. నాలా అన్ని విధాలా అందమైన వాళ్ళే కావాలి!" నవ్వుతూ నవ్వుతూ అనేసింది.

త్రుళ్ళి పడింది లలిత.

తను ఎన్ని విధాలుగానో ఆదరించిన రత్నమ్మ తన దగ్గర ఎన్నెన్నో సహాయాలు పొందిన రత్నమ్మ, ఈనాడు రాగిణిగా మారి ఇలా మాట్లాడుతోంది.

"నీ అంత గొప్పగా బ్రతకలేక పోయినా, ఏదో, ఎలాగో ఒకలా, బ్రతకడానికి ప్రయత్నిస్తున్నాను. ఈ అభాగ్యురాలిని మరిచిపోకు."

వెటకారంగా అని వెళ్ళిపోయింది రాగిణి.

తరువాత తరువాత శ్యామలాంబ సేవాసదనంగురించి చాలా విషయాలు తెలిసాయి లలితకి. రాగిణి అన్నట్లు ఆవిడ సేవాసదనంలో అందరూ అందమైన వాళ్ళే.

ఆవిడ వాళ్ళను పెద్దపెద్ద ఆఫీసర్ల దగ్గిర పనులు సాధించుకోవటానికి ఉపయోగించుకుంటుంది. పైనుంచి కిందవరకు అన్ని రకాల మనుషుల దగ్గరా ఆవిడకు లావాదేవీ లున్నాయి. ఈ విషయాలు అందరికీ తెలుసు. ఎవరికీ తెలియనట్లే ఉంటారు.

రాగిణిని ఇంచుమించు మరచి పోయింది లలిత. చాలా రోజుల తరువాత ఆ రోజు చూసింది రాగిణిని.

రాజు పక్కన కూచుని నవ్వుతోన్న రాగిణిని.

బాపినీడు గారు రమ్మంటున్నారని ఎవరో ప్యూన్ సైకిల్ మీద వచ్చి చెప్పాడు లలితకి. అప్పటికి వారం రోజులనుండే ప్రయత్నిస్తోన్నా, బాపినీడుగారి దర్శనం కాలేదు లలితకు. మోహన్ ఇంజనీరింగ్ లో డిప్లమా తీసుకున్నాడు. డిగ్రీలున్న వాళ్ళకే ఉద్యోగాలు దొరకని రోజుల్లో డిప్లమా మాత్రమే ఉన్న మోహన్ కి ఉద్యోగం దొరకలేదు. బాపినీడు గారికి అన్ని రంగాలలోను పలుకుబడి ఉందనీ, ఆయన తలుచుకుంటే సహాయం చెయ్యగలరనీ కొందరు స్నేహితులు లలితకు చెప్పారు. తమ్ముడికి కూడా ఉద్యోగం దొరికితే ఇంటి పరిస్థితి కాస్త కుదుట పడుతుంది. ఆ కారణంగానే బాపినీడుగారిని కలుసుకోవాలని ప్రయత్నించింది లలిత. ఉదయం వెళితే సాయంత్రం రమ్మనీ, సాయంత్రం వెళితే మరునాడు రమ్మనీ తిప్పిస్తున్నాడు పి. ఏ. అలాంటిది ఈ రోజున అక్కడినుండే కబురు వచ్చేసరికి ఆశ్చర్యం కలిగింది లలితకి. ఏమో! బాపినీడు మంచి వాడేనేమో! తను అతనికోసం వస్తున్నట్లు ఇంతకుముందు అతనికి తెలియదేమో? ఇప్పుడు తెలుసుకుని, కబురు పంపించాడేమో!

కొంచెం జంకుతూనే వెళ్ళింది. నౌకరు లోపలకు తీసికెళ్ళాడు. అక్కడ బాపినీడు పక్కనే కూచుని పకపక నవ్వుతోన్న రాగిణిని చూసి గ్రాన్పడిపోయింది.

రాగిణి లలితను చూడగానే తమాషాగా నవ్వింది. గర్వం, అహంకారం, వీటన్నిటినీ మించి ఏదో అసహనం వున్నాయి ఆ నవ్వులో.

"రా లలితా! కూచో! నేనే నీ కోసం కబురు పంపించాను. నాబోటివాళ్ళం ఒక స్టేటస్ మెయిన్టైన్ చెయ్యాలిగా! మీ ఇంటికొస్తే బాగుండదు చూడు...!"

ఏం మాట్లాడలేక నిలబడిపోయిన లలితను రాగిణి భుజాలు పట్టుకు కూర్చోబెట్టింది.

"ఏం తింటావు? రసగుల్లా? గులాబ్ జాం కావాలా?" అని అడిగింది.

"ఏం వద్దు."

"ఎందుకు? స్వీట్స్ తినటంకూడా పవిత్రతకు భంగమా? లేకపోతే డయిటింగా? నాలాంటి వాళ్ళకు ఆ తాపత్రయాలన్నీ! నీ కెందుకు?"

"వెళ్తాను." లేచింది లలిత. రాగిణి మళ్ళీ భుజాలుపట్టి కుర్చోబెట్టింది.

"కూచో! నన్ను చూసి భయపడకు. నేను నీకేమి చెయ్యను. ఆ మాట చెప్పాలనే పిలిచాను."

"నేను నీకు భయపడటంలేదు!"

"గుడ్! ఒక్కసారి అద్దంలో చూసుకో! కొంచెం రోజుల్లోనే ఎంత మారిపోయావ్? ప్చ్! పవిత్ర ప్రేమ! దానికర్థం ఇంతే! పరవాలేదులే! బెంగపెట్టుకోకు! నేను రాజును పెళ్ళిచేసుకోను. పెళ్ళిచేసుకోమని కాళ్ళా వేళ్ళా పడ్డాడు మహానుభావుడు! ఈ అందమంతా... అందమొకటే కాదులే..." అగి కన్నుకొట్టి నవ్వింది రాగిణి. లలిత ముఖం చూస్తూ మళ్ళీ సాగదీస్తూ సంభాషణ సాగించింది.

"ఇదంతా సొంతం చేసుకుందామని ఆశపడ్డాడు. అలాంటివాడు నా కెందుకు? అతని జీతమంతా కలిపి రెండువేలు లేదు. నాకు నెలకి అయిదువేలు తక్కువ ఖర్చుకాదు. అంతకంటె తక్కువలో ఎలా గడుపుకోవాలి? కొంచెం రోజుల్లో ఎలాగూ రాజుని ఒదిలేస్తాను. అప్పుడింక చచ్చినట్లు నీ దగ్గరకే వస్తాడు. ఈ క్షోభ, పాపం, నీకు కొంచెం రోజులే!"

లలితకు అక్కడినుంచి పారిపోవాలని ఉంది. పర్వతంలా సోఫాలో నిండుగా కూచుని, పరమానందంగా తమ సంభాషణ వింటూ చిరునవ్వులు చిలకరిస్తోన్న బాపినీడుని కత్తితో పొడవాలని ఉంది.

"అన్నట్లు రాజుకి నీలం రంగంటే ఇష్టంట, నీలం రంగు చీరను కొని జాగ్రత్త పెట్టుకో! నేను శృంగారంలో చిలిపిగా కొన్ని ధ్వనులు చేస్తాను. అవంటే రాజుకి చాలా ఇష్టం. నువ్వెప్పుడైనా తీరుబడిగా వస్తే అవెలా చేయాలో నేర్పిస్తాను..."

చిరునవ్వుతో చెప్పుకుపోతోంది రాగిణి. లలిత ముఖం చూస్తే బాపినీడుకే జాలి కలిగినట్టుంది, "మీకేం కావాలి?" అన్నాడు రాగిణి ధోరణికి అడ్డుపడుతూ...

"ఏం అక్కర్లేదు!"

"మరెందుకు తిరుగుతున్నారు. నా చుట్టూ..." అతడి మాటల్లో-పరిహాస ధోరణికి లలిత పొరుపడలేదు.

"నేను ఎంత నీచానికి పాల్పడ్డానో, నాకు తెలియక వచ్చాను. కొన్ని కొన్ని విషయాలు అనుభవంలో కాని అర్థంకావు. అదృష్టవంతురాలిని. ఇప్పటికైనా అర్థం చేసుకున్నాను. మాబోటి వాళ్ళందరూ ఉద్యోగాలకోసమో, మరి దేనికోసమో, మీ ఇంటిచుట్టూ తిరక్కపోతే మీరేం చెయ్యగలరు? మా అలసత్వమే మీకు అధికారాన్ని ఇస్తోంది. ఈ అడ్డుదారులను అడ్డుకోకపోవటమే మాలో అల్పత్వం. వస్తాను."

ఆ ఇంటి నుంచి బయటకు అడుగు పెట్టగానే భయంకరమైన అగ్నిజ్వాలల్లోంచి బయటపడి నట్లనిపించింది లలితకి.

వెంకట్రావుకి నిజానికి ఏ జబ్బూ లేదు. కానీ రిటైరయ్యాక వ్యాపక మేమీ లేక తీరిగ్గా కూచునేసరికి అతనికి లోకంలో ఉన్న జబ్బులన్నీ తనకే ఉన్నట్లుగా తోచేది. ఒకరోజు "నాకు కడుపు నొప్పి" అనేవాడు. మరో రోజు "నాకు తల తిరిగిపోతోంది" అని గొడవ పెట్టేవాడు. "గుండెల్లో పోటు. నేనింక బ్రతకను." అని ఏడ్చేసేవాడు. అతని గోల భరించటం ఇంట్లో అందరికీ కష్టంగా తయారయింది.

"పని లేకపోవటమే పెద్ద జబ్బు." అనేవాడు మోహన్.

"అవునవును. వంట్లో శక్తి ఉన్నంతవరకూ గొడ్డులా మీ కందరికీ చాకిరీ చేసాను. ఇప్పుడు నన్ను మీరంతా గొడ్డును చూసినట్లే చూస్తున్నారు" అని ఏడ్చేవాడు.

వెంకట్రావు గొప్ప ఆధ్యాత్మిక భావాలున్నవాడు. అతని ఆధ్యాత్మిక భావాలు అపమార్గంలో నడవడానికి అడ్డురాలేదు. కాని, ఈనాటికి నరకభయాన్ని కలిగిస్తున్నాయి. మృత్యుభయం. దానిని వెన్నంటి నరక భయం... తాను చూడబోయే నరకం మాటెలా ఉన్నా చుట్టుపక్కల వాళ్ళకి నరకం చూపించగలుగుతున్నాడు.

లలిత, తండ్రి సుఖంకోసం శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తోనే ఉంది. అబద్ధపు రోగమైనా నిజం రోగమైనా, రోగమని గోలపెట్టే తండ్రి అవస్థ చూడలేక ఇంటికే డాక్టర్‌ని పిలిపించింది. డాక్టర్ వచ్చిచూసి ఏ రోగమూ లేదని తెలుసుకుని ఊరికే వెళ్ళలేక బలహీనంగా ఉన్నాడని ఏవో టానిక్స్ రాసి ఇచ్చేవాడు. ఇల్లంతా లలిత సంపాదనమీద ఆధారపడి ఉంది. ఆ కాస్త సంపాదనలో టానిక్స్‌లాంటివి కూడా కొనాలంటే కష్టమే! అయినా లలిత కొనేది. డాక్టర్‌ని ఇంటికి పిలిపించాలంటే విజిటింగ్ ఛార్జెస్ ఇయ్యాలని తెలిసినా చీటికీ మాటికీ డాక్టర్‌ని పిలవమని సతాయించేవాడు. అతడు ఏనాడూ ఎవ్వరినీ ప్రేమించలేదు. ప్రేమ వల్ల కలిగే ఆర్ద్రభావాలతో అతనికి పరిచయంలేదు. తనలో తనకు నమ్మకంలేని ఆ వ్యక్తి ఏ ఒక్కరినీ నమ్మలేదు. మందియ్యటం కొంచెం ఆలస్యమయితే "నాకు తెలుసు. మీరంతా నన్ను చంపాలని చూస్తున్నారు" అని వీధిన పడేవాడు. రోగంలో ఉన్నాడుకదా అని పళ్ళు తెప్పించి ఇస్తే "మీరంతా ఏం తిన్నారు? మీరు మంచి మంచి స్వీట్స్ చేసుకు తింటూ నా ముఖాన్న ఈ పళ్ళు పడేస్తున్నారా?" అని కసిగా అడిగేవాడు.

లలిత బాధపడుతోనే శాంతంగా చేస్తోన్నా, పెళ్ళయిన నాటినుండీ

భర్త చేతిలో తిరస్కారాలూ అవమానాలూ తప్ప ఆదరణను నోచుకోని జానకమ్మకు మాత్రం మండిపోయింది.

"లలితా! చేసిన పాపాలకు శిక్ష అంటూ ఉండద్దా? ఎందుకాయనకు మనం ఇన్ని సేవలు చేయాలి?" అనేది అక్కసుగా... ఈ దశలో సహితం ప్రేమానురాగాలు చూపించలేక అనుమానాలతో కుళ్ళిపోతూ తన స్వార్థమే తను ఆలోచించుకునే వెంకట్రావును క్షమించలేకపోతోంది జానకమ్మ.

తల్లి మనసు అర్థం చేసుకోగలదు లలిత. నచ్చజెపుతున్నట్లు అంది.

"ఇప్పుడాయన అనుభవిస్తున్నది శిక్ష కాదంటావా అమ్మా! అలాంటి మనసు... ఒక్క క్షణమయినా శాంతికీ స్థిమితానికీ నోచుకోక తనను తాను దహించుకునే మనసు... అలాంటి మనసుకంటె పెద్ద శిక్ష ఎవరికి కావాలి?"

"ఏమో! ఇంత చేస్తున్నాం! ఏమైనా ఫలితముందా? ఇంకా ఏదో తనకు అన్యాయం జరుగుతోందనే ఆక్రోశమే కదా! ఇలాంటి వ్యక్తికి ఏంచేసినా బూడిదలో పన్నీరే!"

"మనం చేసినదానికి బదులుగా వాళ్ళు మనకేదో చెయ్యాలని ఆశించి ఏదీ చెయ్యకూడదమ్మా! ఒక పని చెయ్యటంవల్ల మనకానందముంటేనే ఆ పని చెయ్యాలి. పోనీ, ఏంచేద్దామో నువ్వే చెప్పు. నాన్నని వీధుల్లోకి వెళ్ళగొడదామా! చిన్నప్పటినుండీ చేసిన అన్యాయాలకు ఫలితంగా కుక్క బ్రతుకు బ్రతకమందామా? అలా చేస్తే నీకు హాయిగా ఉంటుందా?". జానకమ్మ సమాధానం చెప్పలేకపోయింది.

"కొంపదీసి నువ్వు కూడా నాన్నలాగ నువ్వుచేసిన పనులకు ఫలితంగా స్వర్గంలో రంభ, మేనక...కాదు! కాదు! నలకూబరుడు... మన్మధుడు... ఇత్యాది ఆశిస్తున్నావేమిటి?"

పకాలున నవ్వేసింది జానకమ్మ.

"పోవే! గంభీరంగా ఉంటూనే, కొంటెగా మాట్లాడగలవు!"

తల్లి ముఖంలో నవ్వుచూసి చాలా తృప్తిపడింది లలిత.

"మంచి మనసు కలిగి ఉండటంకంటె గొప్ప వరం ఏముందమ్మా! మన మనసులూ మహా మంచివేంకావు. కానీ కనీసం మంచిగా ఉండటానికి తాపత్రయపడుతున్నాయి. నాన్న విషయంలో మన కర్తవ్యం మనం చేసామన్న తృప్తిచాలదా మనకు?"

జానకమ్మ ప్రేమగా లలిత చెక్కిళ్ళు నిమిరింది.

"నీ అమ్మ కడుపు చల్లగా నూరేళ్ళు బ్రతికి నాదగ్గిర ఎప్పుడు ఇలాంటి బంగారు మాటలే మాట్లాడు. అవునమ్మా! బ్రతక్క ఎలాగు

తప్పదు. బ్రతికిన నాలుగు రోజులూ హాయిగా బ్రతికేస్తే పోలా?"

మోహన్‌కి ఉద్యోగం దొరకలేదు. మరెవరిదగ్గరకో వెళితే పనవుతుందని ఎవరో చెప్పారు. ఆ మాట లలితతో చెపితే మండిపడింది.

"నేను ఎవరిదగ్గరకు వెళ్ళను. నువ్వూ వెళ్ళకు. ఇలా ఎవరిమటుకు వాళ్ళం నలుగురితో పాటు అనుకుంటూ అక్రమాలు ప్రోత్సహిస్తున్నాం."

మోహన్‌కు మండి పోయింది.

"నీ శ్రీరంగ నీతులు వినటానికి బాగానే ఉన్నాయి, కానీ నాకు ఉద్యోగం తెచ్చి పెట్టవు. ఏం చెయ్యాలి?"

"నువ్వొక్కడివేనా? ఇంకా నీలా మగ్గిపోతున్న వాళ్ళు లేరూ? మీరంతా కలిసి మీ హక్కులకోసం పోరాడండి!"

లలిత మాటలు మొదట హాస్యంగా కనిపించినా చివరకు అదే మేలనిపించింది మోహన్‌కి. నిరుద్యోగులంతా ఒక సంఘంలా సమావేశమయ్యారు. ఏ రోజు ఎక్కడెక్కడ ఎందరెందరు ఏయే విధాల అన్యాయంగా ఉద్యోగాలు సంపాదించారో బహిరంగపరిచి విద్యావంతులలో ఆందోళన లేవదియ్యసాగారు. కానీ ఇది ఎక్కువ రోజులు సాగలేదు. సంఘంలో శాంతిభద్రతలకు భంగం కలిగిస్తోన్న నేరం క్రింద మోహన్‌తో పాటు మరికొందరిని అరెస్ట్ చేసారు.

ఆ వార్త విని జానకమ్మ తల్లడిల్లిపోయింది. లలితకు మతిపోయినట్లయింది. మోహన్‌ని రెచ్చగొట్టింది తనే! ఒక రకంగా తనే ఇందుకు బాధ్యురాలి ననుకొని చాలా బాధపడింది.

ఈ సమయంలో ఆఫీసులో లలితతో పనిచేసే ఒక స్నేహితురాలు "అసిస్టెంట్ పోలీస్ కమిషనర్ మాధవరావుగారు చాలా మంచివారు. ఆయనను ఒకసారి కలుసుకోరాదు!" అంది.

అన్యాయంగా అరెస్టయిన తమ్ముణ్ని విడిపించవలసిన బాధ్యత అక్కగానేగాక నైతికంగా కూడా తనమీద ఉందనుకుంది లలిత. సాహసించి మాధవరావుగారి దగ్గరకు వెళ్ళింది.

మాధవరావు మరీ పెద్దవాడు కాకపోయినా చిన్నవాడు కూడా కాడు. అందమైనవాడని చెప్పడానికి లేదు కాని అతని ముఖంలో గాంభీర్యం అదొక విధంగా ఆకర్షణీయంగా ఉంది.

"కూర్చోండి! ఎందుకొచ్చారు?" అన్నాడు మర్యాదగా.

"మా తమ్ముడు మోహన్‌ని అరెస్ట్ చేసారు. వాడు..." లలిత ఏదో చెప్పబోతుండగానే చెయ్యెత్తి అడ్డుకున్నాడు మాధవరావు.

"ఇలాంటి పనులమీద ఎప్పుడు నా దగ్గరకి రాకండి. ఒకసారి అరెస్టయ్యాక కోర్టులో విచారణ జరగవలసిందే! నేను కల్పించుకుని విడు

దల చెయ్యను.''

మాధవరావు ధోరణిలో ఒక ''కమేండ్'' ఉంది. లలితకు గొంతు పొడారి పోసాగింది.

''కానీ మా తమ్ముడు అన్యాయంగా...''

ఈసారికూడా లలిత మాటలను పూర్తిచెయ్యనియ్యలేదు మాధవరావు.

''అరెస్ట్ చేసినది న్యాయంగానో, అన్యాయంగానో విచారణలో తేలుతుంది. అందరూ అన్యాయమే చెయ్యరు. ఒక వేళ అన్యాయం ఉందనుకున్నా దానిని ఎదుర్కోవాలి కాని మనమూ అన్యాయంలోకి జారి పోకూడదు.''

లలిత మాట్లాడలేకపోయింది.

''ఇంక మీరు వెళ్ళిరండి'' అన్నాడు మాధవరావు. క్షణమాత్రం అతని కళ్ళలో జాలి మెరుపులా మెరిసి మాయమయింది.

లలిత వచ్చిన పని కాలేదు. కానీ ఆమె కృంగిపోలేదు. బాపినీడు దగ్గర భంగపడి వచ్చింది. ఆనాడు మనసంతా చీదరగా చికాకుగా అయి పోయింది. ఈనాడు మాధవరావూ కాదన్నాడు. కానీ, ఈ కాదనటం కూడా ఏదో ధైర్యం చెప్పినట్లుగానే ఉంది. 'అంతటా అన్యాయమే జరగదు' అన్నాడు మాధవరావు. నిజమేనా? నిజమేనని రుజువు చేసాడు జస్టిస్ రెడ్డి.

''మోహన్ మొదలైనవాళ్ళు చేస్తున్న పనులలో సాంఘిక శాంతి భద్రతలకు భంగం కలిగించేవేం లేవు. వాళ్లు సంఘంలో అన్యాయాలు బయట పెడుతున్నారు. అదికూడా ఒక రకంగా సంఘసేవ! స్వతంత్రంగా ఆలోచించే హక్కు ఈ దేశంలో ప్రతి పౌరుడికీ ఉంది'' అని జడ్జిమెంట్ ఇచ్చాడు.

మోహన్ విడుదలయ్యాడు. కానీ అతని పరిస్థితి మరింత సంకటంగా తయారయింది. అందరు అతణ్ని దొంగలాగో, హంతకుడిలాగో చూడటం మొదలు పెట్టారు. ఇదివరకు కనీసం ఇంటర్వ్యూకయినా పిలిచేవారు. ఇప్పుడదీ మానుకున్నారు. సహజంగా కొంచెం దుడుకు వాడయిన మోహన్ ఈ పరిస్థితికి తట్టుకోలేకపోయాడు. ఒక రోజున ఇంట్లోంచి మాయమయ్యాడు. ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో తెలియలేదు. పోలీస్ రిపోర్టు ఇవ్వటానికి భయపడింది లలిత. ఏమో! మళ్ళీ ఎక్కడ చిక్కుకున్నాడో?

జానకమ్మ ఈ దెబ్బకు తట్టుకోలేకపోయింది. మంచ మెక్కేసింది.

''లలితా! నువ్వు చెప్పవే! నిజంగా దేవుడున్నాడా? ఈ సృష్టిలో

కొంచెమైనా న్యాయముందా? నాకెందు కిన్ని పరీక్షలు? నా పిల్లల్ని పెంచుకోవాలనీ, వాళ్ళను పైకి తీసుకరావాలనీ, అష్టకష్టాలూ అనుభవించాను. నువ్విలా అయిపోయావు. వాడలా అయిపోయాడు. ఏం చూసుకొని బతకమంటావే!" అంది ఏడుస్తూ.

"నా కేమయిందమ్మా?"

"ఏమయిందా? లక్షణంగా రాజుని పెళ్ళిచేసుకని కళకళలాడుతూ ఉండవలసినదానివి ఇలా ఏడవలేక నవ్వుతూ తిరుగుతున్నావు. నీ కసలు బుద్ధిలేదే! రాజుని ఐ.ఎ.ఎస్. కి కట్టమనకుండా ఉండవలసింది. పోనీ పెళ్ళయ్యాక కట్టమన వలసింది!"

లలిత లోలోపల నవ్వుకుంది.

పాపం అమ్మ! పెళ్ళయిపోతే తరువాత ఏం జరిగినా పరవాలేదనుకుంటోంది! తాను అంత అనుభవించినా సంప్రదాయపు వాసనలు వదలవు.

"ఇంటిల్లి పాదికీ రోగాలే! నాకు వేళకి కాస్త పళ్ళరసం ఇచ్చే దిక్కు కూడా లేదు." అని గొణుక్కున్నాడు వెంకట్రావు, మంచాన పడ్డ భార్యను చూసి.

లలిత అటు తండ్రికీ, తల్లికీ వైద్య సదుపాయాలు చూసుకోవాలి! ఇల్లు నిర్వహించుకోవాలి! ఉద్యోగం చెయ్యాలి.

బస్ కోసం ఎదురుచూస్తూ అరగంటనుండీ బస్ స్టాప్ లో నిలుచునుంది లలిత. కాళ్ళు లాగుతున్నాయి. విసుగొస్తోంది. రోడ్డుమీద పోతున్న కారుని చూసి "నాకు లిఫ్ట్ ఇయ్యకూడదూ?" అనుకుంది. అలా చాలాసార్లు అనుకునేది. కానీ ఒక్కసారీ ఏ కారు ఆగలేదు. ఈసారి విచిత్రంగా ఆకారు ఆగిపోయింది. అంతేకాదు, కారులోంచి ఎవరో తనను చెయ్యి ఊపి పిలుస్తున్నారు. లలిత తెల్లబోయింది. తనను కాదేమో ననుకని చుట్టూ చూసింది మరెవరైనా కదులుతున్నారేమోనని. అంతలో కారులో వ్యక్తి తల బయటపెట్టి చిరునవ్వుతో "మిమ్మల్నే! రండి!" అంది.

లలిత గుర్తు పట్టింది. మిసెస్ మణిమాల! కళామందిర్ లో లలిత సంగీత కచేరీ చేసింది. అక్కడ ఆవిడతో పరిచయమయింది. ఆనాటి ఆవిడ ధోరణినిబట్టి ఆవిడకు చాలా గర్వమని అభిప్రాయపడింది. అలాంటిది ప్రత్యేకం కారాపి పిలుస్తోన్నదంటే...లలిత దగ్గరగా వెళ్ళింది.

"రండి! కూర్చోండి! మీ ఇంటిదగ్గర డ్రాప్ చేయిస్తాను." అంది మణిమాల తలుపు తెరిచి.

లలిత మొహమాట పడుతూ "మీ కెందుకు శ్రమ" అని నాన్చింది.

"శ్రమేముంది? నేను నడపాలా కారుని? డ్రైవర్ ఉన్నాడుగా! రండి." లలిత వచ్చి కూచుంది.

"ముందు మా ఇంటికి వెళ్దాం! కొంచెం కాఫీ తీసుకున్నాక డ్రైవర్ని మీ ఇంటిదగ్గిర దింపి రమ్మంటాను." అంది మణిమాల.

కాదనలేక పోయింది లలిత.

మణిమాల ఇల్లు కూడా మణిమాలలాగే ఆధునికంగా ఆడంబరంగా ఉంది. లలితను కూచోమని ఫలహారం, కాఫీ వంటమనిషి చేత ఇప్పించింది మణిమాల. ఇల్లంతా చూపించింది. మణిమాల గదిలో వీణని చూసి లలిత "మీరుకూడా వీణ నేర్చుకున్నారా!" అంది.

మణిమాల నవ్వుతూ "ఆ! పెళ్ళిచూపుల్లో "వీణవచ్చు" అని చెప్పటానికి తగినంత పాండిత్యం సంపాదించాను. నేను వాయించలేకపోయినా వినటం ఇష్టం. మీకు అభ్యంతరం లేకపోతే మరొకసారి తీరిగ్గా వచ్చి మా ఇంట్లో వీణ వాయించగలరా?" అంది.

"అలాగే!" అంది లలిత.

మణిమాల లలితకు బొట్టుపెట్టి లలిత వద్దంటున్నా తాంబూలంతో పాటు డజను అరటిపళ్లు చేతిలో పెట్టి తమ కారులో ఇంటికి పంపించింది

# 4

రాజును మరిచిపోవాలని విశ్వప్రయత్నం చేస్తోంది లలిత. ఎంత ప్రయత్నించినా కారు చీకటిలా తనను క్రమ్ముకునే ఒక నైరాశ్యభావం నుండి బయటపడలేకపోతోంది. అన్నింటిపట్లా ఏదో విరక్తిభావమే కలుగుతోంది. "నా బ్రతుకంతా రాజు మాత్రమేనా? రాజు తిరస్కరించినంతమాత్రాన ఇక నా కేమీ మిగలనట్లు ఇలా అయిపోవట మేమిటి?" అని ఎంతగా తనకు తను నచ్చచెప్పుకున్నా అప్పటికప్పుడు ఈ లోకంతోనే నిమిత్తంలేనట్లు మనసు కృంగిపోక మానటంలేదు.

"నీకు ఫోన్ వచ్చింది." అని చెప్పింది ఎదురింటి వారమ్మాయి.

ఆ ఫోన్ నెంబరు రాజుకు మాత్రమే తెలుసు. ఎదురింటి వారికి ఇబ్బంది కలిగించటం ఇష్టంలేక, వాళ్ళేమైనా అనుకోవచ్చుననీ ఆ నంబర్ తన స్నేహితుల కెవరికీ ఇయ్యలేదు. రాజుతో కూడా ఏదైనా అత్యవసరమయినప్పుడే ఫోన్ చెయ్యమని చెప్పింది.

తనకు ఫోన్ వచ్చిందనగానే లలిత మనసులో నైరాశ్యం మంత్రించినట్లు మాయమయింది రాజు తనకోసం ఫోన్ చేశాడు. బహుశః తనలాగే రాజుకూడా బాధపడుతూ ఉండిఉంటాడు. ఒక్కక్షణం ఆ నాడు రాగిణితో కలిసి తనను చూసి నవ్విన రాజుమూర్తి గుర్తుకొచ్చి మనసు కలుక్కుమంది. అతిప్రయత్నంమీద ఆ ఆలోచనను వెనక్కునెట్టింది. ఇలాంటి బలహీనతలు మొగవాళ్ళలో సహజమే నేమో! రాజును తను క్షమించగలదు. కాదు! క్షమించకుండా ఉండలేదు. అతనికోసం కాదు. తనకోసం!

రాజు తనకోసం ఫోన్ చేశాడని వినగానే. అతనిని క్షమించాలని నిర్ణయించుకోగానే మళ్ళీ రాజుకు తనకూ మధ్య అనుబంధం ఎప్పటిలా కొనసాగుతుందని అనుకోగానే గుండెలమీద సీసంలా పేరుకున్న బరు వేదో తొలిగిపోయినట్లయింది. మనసేవో మధురనాదాలను ఆలపించింది. ఏదో సంతృప్తితో సంతోషంతో గాలిలో తేలిపోతున్నట్లు నడుస్తూ ఫోన్ దగ్గరకు వెళ్ళింది. ఫోన్ అందుకున్న చెయ్యి వణికింది. తనను తను అదుపులోకి తెచ్చుకుంటూ "హలో!" అంది ఆప్యాయంగా.

అవతలి వైపునుండి "హలో!" అని వినిపించింది. అది రాజుకంఠం కాదు. ఎవరో స్త్రీకంఠ స్వరం.

"లలితను మాట్లాడుతున్నాను. ఎవరు?"

"నేను లలితా! గుర్తుపట్టలేదా? రాగిణిని." కిలారుమని నవ్వు...

నెత్తిమీద ఎవరో తట్టలతో మంచు గుమ్మరించినట్లు ఒక విధమైన జడత్వం ఆవహించింది లలితని...

"లలితా! చూసావా, నువ్వు మరిచిపోయినా, నేను మరిచిపో లేదు. కొందరు స్నేహితులు కాస్త పైకి రాగానే పాత స్నేహితుల్ని మరిచిపోతారు. నేనలా కాదు. నేనెంత పైకొచ్చినా నిన్నూ నీ స్నేహాన్నీ మరిచిపోలేదు. ఒకనాటి నీ సహాయం, నీ ఆదరణ జన్మలో ఎన్నడు మరిచి పోలేను..."

విదిలించుకోవాలి! కప్పలా మీదపడుతున్న మంచు కొండలనుండి బయటపడాలి! ఓడిపోకూడదు. నిలబడాలి. "థాంక్స్!" కంఠాన్ని అదు పులోపెట్టుకుంటూ దానిలో నవ్వు పలికిస్తూ అంది లలిత.

మళ్ళీ కిలారుమంది రాగిణి. చక్కగా తీయగా నవ్వగలదు రాగిణి. ఆ నవ్వు కృత్రిమత్వం వినిపిస్తోందా? ఏమో! వినిపించినా ఎంత మంది వినగలరు? చాలామంది ఆ తీయదనానికే ముగ్ధులవుతారు.

"లలితా! మీరంతా ఒక జాతివాళ్ళు. మీవన్నీ 'పవిత్ర ప్రేమ'లు! పాపం! రాజుకోసం నువ్వెంత బాధపడుతున్నావో, ఎంత తపించిపో తున్నావో, నేను అనుభవించకపోయినా నీ ముఖంచూసి ఊహించగలి గాను. అక్కడికీ రాజుతో చెప్పాను. "లలితను దూరం చేసుకోవద్దు." అని. ఆముదం తాగిన వాడిలా ముఖంపెట్టాడు! ఈ మొగాళ్ళంతేలే! ఎక్కడిమాట అక్కడ! నా దగ్గర నా ముందు అంతకంటె ఇంకే మంటాడు? కానీ లలితా! అతనికి నీమీద ప్రేమ లేకపోలేదు. నీ కెందుకు? నేను చెప్పి వొప్పిస్తాగా! నువ్వురా! రేపురా! నిన్నూ రాజును సినిమాకు పంపించే బాధ్యతనాది!..."

జుగుప్సతో వణికిపోతోంది లలిత. ఎలా మాట్లాడుతోంది రాగిణి!

ఒకవేళ రాగిణి నిజంగానే తనపట్ల స్నేహభావం కనపరచాలని అనుకుం టుందేమో! రాగిణికి తెలిసినంతలో ఆభావాన్ని వ్యక్తపరచగలిగిన భాష ఇంతమాత్రమే నేమో! ఒక జాతికంతా ఒకభాష ఉండటం మాత్రమే కాదు. ప్రతి ఒక్కరికీ ఒక్క భాష ఉంటుంది. దాని పరిధిలోనే తమ మనసు బయట పెట్టుకోగలరు.

లలిత నవ్వింది. శాంతంగా స్థిమితంగా నవ్వింది. హమ్మయ్య! మంచు కరిగిపోతోంది. చైతన్యం వస్తోంది.

"చాలా థాంక్స్ రాగిణీ! కానీ, నువ్వు నా కోసం ఏమీ శ్రమ పడకు! నే నెక్కడికీ రాను. నా కేమి అక్కర్లేదు!"

"అదేంమాట లలితా? నీకు రాజుమీద ప్రేమపోయిందా?"

లలిత నిజమే చెప్పదలచుకొంది. "ఇప్పటివరకు పోలేదు."

"భలే దానివి. అంటే ముందు ముందు పోతుందా?"

"నేనేం చెప్పగలను? జీవితం మన ముందుఉంది. మన ఇష్టానిష్టాలతో నిమిత్తంలేకుండా రకరకాల అనుభవాలు ఎదురౌతాయి. ఆ అనుభవాలు పాఠాలు నేర్పుతాయి. ఆ పాఠాలనుండి శక్త్యానుసారం జీవితాన్ని అర్థంచేసుకుంటాం. ఏమో! ఏం జరుగుతుందో?"

ఈసారి రాగిణి నవ్వలేదు. కంఠంలో కూడా ఏదో మార్పువచ్చింది.

"రాజుతోకలిసి సినిమాకు వెళ్లటం నీకిష్టం లేదా?"

"ఇష్టమయిన పనులన్నీ అన్నివేళలా చెయ్యలేం. అంతకంటే ప్రధానమయినదేదో అడ్డుపడుతుంది."

"ఏమిటి, ఆ ప్రధానమయినది?"

"మానవత్వమంటే— కళ్ళు, ముక్కు, నోరు, ఒడ్డుపొడుగు కాక మరేదైనా ఉందనుకుంటే... అదేదో తెలుసుకో గలిగితే... అదే ప్రధానమైనది!"

రాగిణి టక్కున ఫోన్ పెట్టేసింది.

ఈ మనసు! శరీరాన్ని చంపినంత తేలికకాదు మనసును చంపటం! ఎన్నివిధాల ఎలాంటి విషప్రయోగాలు చేసినా, ఏ వైపునుండి ఏ కొద్దిపాటి మానవత్వపు వాసన సోకినా మేలుకుని కూర్చుంటుంది. ఊపిరి పోసుకుంటూ ప్రాణిని ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. పాపం! రాగిణి!

శ్రమపడటం కష్టమే! కానీ శ్రమించినకొద్దీ శరీరం మరింత దృఢమవుతుంది. మనసూ అంతే! కొన్ని కొన్ని భావనలు తాత్కాలికంగా మనసును బాధించి మెలిపెట్టినా రానురాను ఆ బాధే మనోబలాన్ని పెంపొందిస్తుంది.

రాజు రాగిణికి తన ఫోన్ నంబర్ ఇచ్చాడు. రాగిణి తనతో ఏం

మాట్లాడుతుందో ఊహించలేదా? అయినా రాగిణి అడగగానే నంబర్ ఇయ్యగలిగాడా?

రాగిణి మాటలకంటే ఈభావనే ఎక్కువగా బాధపెట్టింది లలితని. ఈ భావనలో పదేపదే మనసు నలిగి పదునెక్కటంవల్లనేనేమో... రాజు తన ఇంటికి వచ్చినపుడు మామూలుగా ఆహ్వానించగలిగింది.

"నీ డబ్బు నీ కియ్యాలని ఎప్పటినుండో అనుకుంటున్నాను. కుదరటంలేదు. ఇవాళ తీసుకొచ్చాను."

తన జేబులోంచి అయిదువందలు తీసి బల్లమీద పెట్టాడు రాజు.

ఒక్కసారి నోట్లవంక చూసింది లలిత. వద్దనుకున్నా వాటివెనుక ఉన్న కథ గుర్తుకొచ్చింది.

రాజు కూడా లలితలాంటి మధ్య తరగతి మనిషే! అందుకే చదువు కునే రోజుల్లోనే వాళ్ళిద్దరూ ప్రేమించుకోవటానికి పెళ్ళిచేసుకోవాలని అనుకోవటానికి కాని ఎలాంటి ఆటంకాలూ రాలేదు. బి. ఏ. పాసయి లలితలాగే యు. డి. సి. గా చేరిన రాజును ఐ. ఎ. ఎస్. కి కట్టమని లలిత ప్రోత్సహించింది.

"మనబోటి వాళ్ళకు వస్తాయా అలాంటి ఛాన్స్‌లు?" నిరాశగా అన్నాడు రాజు.

"ప్రయత్నించు. తప్పేముంది?" అంది లలిత.

రాజు ఐ. ఎ. ఎస్. పరీక్షకి కట్టాడు. పరీక్షలముందు కనీసం రెండు నెలలైనా ఉద్యోగానికి సెలవుపెట్టి ట్యుటోరియల్ కాలేజిలో చేరి చదవాలనుకున్నాడు. జీతం నష్టంమీద కాని సెలవు దొరకదు. కుటుంబ పరిస్థితులు రెండు నెలలు జీతం లేకుండా గడిచేలా లేవు.

మెడలోకి సన్నని గొలుసు చేయించుకోవాలని అతి కష్టంమీద లలిత పోగుచేసుకుంది అయిదువందలు. ఆ డబ్బు అతనిచేతిలో పెట్టింది.

"నా దగ్గరున్నదీ ఇంతే! ఎలాగో సర్దుకో! సెలవుపెట్టెయ్యి. చదువు అశ్రద్ధచెయ్యకు!" అంది.

కృతజ్ఞతలో కరిగిపోయాడు రాజు. లలిత చేతులు రెండూ తన చేతుల్లోకి తీసుకున్నాడు.

"లలితా! ఎలా తీర్చుకోగలను నీ ఋణం?"

"ఋణమా? తీర్చుకుంటావా?"

మూతి బిగించింది, లలిత.

ముడుచుకున్న లలిత మూతిమీద చిన్నగా చూపుడువేలితో కొట్టి "సారీ! నేను ఐ. ఎ. ఎస్. ఆఫీసర్నయితే అదంతా నీదేగా!" అన్నాడు.

లలిత కెలాగో అనిపించింది.

"రాజూ! అలాంటి ఆశతో ఈ డబ్బు నీ కియ్యటంలేదు. మనమధ్య ఋణాలేమిటని అన్నాను."

"పోవోయ్! నిన్ను ఆఫీసర్ భార్యని చెయ్యటానికైనా సెలెక్టయి తీరతాను!"

నవ్వుతూ అన్నాడు రాజు. రాజు చాలా తెలివైనవాడు. లలిత ప్రోత్సహించింది అందుకే. రిజల్ట్స్ వచ్చి సెలెక్టయినట్లు తెలిసిన రోజున రాజు మొట్టమొదట లలిత దగ్గరకే వచ్చాడు.

"ఈ డిగ్రీ నాదికాదు లలితా! నీది!" అన్నాడు అనురాగంతో.

"నీ డిగ్రీ ఎవడికాక్కవాలి? నువ్వే నా వాడివి!" అంది లలిత సంతోషంతో. ఇద్దరూ హాయిగా నవ్వుకున్నారు.

ముఖంలో ఏ భావమూ కనిపించనీయకుండా ముందుకు వంగి బల్లమీద రాజు పెట్టిన నోట్లని అందుకుంది లలిత.

రాజు ఆశ్చర్యపోయాడు. అతని ముఖంలో ఆశ్చర్యం స్పష్టంగా కనిపించింది. ఈ సంఘటన ఇంత సామాన్యంగా జరుగుతుందని అతననుకోలేదు. లలిత వెయ్యబోయే నిష్ఠూరాలు ఎదుర్కోవటానికి ఎంతో సిద్ధపడి వచ్చాడు. అలాంటిది... ఉండబట్టలేక అనేసాడు. "నువ్వీ డబ్బు తీసుకోవనుకున్నాను..."

లలిత ఆశ్చర్యం నటించింది.

"అదేం? ఎందుకు తీసుకోననుకున్నావ్? నేనిచ్చింది అయిదువందలు. నువ్వు తెచ్చింది అయిదువందలు. లెక్క సరిపోయిందిగా!"

"లెక్క కాదు."

లెక్కల కందనిదేమిటో రాజు చెప్పలేకపోయాడు.

మాట్లాడకుండా కూర్చున్న లలితముందు రాజు మనసు మరింత ముడుచుకుపోసాగింది. ఏదో ఒకటి మాట్లాడకుండా ఉండలేకపోయాడు.

"నేను రాగిణిని..."

ఏదో చెప్పబోతున్న రాజును చెయ్యెత్తి వారించింది లలిత.

"నేను సంజాయిషీలు అడగటంలేదు రాజూ! నువ్వు నాకేమీ చెప్పక్కర్లేదు."

"రాగిణిని నువ్వర్థం చేసుకోవటంలేదు. తను చాలా మంచిది."

"కావచ్చు!"

"తనకి నువ్వంటే చాలా యిష్టం?"

"అలాగా?!"

"ఒక్కసారి నీతో ఎలాగైనా మాట్లాడాలని తపించిపోయింది. నీ ఫోన్ నంబర్ ఇచ్చి మాట్లాడమన్నాను."

"మాట్లాడింది!"

"నీ బుద్ధి చూపించుకున్నావు. రాగిణిని అవమానించి నీ కసి తీర్చుకున్నావు!"

"రాగిణిని అవమానించానా?"

"పాపం, నా దగ్గిర ఎంత ఏడ్చిందో తెలుసా? జాలేసింది!"

"ఒకవేళ ఏడిస్తే ఆశ్చర్యపడక్కర్లేదు. రాగిణితో మాట్లాడాక నాకు రాగిణిమీద జాలి కలిగింది."

లలిత మాటలు తన ధోరణిలోనే అర్థం చేసుకున్నాడు రాజు. అతనికి లలితమీద చాలా కోపం వచ్చింది. "రాగిణిని అవమానించే అధికారం నీకేముంది? ఒకప్పుడు నువ్వు ప్రేమించినట్లే ఇప్పుడు రాగిణి కూడా నన్ను ప్రేమిస్తోంది. రాగిణికంటె నువ్వేవిధంగా అధికురాలివి?"

రాజు మాటలకు ప్రూన్పడిపోయింది లలిత. అంతలో పకాలున నవ్వింది.

"రాగిణికంటె నేను అధికురాలినని ఎవరు చెప్పారు రాజూ! నీమీది ప్రేమకు సంబంధించినంతవరకు రాగిణికంటె నేనే అల్పురాలిని! ముమ్మాటికీ నిజం!"

ఆ అవమానం అర్థమయింది రాజుకి. రగులుతోన్న ముఖంతో విసురుగా వెళ్ళిపోయాడు.

తన చేతిలో నోట్లవంక చూసుకుంది లలిత. అవే నోట్లు! ఒకప్పుడు అవే! ఇప్పుడు అవే! ఆనాటి వాటి విలువ వేరు, ఈనాటి విలువ వేరు. విలువలు విషయాలమీద ఆధారపడి ఉండవు. సందర్భాలమీద ఆధారపడి ఉంటాయి.

# 5

మహిళా సమాజాలకుకాని, లేడీస్ క్లబ్బులకికాని వెళ్ళటం లలితకు అలవాటులేదు. ఒక విధంగా మణిమాల బలవంతం మీదే మహిళామండలి వార్షికోత్సవాలలో వీణ వాయించడానికి ఒప్పుకుంది లలిత. మణిమాల లలితను స్వయంగా తన కారులో వెంటబెట్టుకుని తీసుకొచ్చింది. అక్కడ సమావేశమయిన వారిలో చాలామంది ధనిక కుటుంబాలకు చెందిన స్త్రీలే! ఆ కారణంచేత కాలేజీ డిగ్రీల మాట ఎలా ఉన్నా, వారందరు నాగరికతలో ఒకరికొకరు తీసిపోరు. అందుకు నిదర్శనం ఏనోట విన్నా లేటెస్టు ఫేషన్స్ గురించి వినిపించటం! ఎవరిని చూసినా మరొకరి చీరల, నగల, విలువలను అంచనా వేస్తూ కనిపించటం! తమకంటె ప్రాక్తం ఎక్కువగా కనిపించినా ఈర్ష్యతో భగ్గుమనే అంతరంగాలను చిటనవ్వు ముసుగులతో కప్పుకుని, లోపల ఇమడలేక ఉక్కిరిబిక్కిరయ్యే ఈర్ష్యను లేనిపోని

నిందారోపణల కట్టుకథల రూపంతో ఆవిష్కరించటం! తాము ఎంత ధనవంతులో ఇతరులు గ్రహించేలా చెయ్యాలని తాపత్రయ పడటం! గొప్పవారిగా కనిపించినవారిని, ధనంలో గొప్పవారిని పోటీలు పడుతూ ఇచ్ఛకాలాడటం.

మహిళామండలి భవనంముందు ఏదో కారు ఆగింది. ఎవరో అన్నారు "శ్యామలాంబగారు వచ్చార"ని. ఆ మాటతో ఎక్కడ లేని సంచలనమూ కలిగింది సభలో. దేవతా దర్శనాని కన్నట్లు ఒకరి నొకరు తోసుకుంటూ కారుదగ్గరకి పరుగెట్టారు. కాని, కారులోంచి దిగిన ఆ శ్యామలాంబను సగౌరవంగా ఆహ్వానించే అదృష్టం మూడు పట్టుచీరలకు, రెండు షిఫాన్ చీరలకు మాత్రమే దక్కింది. మిగిలిన వారు కుళ్ళుగా మొహాలు ముడుచుకుని చవిటి చిరునవ్వులు చిలకరిస్తున్నారు.

"మణిమాలగారు రాలేదా?" అడిగింది శ్యామలాంబ.

అప్పుడు వెళ్ళింది మణిమాల సగర్వంగా శ్యామలాంబ దగ్గరకి. తీయని చిరునవ్వుతో "మీకోసమే ఎదురుచూస్తున్నాం! రండి!" అని చెయ్యిపట్టుకుని లోపలకు తీసుకొచ్చింది.

ఇంతమంది ఆదరానికి పాత్రురాలైన ఆ శ్యామలాంబను కుతూహలంగా చూసింది లలిత.

దగ్గర దగ్గర యాభై యేళ్ళ పైగానే ఉంటాయి. పెద్దగా కాదు కాని ఆధునికంగానే అలంకరించుకుంది. వయసులో రూపవంతురాలే అయి ఉండాలి! చిరునవ్వు గడుసుగా ఉంది. చూపులు తీక్షణంగా ఉన్నాయి. కంఠస్వరం పరుషంగా లేదుగాని పదునుగా ఉంది.

'శ్యామలాంబ'. ఆ పేరు ఎక్కడో వింది. గుర్తొచ్చింది! రాగిణి, ఇంకా రాగిణిలాంటి వాళ్ళు మరికొందరు ఉండే సేవాసదనం నడిపే వ్యక్తి పేరు అదే! ఆ శ్యామలాంబ ఈ శ్యామలాంబ ఒకరేనా? ఛ! అయి ఉండదు! ఆ శ్యామలాంబ ఇందరి గౌరవాదరాలకు పాత్రురాలు కాగలదా?

మణిమాల శ్యామలాంబతో లలిత దగ్గర కొచ్చింది. "ఈవిడ మిస్ లలిత. మంచి వైణికురాలు!" అని పరిచయం చేసింది.

శ్యామలాంబ చూపులలో నిర్లక్ష్యం చిందిస్తూ చిరునవ్వులో సంస్కారం సూచిస్తూ తల ఊపులో ఆధిక్యం ప్రకటిస్తూ లలిత చేసిన నమస్కారం అందుకుంది.

మహిళా మండలి కార్యదర్శి అతి వినయంగా శ్యామలాంబ దగ్గిర కొచ్చి "మా చేతిపనుల ప్రదర్శన చూడరూ?" అని ప్రార్థిస్తున్నట్లుగా మాట్లాడి తన బ్రతుకు ధన్యమవుతున్నట్టు అడుగులేస్తూ శ్యామలాంబను తన

వెంట తీసికెళ్ళింది.

అవకాశం దొరగ్గానే లలిత కుతూహలం అణచుకోలేక మణిమాలని "శ్యామలాంబగారంటే ఎవరు?" అని అడిగేసింది.

"అరె! శ్యామలాంబగారు తెలియదూ? చాలా ప్రముఖురాలు!"

"ప్రముఖురాలంటే ఎలా?"

"ఆవిడకు ఊళ్ళో గొప్ప గొప్ప వాళ్ళతో పరిచయాలున్నాయి. అధికారంలో ఉన్న వాళ్ళలో చాలామందిని తెలుసు. ఎవరికైనా ఏపనైనా సాధించి పెట్టగలదు. మూడు మేడలూ, నాలుగు కారులూ."

"ఎలా సాధిస్తుంది ఆవిడ ఏపనైనా?"

"అదా! ఆవిడ ఒక సేవాసదనం నడుపుతోంది. ఆ సేవాసదనంలో ఉండేది అనాథ స్త్రీలు కాదు. సీతకోక చిలుకలు! మన్మథ బాణాలు! వాళ్ళు సాధించి పెడతారు అన్ని పనులూ! ఇతరత్రా కూడా లావాదేవీలు ఉన్నాయనుకో."

లలిత శరీరం చల్లబడిపోయింది. ఆ శ్యామలాంబే, ఈ శ్యామలాంబ! అంతేకాదు! ఇక్కడ అందరికీ ఈ శ్యామలాంబ నడుపుతోన్న సేవాసదనం గురించి తెలుసు! అయినా అహ, కాదు, అందుకనే, ఆవిడనంతగా గౌరవిస్తున్నారు.

శ్యామలాంబ గౌరవార్థం టీపార్టీ ఏర్పాటుచేసారు. పార్టీ అయిపోగానే శ్యామలాంబ లేచి "నాకు పనుంది వెళ్తాను. క్షమించాలి!" అంది.

లలితను బలవంత పెట్టి తమ మహిళామండలి వార్షికోత్సవానికి వీణ వాయించడాని కాహ్వానించిన మణిమాల "రండి! నా కారులో డ్రాప్ చేస్తాను." అని శ్యామలాంబను వెంటపెట్టుకుని వెళ్ళిపోయింది. లలిత వీణ పూర్తిచేసిన అరగంటకి తిరిగొచ్చి "అయామ్ సారీ లలితా! నీ పాట వినలేకపోయాను. మరొక్కసారి ఇంటికి పిలిపించుకుంటాను." అంది నవ్వుతూ.

అంత దర్జాగా మణిమాల "నిన్ను ఇంటికి పిలిపించుకుంటాను." అన్నందుకు లలిత ఆశ్చర్యపోలేదు. అప్పటికే మణిమాల ఎవరో తెలుసుకుంది లలిత. ఆవిడ అసిస్టెంట్ పోలీస్ కమీషనర్ మాధవరావుగారి భార్య!

తన చుట్టూ ఎందరు మూగినా శ్యామలాంబ ప్రత్యేకించి మణిమాలను అడగటంలో అర్థం లేకపోలేదు! మాధవరావు! ఏదో హుందాతనమూ, గాంభీర్యమూ ఉట్టి పడేనిండైన విగ్రహం! 'లోకంలో అంతటా అన్యాయమే ఉండదు!' అని అదలిస్తోనే అభయమిస్తున్నట్లు మాట్లాడగలి

గిన వ్యక్తి.

తన తమ్ముడు మోహన్ జాడ తెలుసుకోవటానికి సహాయపడగలడా? తన తమ్ముడు ఏ అన్యాయమూ చెయ్యలేదని అర్థంచేసుకో గలిగితే అతనొక్క దారికి తేవటానికి ప్రయత్నించగలడా?

మోహన్ విషయంలో తనదే తప్పేమోనని ఆరాటపడే లలిత మనసు మణిమాల ప్రదర్శించే కొద్దిపాటి అహంకారాన్ని అతి తేలిగ్గా సహించగలిగింది.

మహిళామండలి సభ్యులంతా కులాసా కబుర్లలో పడిపోయారు. రకరకాల 'నాగరిక' విషయాలు సంభాషణలలో దొర్లిపోతున్నాయి.

"విన్నారా? తిరుపతి వెంకటేశ్వరస్వామి రథం కిందపడి ఎందరో చచ్చిపోయారట!"

"ఏదైనా అంటే మహాత్మ్యమంటారు! ఇదంతా ఆ స్వామి మహాత్మ్యమే కాబోలు!"

"పూజించే మూర్ఖులున్నంతవరకు అందరూ దేవుళ్ళే! ప్రతీదీ మహాత్మ్యమే!"

"నో! నో! నా కిలాంటి మహాత్మ్యాలలో నమ్మకంలేదు!"

"నా కసలు దేవుడంటేనే నమ్మకంలేదు!"

"బైదిబై మళ్ళీ సుధామయి సీరియల్ వస్తోంది చూసావా?"

"చూసాను. చాలా ఇంటస్ట్రింగ్ గాఉంది కదూ!"

"ఏమిటండీ, ఒకి పగటికలలు! బ్రిలియంట్ గా ఉండవు. రచనలంటే రాధారాణివి. ఆవిడ నిజంగా జీనియస్. ఒరిజనాలిటీఉన్న రచన..."

"అవునవును. నాకు రాధారాణి రచనలంటేనే ఎడ్మిరేషన్. సుధామయీ వగైరా, వగైరా అంతా కాలక్షేపం బఠాణీలు .."

"సినిమాస్టార్ తారాదేవి తన రెండో మొగుడికి విడాకు లిచ్చిందట తెలుసా?"

"ఏమిటేవిటి? ఇద్దరు పిల్లల్ని పెట్టుకుని .."

"ఆ ఇద్దరు పిల్లల్లో ఒకడు మొదటి మొగుడి కొడుకుట!"

"ఏ మొగుడి కొడుకయితే నేం లే! ఎవరి కొడుకులో ఎవరు చెప్పగలరు?"

ఆ అత్యద్భుతమయిన జోక్ కి అందరూ పరమానందంగా పొంగి పొంగి నవ్వారు.

లలిత లేచి "నేను వెళ్తాను" అంది.

శ్యామలాంబను కారులో దింపటానికి పోటీలుపడ్డ ఆ మహిళా

మణుల్లో ఏ ఒక్కరూ లలితను దింపటానికి ముందుకు రాలేదు. కార్యదర్శి "కూచోండి! టాక్సీని పిలిపిస్తాను" అంది కొద్దిపాటి విసుగుతో.

మణిమాల కెందుకో లలితమీద ఆదరం కలిగింది

"నేను డ్రాప్ చేస్తాను. రండి!" అని లలితను తన కారులో ఎక్కించుకుంది. ఆ కారులో ఇంకా మణిమాల స్నేహితు లిద్దరు కూడా ఉన్నారు.

కారు కదలగానే లలితను పూర్తిగా మరిచిపోయి వాళ్ళు కబుర్లలో పడిపోయారు.

"ఏంయ్ మణీ! ఏమిటోయ్! తిరుపతి వెంకన్నంటే నమ్మకం లేదనే సావ్? నిజంగా నమ్మకం పోయిందా?"

మణిమాల నవ్వింది మణిమాలనవ్వు అందంగానే ఉంటుంది కానీ అందులో ఏదో నిర్లక్ష్యపుధోరణి.

"అదేం కాదు కానీ..."

"మరి, అలా వాదించావ్."

"ఏం చెయ్యను? ఈ రోజుల్లో దేవుడంటే నమ్మకం లేదనటమే కల్చర్! నాకు భక్తంటే నవ్వుతారు! ఏం చెయ్యను? నమ్మకం లేదనే సాను!"

లలిత ఆశ్చర్యంగా విని "ఇంతకూ మీకు నమ్మకంఉందా? లేదా?" అని అడిగేసింది.

మణిమాల మళ్ళీ ఎప్పటిలాగే నవ్వింది.

"ఏమో పోనీలే! ఎందుకయినా మంచిది, తిరుపతికి ఒక ట్రిప్ కొట్టివస్తే సరిపోతుంది."

"నేను వస్తాను. ట్రెయిన్‌లోవెళ్దాం!" అంది స్నేహితురాలు.

"ఓ. కె. స్పెషల్ అర్చనలో ఏవో ఉంటాయిగా! అవేవో చేయిస్తే త్వరగా బయటపడతాం! చకచక దర్శనం ముగించుకుని అక్కడ్నుంచి మద్రాస్ కెళ్ళి సరదాగా వారంరోజులు గడిపివద్దాం!"

ఆ సంభాషణంతా వింటూ బ్రమ న్పడిపోయి కూచుంది లలిత.

తన స్నేహితులను వారివారి ఇళ్ళదగ్గరదింపాక "మిస్. లలితా! డాక్టర్ వినోద్‌ని ఒకసారి కలుసుకోవాలి! ఆ తరువాత మీ ఇంటిదగ్గర డ్రాప్ చేస్తాను. అభ్యంతరం లేదుగా!" అంది మణిమాల.

త్వరగా ఇంటికి వెళ్ళాలనిఉన్నా, ఆ మాట అనలేకపోయింది లలిత. డాక్టర్ వినోద్ పేరుపొందిన సర్జన్. సర్జన్‌తో మణిమాలకేం అవసరమో!

మణిమాల కారు వినోద్ భవనంముందు ఆగింది. మూడంతస్థుల మేడ.

మణిమాల కారు హారన్ వింటూనే లోపలినుండి ఒక యువకుడు గబగబ కారు దగ్గరకువచ్చాడు. మణిమాల సంభ్రమంగా "వినోద్!" అని పలుకరించడాన్నిబట్టి అతడే డాక్టర్ వినోద్ అనుకుంది లలిత. వినోద్ మణిమాలను చెయ్యిపట్టుకుని లోపలకు తీసికెళ్ళాడు. వాళ్ళిద్దరూ లలిత అక్కడ ఉన్నట్లు ఏమాత్రం లక్ష్య పెట్టకుండా మాట్లాడుకోసాగారు.

వాళ్ళ నవ్వులూ, వేళాకోళాలూ, వెక్కిరింతలూ, లలిత భరించలేక పోయింది. మణిమాల గారాబంపోవటమూ, వినోద్ మణిమాల భుజంమీద చెయ్యివేసి బుజ్జగిస్తున్నట్లు బ్రతిమాలటమూ, చాలా ఎబ్బెట్టుగా తోచింది. మణిమాలనీ, మణిమాల కారును వదిలి పారిపోవాలనిపించింది. ఏంచెయ్య లేక కూలబడింది. దగ్గరదగ్గర ఒకగంట గడిచిన తరువాత వదలలేక వదల లేక వినోద్‌ను వదిలి బయలుదేరింది మణిమాల.

ఆ రోజు మహిళామండలిలో అడుగుపెట్టిన దగ్గరనుండీ ఏదో అద్భుతలోకంలో ఉన్నట్లేఉంది లలితకి. ఏమిటీలోకం? ఇక్కడున్నదంతా నిజంగా ఆనందమేనా? లలితను ఇంటి దగ్గర దింపి "మరోసారి మా ఇంటికి తప్పకుండా రావాలి మీరు. మా వారికి కూడా సంగీతమంటే ఇష్టం" అంది మణిమాల. లలిత తల ఊపింది.

# 6

"రాగిణీ! బాపినీడుగారు ట్రంకాల్ చేసారు. నువ్వు వెంటనే విమానంలో ఢిల్లీ వెళ్ళాలి!" అంది శ్యామలాంబగారు.

సేవాసదనంలో అందరూ రాగిణిని ఈర్ష్యగా చూశారు. ఇలాంటి 'ఛాన్స్'లు సాధారణంగా రాగిణికే వస్తాయి. ఆ చూపులకు సగర్వంగా నవ్వుకుంది రాగిణి.

వెంటనే ఎందుకో లలిత గుర్తొచ్చింది. ఇంతమంది కళ్ళలో తనను చూసి ఈర్ష్య... కానీ లలిత కళ్ళలో మాత్రం తనను చూసి జాలి! ఎందుకు? చూడాలి. లలిత కళ్ళలోను తనపట్ల ఈర్ష్య చూడాలి! తన సౌభాగ్యం చూసి, తన అదృష్టం చూసి... లలిత విస్తుపోవాలి! 'నేనే పొరపడ్డాను. రాగిణి హాయిగా జీవిస్తోంది!' అనుకోవాలి! 'ఈ ఐశ్వర్యం నాకు కావాలనుకున్నా రాద'ని నిట్టూర్చాలి!

కారులో వెళ్ళి, విమానంలో కూర్చుంది రాగిణి.

"ఈ కారు, ఈ విమానం .. లలిత ఈ జన్మలో అనుభవించ గలదా ఇలాంటనుభవాన్ని?"

ప్రతిక్షణమూ లలిత తనకెందుకు గుర్తొస్తుందో అర్ధంకాదు రాగిణికి.

ఢిల్లీ విమానాశ్రయానికి బాపినీడుగారు కారు పంపారు.

బాపినీడుగారు రాగిణిని పరిశీలనగా చూస్తూ "నువ్వు కొంచెం

లావయ్యావు!'' అన్నాడు.

రాగిణి చిన్నబోయింది. తనను తాను చూసుకుంది. తనకేమీ తెలియటంలేదు. బాపినీడుగారు విసుగ్గా ''సరేలే! అవన్నీ తరువాత. ఇవాళ నువ్వు ఒక ఇంపార్టెంట్ గెస్ట్‌ని యెంటర్‌టెయిన్ చెయ్యాలి. జాగ్రత్త! ఆయన స్పెషల్ పోలీస్ ఆఫీసర్!'' అన్నాడు.

రాగిణి కెందుకో భయంవేసింది. అంతకంటే వివరాలు రాగిణికి తెలియవు. తెలియ నివ్వరు! ఆ పోలీస్ ఆఫీసర్ ఎవరు? ఎలాంటి ఆఫీసర్? అతనికీ, బాపినీడుకీ ఉండే లావాదేవీ లేమిటి? ఇవన్నీ రాగిణికి ప్రశ్నలే! సమాధానంకోసం రాగిణి కూడా పెద్దగా ఆలోచించని ప్రశ్నలు.

ఆ పోలీస్ ఆఫీసర్‌ని చూడగానే రాగిణివంట్లో జవసత్వాలొక్క సారిగా నశించిపోయినట్లయింది. అతని ప్రక్కనే ఒక ఆల్‌సేషియన్ డాగ్. అహర్నిశమూ అది అతని ప్రక్కన ఉండవలసిందే! ఆ కుక్కకు అతనికి పెద్ద తేడా కనిపించలేదు రాగిణికి. యాభైపైనే ఉంటుంది వయసు.

మత్తెక్కిన కళ్ళతో రాగిణిని చూస్తూ ''బాపినీడు గొప్పగా చెప్తే ఏమో అనుకున్నాను. జస్ట్ ఏవరేజ్!'' అన్నాడు.

రాగిణి ముఖం మాడ్చుకోలేదు. అభిమానపడలేదు. చిరునవ్వుతో దగ్గరకు నడిచింది,

ఇప్పుడు చూపించాలి తన ప్రభావాన్ని! 'ఏవరేజ్!' అన్న నోటితో 'ఎక్సలెంట్' అనిపించాలి! అందుకే ప్రత్యేకించి బాపినీడుగారు తనను పిలిపించింది!

రెండు నిమిషాల్లోనే అసలు విషయం అర్థమయిపోయింది రాగిణికి. ఆ ఆఫీసర్‌కి మనసులో పట్టరాని లాలస. శరీరానికి ఆ శక్తిలేదు. శక్తిలేని శరీరం ఊరుకోదు. మనసు ఊరుకోనియ్యదు. పర్వర్షన్స్ భరించాలి!

ప్రేమ! 36''-28''-36'' అంగుళాలలో కొలుచుకునే ప్రేమ! కృత్రిమపు కులుకుల్లో తొణికిసలాడే ప్రేమ! పచ్చి అబద్ధాల ప్రణయ సల్లాపాల్లో పవిత్రమయ్యే ప్రేమ! పాశవిక ప్రవృత్తుల తీరాన్నంటే ప్రేమ! ఆ ప్రేమ జలధిలో ఓలలాడి ఓలలాడి ఆపాదమస్తకమూ భగ్గుమని పించే జుగుప్సలాంటి భావాన్ని బలవంతాన అణచిపెట్టి చిరునవ్వుతో బాపినీడుగారి దగ్గరికొచ్చింది రాగిణి.

''వెల్‌డన్! ఆ ముసలి పీనుగుని బాగానే మురిపించావు.''

దగ్గిర దగ్గిర అరవై ఏళ్ళుంటాయి బాపినీడుకి! ఆఫీసర్ని ముసలి పీనుగంటున్నాడు. తనకు అరవై ఏళ్ళున్నా తాను నవయువకుడిలా ఉంటాడని బాపినీడు నమ్మకం. అతడు డబ్బిచ్చి పిలిపించుకునే స్త్రీలూ, అతని క్రింద డబ్బు తీసుకుని పనిచేసే రాగిణిలాంటి వాళ్ళూ అతనికా

నమ్మకం కలిగించారు. ఇంట్లో అతని భార్య ఏమీ మాట్లాడదు! ముసలి రూపు పడిపోయిన ఆవిడను చూడాలంటే బాపినీడుకి భయం.

రాగిణిని చూస్తూ ఆదరంగా చెయ్యిజాపాడు బాపినీడు. చిరునవ్వులు చిందిస్తూ సిగ్గుపడుతూ ఆ చేతుల్లోకి వచ్చింది రాగిణి. అతి ప్రేమగా ముడతలుపడ్డ చెక్కిళ్ళు నిమిరింది,

"నువ్వు లావయిపోతున్నావు. డయటింగ్ చెయ్యాలి!" గుండ్రంగా ఉన్న చేతివంక నిరసనగా చూస్తూ మందలిస్తున్నట్లు అన్నాడు.

చిరునవ్వుతోనే తల ఊపింది రాగిణి.

అద్దంలో తనను తను చూసుకుంటూ చిరునవ్వుతో "నాకు కొంచెం బొజ్జ వచ్చినట్లుంది." అన్నాడు బాపినీడు.

"ఏం రాలేదు! మీరు ఏ అమృతం తాగుతున్నారో? నాకంటె చిన్నపిల్లాడిలా కనిపిస్తున్నారు."

అతణ్ని ముగ్ధురాలై చూస్తూ అంది రాగిణి.

"అహ్హహ్హ!" అంటూ గట్టిగా నవ్వాడు బాపినీడు. విమానందిగి, కారులో తిరిగి సేవాసదనానికి వస్తున్నప్పుడు కొత్తగా తన మెడలోకి వచ్చి చేరిన పచ్చల నెక్లెస్‌ని సంతృప్తిగా తడిమి చూసుకుంది రాగిణి. లోలోపల ఏదో బరువుగా చీదరగా సలుపుతోంది! అదంతా లోపల మగ్గిపోవలసిందే! పైకి కనపడదుగా! పైకి కనపడేది పచ్చల నెక్లెస్!

లలితకు వైణికురాలిగా పేరు ప్రఖ్యాతు లొస్తున్నాయి. ఒక ఆఫీసర్స్ క్లబ్‌లో లలిత వీణ కచేరి ఏర్పాటు చేశారు. ఆ సంగతి తెలుసుకున్న రాగిణి తనూ బయలుదేరింది. అతి శ్రద్ధగా అలంకరించుకుంది. ఏ సరసుణ్ని రంజింప చేయటానికీ రాగిణి అంత శ్రద్ధగా అలంకరించుకోలేదు.

"ఈ చీర ఎంత బాగుందో? ఎక్కడ కొన్నావ్?"

"ఈ జరీవర్క్ నువ్వే చేసావా? చేయించావా?

"నెక్లెస్, దుద్దులు, గాజులు, రింగ్, అన్నీ చక్కగా సూట్ అయ్యాయి. ఎక్కడ చేయించావు? చాలా ఖరీదు ఉంటుంది కదూ!"

చుట్టూ జేరిన యువతీ బృందం ఈర్ష్యతో, దాహంతో, తనను ఇలా ప్రశ్నిస్తోంటే సంతృప్తిగా తనను తను చూసుకుంది రాగిణి.

హాల్లో కూచున్నాక కూడా చుట్టుప్రక్కల చాలామంది ఆడవాళ్ళు తన చీరవంకా, నగలవంకా, అలంకరణ వంకా, ఒకటికి రెండుసార్లు పరిశీలనగా చూడడం ఎంతోహాయి నిచ్చింది రాగిణికి.

లలిత వీణ కచేరి మొదలయింది. ఆ హాల్లో రాగిణికి "పరిచయం" ఉన్న ఆఫీసర్లు అయిదారుగురున్నారు. వాళ్ళంతా రాగిణి తమను ఎక్కడ పలకరిస్తుందో నన్నట్లు భయపడుతూ బిగుసుకుపోయి ముఖాలు తిప్పుకో

వటం గమనించి తనలో తను నవ్వుకుంది రాగిణి. ఆవిడ మనసు లలిత వీణానాదంలో లీనమయి పరవశించటంలేదు. కళ్ళు లలితనే పరిశీలనగా చూస్తున్నాయి. వెంకటగిరి జరీచీర కట్టుకుంది. మెడలో సన్నని ఒంటి పేట గొలుసు, బొట్టు, కాటుకను మించి మరే అలంకరణాలేదు. మనిషి అందమా చెప్పటానికి లేదు. ముఖంలో ఏదో విషాదం దోబూచులాడుతోంది.

'పాపం! రాజు నింకా మరిచిపోలేదులా ఉంది!' తనలో తనే నవ్వుకుంది రాగిణి.

లలిత వీణానాదం పూర్తికాగానే ఆవిడను చాలామంది అభినందించారు. రాగిణికి పరిచయమున్న ఒక ఆఫీసర్ కూడా లలితను అభినందిస్తూ మాట్లాడుతున్నాడు.

తనను చూచి భయంతో ముఖం తిప్పుకున్న ఆఫీసర్! రాగిణి కెక్కడో కలుక్కుమంది, శ్యామలాంబా బాపినీడుగార్ల కఠినమైన ఆదేశాల ననుసరించి తమలో ఎవరూ బయట ఎక్కడా తమకు పరిచయస్తులైన ఆఫీసర్లను పరిచయమున్నట్లుగా పలకరించకూడదు. కానీ లలితను పలకరించచ్చు!

రాగిణి చకచక లలిత దగ్గిరకెళ్ళి భుజలమీద చెయ్యివేసి "హలో! లలితా! బాగున్నావా?" అంది అందమైన చిరునవ్వుతో.

రాగిణి అనుమానించినట్లు లలిత ముఖం చిట్లించుకోలేదు. రాగిణిని తప్పించుకోవటానికి ప్రయత్నించలేదు.

"హలో! బాగున్నాను. నువ్వు బాగున్నావా?" అంది ప్రసన్నంగా.

రాగిణి అక్కడికి రాగానే అంతవరకు లలితతో మాట్లాడుతున్న ఆఫీసర్ కంగారు పడిపోయాడు. తడబడుతూ "ఈవిడెవరు?" అన్నాడు.

"చిన్నప్పటి స్నేహితురాలు! ఒకప్పుడు ఇరుగుపొరుగున ఉండేవాళ్ళం!" అంది లలిత.

రాగిణి వచ్చాక అక్కడ నిలవడం ఆఫీసరుకు కష్టమయిపోయింది.

"నేను వెళ్తున్నాను. మీకు అభ్యంతరం లేకపోతే, మీ ఇంటి దగ్గిర డ్రాప్ చేస్తాను." అన్నాడు లలితతో, రాగిణి వంక చూడకుండా.

"నో! థాంక్స్! ఇక్కడి కార్యకర్తలు వాళ్ళ కారులో నన్ను ఇంటికి పంపిస్తారు!" వినయంగా అని నమస్కారం చేసింది లలిత.

ఆ ఆఫీసర్ కూడా నమస్కారం చేసివెళ్ళిపోయాడు.

కొంచెం సేపట్లోనే కార్యదర్శివచ్చి "మేడమ్? మీకోసం కారు వచ్చింది. వస్తారా?" అన్నాడు లలితతో.

లలిత పక్కనే ఉన్న రాగిణిమీద అక్కడి యువకుల చూపులు తారట్లాడాయి.

"ఆవిడెవరు?"

"శ్యామలాంబగారి సేవాసదనంలో శీతాకోకచిలుక!"

"ఓహ్!"

ఈ గుసగుసలు రాగిణికి వినిపిస్తున్నాయి.

"ఓహ్!" అనడంలో నిరసన కూడా స్పష్టంగానే తెలుస్తోంది.

"వెళ్ళొస్తాను రాగిణీ!" అని లలిత వెళ్ళిపోయింది.

లలితకు ఆ రోజు వాళ్ళిచ్చిన పారితోషికం రెండువందల రూపాయలు మాత్రమే! తన విలువ ఒక్క రాత్రికి అయిదువందలు! కొన్ని సందర్భాల్లో ఇంకా ఎక్కువ! రెండువంద లెక్కువా? అయిదువంద లెక్కువా? అయిదే ఎక్కువ! లలితకంటే తనే ఎక్కువ! అవును! తనే ఎక్కువ! తప్పకుండా ఎక్కువ!

# 7

మణిమాల లలితను తమ ఇంటికి రమ్మని ఆహ్వానించింది. ఆ ఆహ్వానం సంతోషంగా అంగీకరించింది లలిత. ఆమె అంతరాంతరాల్లో మిణుకు మిణుకుమంటున్న ఆశ! మాధవరావుగారి ద్వారా మోహన్ జాడ తెలుస్తుందేమోనని!

అందంగా ఉన్న డ్రాయింగ్ రూంలో అంతకంటె అందంగా ఉన్న మణిమాల ముచ్చటగా కనిపించింది లలితకి.

"మీరు అదృష్టవంతులు!" అంది మనసారా అభినందిస్తూ.

"ఇదేం అదృష్టం!" చికాగ్గా అంది మణిమాల.

ఆశ్చర్యంగా చూసే లలితను ఎవరో అడవిమనిషిని చూసినట్లు చూసింది.

"నీ కసలేం తెలియదు! మాధవ్ మరీ ఇంత మడికట్టుకునే మనిషి కాకపోతే మేమూ గొప్పగానే ఉండేవాళ్ళం! భాస్కరరావుగారికి చూసావా? రెండు బంగళాలు! ఎయిర్ కండిషన్డ్ - రూంలు! మిసెస్ భాస్కరరావు ప్రత్యేకించి కాశ్మీరులో సమ్మర్ కాటేజ్ కట్టించుకుంది. మిసెస్ శోభాదేవి ఎప్పుడెక్కడికి కదిలినా ప్లెయిన్ లోనే! ఆవిడ చీరలు చూడలేదు నువ్వు. ప్రత్యేకించి, ఆర్డరిచ్చి బొంబాయిలో ఎంబ్రాయిడరీ చేయిస్తుంది! మిసెస్ ఆశాలత ఎప్పుడూ .."

లలితకు అర్థమయిపోయింది! నిరుపేదగా అవస్థలు పడలేక పినతల్లి పెంపకంలో మమతను నోచుకోలేక రత్నమ్మ రాగిణిగా మారి దేనివెంట పరుగులెత్తుతూ ఆనందం వెతుక్కోవాలనుకుంటుందో, అసిస్టెంట్ పోలీస్ కమిషనర్ భార్య... సంపన్న గృహిణి... విద్యావంతురాలు, సభ్య సమాజంలో మన్నన లందుకోగలిగిన సంస్కారిణి... మణిమాల కూడా

దానివెనుకనే పరుగులెత్తుతోంది! అదే ఆనందం అంగుక్కోవాలని ఆరాట పడుతోంది!

లలిత ఎక్కువసేపు నిరీక్షించవలసిన అవసరం లేకుండానే మాధవ్ వచ్చేసాడు. మణిమాల లలితను పరిచయం చేసింది. మాధవ్ లలితను చూసి వెంటనే "మిమ్మల్ని ఎక్కడో చూసాను! ఆ! రైట్! మీ తమ్ముణ్ని విడిపించమని అడగటానికి వొచ్చారు!" అన్నాడు.

లలిత సంకోచంతో తల వంచుకుంది.

"అబ్బ ఎంత గుర్తు! పోలీస్ ఆఫీసర్!" అంది మణిమాల నవ్వుతూ.

"ఏం జరిగింది? మీ తమ్ముడు విడుదలయ్యాడా?" యధాలాపంగా అడిగాడు మాధవ్! అతని కంఠంలో నిరసనా లేదు, ఆదరమూ లేదు.

"ఆ! కాని .." లలిత మాటలు పూర్తికాకుండానే కారు దిగి లోపలికి వచ్చింది రాగిణి.

రాగిణిని చూసి లలిత ఎంత ఆశ్చర్యపోయిందో, లలితను చూసి రాగిణి కూడా అంత విస్తుపోయింది.

"ఎక్స్యూజ్ మి!" అని ఏ ఒక్కరికీ నోరు మెదిపే అవకాశం కూడా ఇయ్యకుండా రాగిణిని తీసుకుని తన ప్రైవేట్ రూంలోకి వెళ్ళి పోయాడు మాధవ్.

మాధవరావుగారు! నిజాయితీపరుడని మణిమాల పొగుడుతోన్న మాధవరావుగారు కూడా ఇంతేనా? ఇంతటి శక్తి ఉందా '36"-28"-36" కి? మణిమాల నిట్టూర్చింది!

రాగిణితో మాధవరావుగారు అలా తన కళ్ళముందు వెళ్ళిపోతే మణిమాలకు బాధగా లేదా? ఏమీ పట్టించుకోదా?

ఫోన్ మ్రోగింది. మణిమాల వెళ్ళి మాట్లాడి వచ్చింది. "ప్లీజ్! లలితా! ఏమీ అనుకోకండి! డాక్టర్ వినోద్ అర్జంటుగా రమ్మన్నాడు! పదినిముషాల్లో వచ్చేస్తాను. ఉంటారుగా! నేను రాగానే డ్రాప్ చేయిస్తాను." నొచ్చుకుంటున్నట్లుగా అని హడావుడిగా వెళ్ళిపోయింది. ఆయన అలాగ! ఈవిడ ఇలాగ! కొన్ని కొన్ని సంసారాల్లో భార్యాభర్తలిద్దరకు ఎవరి స్నేహితులు వాళ్ళకుంటారనీ, ఇద్దరిలో ఏ ఒక్కరూ ఆ స్నేహాల గురించి పట్టించుకోకుండా హాయిగా సంసారాలు చేస్తారనీ వింది. ఇంచుమించు ఇలాంటి సబ్జెక్ట్ మీదే గోపీచంద్ 'ప్రేమోపహతులు' వ్రాసారు! ఈ సంసారం కూడా అలాంటిదేనా?

వీణ వింటాం రమ్మని ఆహ్వానించి భర్త అటు, భార్య ఇటు వెళ్ళి పోయారు. ఏ కళాకారుణికైనా ఇంతకంటె అవమానం ఉండదు. ఏం మనుష్యులు? ఎలా అర్థం చేసుకోవాలి ఈ మానవప్రవృత్తిని? ఎంత అయో

మయంగా కనిపిస్తోంది జీవితం!

ఎవరూ వినకపోతేనేం! తనే వీణ వాయించుకొంటే? మణిమాల వచ్చేవరకూ ఎలాగూ తను వెళ్లటానికి వీలులేదు.

వీణ శ్రుతిచేసుకుని తనను తను మరిచి వాయించుకోసాగింది లలిత.

మణిమాల కారు దిగి లోపలికి వచ్చేవరకూ అలా వాయిస్తూనేఉంది. మణిమాలను చూసి ఆపుచేసింది.

ఆశ్చర్యంగా లలితను చూస్తూ "అరె! ఆ కన్నీళ్లేమిటి?" అంది.

లలిత సిగ్గుపడుతూ కళ్ళు తుడుచుకుని "అప్పుడప్పుడు, వీణలో లీనమయినపుడు, నాకిలా కళ్ళనీళ్ళు తిరుగుతుంటాయి. విశేషమేం లేదు!" అంది.

డ్రాయింగ్ రూంలోంచి బెడ్ రూంలోకి వెళ్ళడానికి కర్టెన్ ఒత్తిగించిన మణిమాల మరోసారి విస్తుపోయింది.

"మాధవ్! నువ్వీ గదిలోకి ఎప్పుడొచ్చావ్! నీ కళ్లలోనూ నీళ్ళు."

మణిమాల మాటలతో ఆ గదిలో కుర్చీలో కూర్చున్న మాధవరావును చూసి బిడియపడింది లలిత. మధ్య తెర అడ్డుగా ఉండటంవల్ల, మనసంతా సంగీతంలో లీనం కావటంవల్ల అతనెప్పుడొచ్చాడో లలిత గమనించనే లేదు.

మాధవరావు తన జేబులోనుండి రుమాలుతీసి కళ్ళు తుడుచుకుని నవ్వాడు. "కష్టాలు ఎదుర్కోగలను! చికాకులను తట్టుకోగలను. కానీ ఏవో అదృశ్యతరంగాలు నా అంతరాంతరాలు స్పృశించి నన్ను నాముందు నిలపటానికి ప్రయత్నిస్తోంటే కదిలిపోయాను. ఈ రకమైన కన్నీళ్ళలో ఒక రకమైన సౌఖ్యంఉంది. అది వదులుకోలేక పోయాను"

మాధవరావు మాటలు విని ఆశ్చర్యపోయింది లలిత. రాగిణిని చూడగానే వెంటబెట్టుకుని వెళ్ళిపోయిన వ్యక్తి నోట ఇటువంటి మాటలు!

ఇంటికి వెస్తూ దారిపొడుగునా ఈ విషయమే ఆలోచించింది! 'మనుష్యులంతా ఇంతే! కథల్లో మాత్రమే మూసపోసిన వ్యక్తిత్వాలతో కనిపిస్తారు,' అనుకొంది.

# 8

మణిమాల కారు తమ ఇంటిముందు ఆగటం చూసి లలిత చాలా చికాకుపడింది! జీవితంలో తనకు అందుబాటులో ఉన్న అన్నింటితోనూ ఆడుకోవటం మణిమాల స్వభావం కాబోలు! తనను కూడా అలా ఒక పావులా వాడుకోవాలనుకుంటోందా?

కానీ కారులోంచి మాధవరావు దిగాడు. లలిత తబ్బిబ్బుపడి పోయింది. మాధవరావు తన ఇంటికి వచ్చాడు!

"మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యటంలేదు గదా!"

చిరునవ్వుతో అడిగాడు మాధవరావు. లలిత కంగారుగా "ఏం లేదు! రండి! రండి!" అంటూ ఆహ్వానించింది. ఒక్కసారి ఆ ఇంటి వాతావరణం పరిశీలించాడు మాధవరావు. వెంకట్రావు ముందుగదిలో మూలుగుతూ పడుకుని గొణుగుతున్నాడు! జానకి లోపలి గదిలో కళ్ళు మూసుకుని పడుకుని ఉంది. ఉన్నదాన్లో ఉన్నంతగా నాలుగు కుర్చీలువేసి ఒక డ్రాయింగ్ రూం ఏర్పాటుచేసింది లలిత. అక్కడే మాధవరావును కూర్చోబెట్టింది.

"మీరు మా ఇంటికి వచ్చినప్పుడు మీ వీణ వినలేకపోయాను. ఎప్పుడూ పని పని. ఇవాళ నేనే మీ వీణ వినటానికి మీ ఇంటికివచ్చాను."

తనకు అలవాటయిన గంభీర స్వరంతో అన్నాడు మాధవరావు. ఆ స్వరం తనను ఆజ్ఞాపిస్తున్నట్లుగా తోచి మాట్లాడలేదు లలిత.

"ఇవాళ నాకు చాలా అలసటగా ఉంది. కొంచెం రిలీఫ్ కావాలనిపించింది. వెంటనే మీ ఇంటికి వచ్చేసాను. నేను కోరగానే మీరు వీణ వినిపించగలరా? అనుకోకపోలేదు. కానీ, కళాకారులు కఠినంగా ఉండరనే ధైర్యంతో వచ్చేసాను."

లలిత కాదనలేకపోయింది. గాంభీర్యంతోపాటు అతనిలో కనిపించే ఒక రకమైన నిష్కపటధోరణి లలితలో గౌరవభావాన్ని కలిగించింది. వీణ ముందు కూర్చుని వీణ శ్రుతి చేసింది. వీణ వింటూ కుర్చీలో వెనక్కివాలి కళ్ళు మూసుకున్నాడు మాధవరావు.

అతనికి సంగీతమంటే ఎంత ఇష్టమో అర్థమయింది లలితకి.

లలిత వీణ పూర్తిచేసేసరికి వెంకట్రావు బయటి గదిలోనుండి లోపలికి తొంగితొంగి చూస్తున్నాడు. ఆ దృశ్యం కంటపడే సరికి మనసు భగ్గుమంది లలితకి! ఏ విషయమైనా తమ దృక్పథంలోంచి మాత్రమే చూడగలరు మనుష్యులు! మాధవరావు ఏ మనుకుంటాడో ననుకునే సరికి జుగుప్సతో శరీరం జలదరించినట్లయింది! వెంకట్రావు అలా తొంగితొంగి చూడటం మాధవరావు గమనించనే గమనించాడు!

"ఆయన ఎవరు?" అని అడిగేసాడు.

"మా నాన్నగారు!" గొంతు కేదో అడ్డుపడుతున్నట్లుగా సమాధాన మిచ్చింది...

"మీ తమ్ముడేం చేస్తున్నాడు?"

"ఏం చేస్తున్నాడో తెలీదు. ఎక్కడున్నాడో, అసలే తెలీదు."

"అదేమిటి?"

"వాడు జైలునుండి విడుదలయ్యాక ఉద్యోగం దొరకటం మరీ కష్టమయింది. ఆ చికాకు భరించలేక ఇంట్లోంచి వెళ్లిపోయాడు, ఆ తర్వాత

వాడి సంగతి ఏమీ తెలియలేదు.''

''అరె! అతని ఫోటో ఏదైనా ఉంటే ఇవ్వండి. ఎక్కడున్నాడో తెలుసుకోవటానికి ప్రయత్నిస్తాను!''

లలిత పొంగిపోయింది. సరిగ్గా ఈ సహాయం కోరటానికే లలిత మణిమాల స్నేహాన్ని ఆశ్రయించింది. మాధవరావును చూడగానే ఈ మాత్రం కూడా అడగలేకపోతోంది. కానీ, మాధవరావు ఫోటో కావాలంటున్నాడు.

''మోహన్ లేటెస్ట్ ఫోటో ఏదీ లేదు. చిన్నప్పటివే ఉన్నాయి!''

''అలా అయితే కొంచెం కష్టమే! పోనీ, అదే ఇవ్వండి.'' లలిత స్కౌట్ వేషంలో ఉన్న మోహన్ ఫోటో—హైస్కూల్ రోజుల్లోది తెచ్చిచ్చింది.

''ప్రయత్నిస్తాను. భయపడకండి! ఈ రోజుల్లో చాలామంది యువకులిలాగే గమ్యం తెలియకుండా పరిగెడుతున్నారు!''

లలిత ఇచ్చిన కాఫీ తాగి వెళ్ళిపోయాడు మాధవరావు.

మాధవరావు వచ్చేసరికి మణిమాల ఇంట్లోనే ఉంది. ఆవిడ అంతకు అరగంటకు ముందే వినోద్ దగ్గిరనుండి వచ్చింది. తను వినోద్ దగ్గర కెళ్తున్నట్లు చీటీ రాసిపెట్టే పోయింది. ఎప్పుడూ అలాగే వెళ్తుంది. సాధారణంగా అలాంటి సందర్భాల్లో మణిమాల ఇంటి కొచ్చేసరికి, మాధవరావు అశాంతిగా పచార్లు చేస్తూనో, నుదుటికి చెయ్యి అడ్డంగా పెట్టుకుని కనుబొమలు చిట్లించుకుని పడక్కుర్చీలో పడుకుని ఆలోచిస్తోనో, కనిపించేవాడు. అలాంటిది ఆరోజు మాధవరావు ఎక్కడినుండో రావటం— అంతేకాక అతని ముఖంలో కనిపిస్తోన్న వికాసం మణిమాలకు ఆశ్చర్యాన్ని కలిగించాయి.

''ఎక్కడ్నుంచి మాధవ్?''

''లలిత ఇంటిదగ్గిరనుండి! ఆవిడ వీణ విని వస్తున్నాను!''

మరింత ఆశ్చర్యపోయింది మణిమాల! ఎవరో సన్నిహితుల ఇళ్ళకే కాని వెళ్ళడు మాధవరావు. అతనికి సంగీతమంటే ఇష్టమని తెలుసుకాని...

చిరునవ్వు నవ్వుతూ ''ఓ!...'' అంది.

నవ్వుతోన్న మణిమాల ముఖంలోకి ఒక్కక్షణం చూసి ''ఓ, న, మా, లు, తెలియకుండా ''ఓ!'' అనుకుంటే ప్రయోజనం లేదు.'' అన్నాడు. మణిమాల పకపక నవ్వింది.

'''ఓ' తెలిసిందిగా! ఇక నామాలు, నామరూపాలు, క్రమంగా తెలుస్తాయి.'' అంది.

''అంత తేలికకాదు మణీ! అన్ని భాషల ఓ న మా లూ ఒక్కలా

ఉండవు. ఎవరి భాష వాళ్ళది!''

ఉదాసీనంగా అన్న మాధవరావు మాటల్లో వ్యంగ్యం అర్థమయినా సమాధానం చెప్పలేకపోయింది మణిమాల!

మిసెస్ భాస్కరరావు ద్వారా పరిచయమయ్యాడు డాక్టర్ వినోద్ మణిమాలకి. మిసెస్ భాస్కరరావు వర్ణించగలిగిన దీ డాక్టర్ వినోద్ ఐశ్వర్యాన్నే! మణిమాల చూడగలిగినదీ అతని ఐశ్వర్యాన్నే! అంతకుమించిన ప్రత్యేకత ఏమీ లేదు అతని వ్యక్తిత్వంలో. డాక్టర్ గా పేరు ప్రఖ్యాతు లార్జించాడు. ఎన్నో బ్రాంచ్ లున్నాయి. ఎందరో అసిస్టెంట్స్ పనిచేస్తున్నారు. మొదటి భార్య చచ్చిపోయింది. నడి వయసులో ఉన్నాడు. మణిమాలను చూడగానే ఆవిడ ఆకర్షణకు లోబడ్డాడు వినోద్. మొదట్లో మణిమాల పెద్దగా పట్టించుకునేది కాదు. కానీ, నలుగురిలో ఘనంగా కన్పించాలన్న కోరికా, ఆ కోరికలన్నీ తీర్చలేని మాధవరావు ఆర్థిక స్థితీ కారణంగా అతనికి సన్నిహితురాలయింది. వినోద్ తోటి స్నేహం విషయం తెలిస్తే తనకు మాధవ్ కు యుద్ధం తప్పదనుకుంది. పరిస్థితి అంతవరకూవస్తే మాధవ్ ను వదిలి వినోద్ దగ్గరకు వెళ్ళిపోవటానికే నిర్ణయించుకుంది. ఆ భరోసా వినోద్ ఇచ్చాడు.

కాని ఈ విషయం తెలిసే మాధవరావు ఏమీ మాట్లాడలేదు. ఆ గాంభీర్యం మణిమాలను మరింత భయపెట్టింది. వారిద్దరు విడిపోలేదు. కానీ ఒక ఇనుపతెర వాళ్ళ మధ్య పడిపోయింది.

అప్పటినుండీ మణిమాల వినోద్ కోరిక మన్నించి అతనితో కలిసి తిరక్క తప్పలేదు. వాళ్ళగురించి గుసగుసలు వ్యాపించాయి.

''ఎన్నాళ్ళీ ముసుగులో గుద్దులాట? వచ్చెయ్యి!'' అనేవాడు వినోద్.

మణిమాలకు ఈ వ్యవహారం నచ్చలేదు. అది వినోద్ మీద ప్రేమ కాదు. ఒకప్పుడు మణిమాల మాధవ్ ను ప్రేమించే పెళ్ళి చేసుకుంది. ఈనాడు అతణ్ని వంచించాలని మణిమాలకు లేదు. వినోద్ దగ్గరకు ఎప్పుడు వెళ్ళినా అతనికి చెప్పే వెళ్తుంది. అది మాధవ్ మనసుకు ఎలాంటి రంపపు కోతో తెలియక కాదు. మాధవ్ కోపం పట్టలేక వెళ్ళిపొమ్మంటే ఈ కపట నాటకంనుండి బయటపడి వెళ్ళిపోవాలని...

''నా అంతట నేను మాధవ్ ను వదిలి రాలేను! కానీ, అతడు వెళ్ళిపొమ్మన్న మరుక్షణం నీ దగ్గిరకి వచ్చేస్తాను.'' అంది వినోద్ తో.

ఈ మాటలంటున్నప్పుడు మణిమాల కంఠం ఎందుకు గద్గద మయిందో, ఆవిడ కంఠంలో అనురాగానికి బదులు ధ్వనించిన కసిలాంటిది ఎవరిమీదో అర్థంకాలేదు వినోద్ కి! అయితే ఇలాంటి అర్థంలేని విషయాలన్నీ

అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తూ బుర్ర పాడుచేసుకునే తత్వంకాదు అతనిది! అతనికి కావలసినది మణిమాల! మణిమాల సౌందర్యం!

## 9

మాధవరావు స్నేహితుడి కొక పూలతోట ఉంది. ఆ తోటలోకి పిక్నిక్‌కి వెళ్లటం మాధవరావు కెంతో ఇష్టం. పెళ్ళయిన కొత్తల్లో మణిమాలను తీసుకుని రెండు మూడుసార్లు ఆ తోటకి వెళ్ళాడు. కానీ, రాను రాను మణిమాల పిక్నిక్ అనేసరికల్లా ఆడా, మొగా తన స్నేహితులందరినీ పోగుచేసుకురావడంతో మాధవరావు విసుక్కుని తను వెళ్ళడం మానేసాడు. మణిమాల కారణమడిగితే "అంతమంది మధ్య నాకేం బాగుండదు! పోనీలే! నీకదే సరదా అయితే నువ్వెళ్ళు" అన్నాడు.

"మనం ఇద్దరం వెళ్దాం!" అని మణిమాల అంటుందేమోనని అతని ఆశ. అతని ఆశ అదని మణిమాలకు తెలుసు. అయినా మణిమాల ఆ మాట అనలేదు. మాధవరావు ఆ ప్రస్తావన మళ్ళీ తేలేదు.

మాధవరావుకు భోజనం వడ్డిస్తూ "రేపు మీకు డ్యూటీ లేదు గదూ!" అంది మణిమాల.

"లేదు!" అన్నాడు మాధవరావు పైకి తేలకపోయినా లోలోపల కొంచెం ఆశ్చర్యపోతూ ఇటీవల తమ మధ్య ఇలాంటి సంభాషణ రావటం లేదు.

"అయితే, రేపు, మీరు, నేను, లలితా పూలతోటకి కెళ్దాం!" అంది మణిమాల.

సాధారణంగా తన మనసులో భావాలు బయటపడనీయని మాధవరావు ముఖం ఒక్కసారిగా వికసించింది.

"సరే!" అన్నాడు వెంటనే.

మణిమాల నవ్వును పెదిమల మధ్య బిగించి వదిలి "మీరు ఇంత త్వరగా ఒప్పుకుంటారనుకోలేదు!" అంది.

"నువ్వు వాళ్ళనీ వీళ్ళనీ పోగుచెయ్యకపోతే, ఇలాంటివి నాకెప్పుడూ ఇష్టమే!"

"ఇప్పుడు మాత్రం లలిత లేదూ?"

మాధవరావు అన్నం తింటున్నవాడు ఆగి, మణిమాల ముఖంలోకి పరిశీలనగా చూసాడు.

గంభీరంగా కూచుంది మణిమాల.

"లలిత విషయం వేరు."

అప్రయత్నంగా ఒక్క నిట్టూర్పు విడిచింది మణిమాల. వింతగా చూసే మాధవరావు చూపులను తప్పించుకుంటూ "నేనూ అలాగే అను

కున్నాను. అయితే లలితకు కబురుచేస్తాను. రేపు వెళ్దాం.''

అని గబగబ అక్కడినుండి వెళ్ళిపోయింది. మాధవరావు భోజనం పూర్తికాలేదు. మణిమాల వెళ్ళిపోగానే అతనికి అన్నం దగ్గరనుంచి లేచి పోవాలనిపించింది. కాని లేవలేదు. కొన్ని క్షణాలు అలాగే కూచుని తనే లేచివెళ్ళి పెరుగు తెచ్చుకుని వడ్డించుకున్నాడు.

మణిమాల కబురు అందుకున్న లలిత వెంటనే ఒప్పుకుంది. మాధవ రావుకు సంగీతంలోఉన్న ఆసక్తి లలితకు కరమయింది. తను కోరకుండానే మోహన్ ఆచూకీ తెలుసుకుంటానని వాగ్దానంచేసిన మాధవరావు దంప తుల స్నేహం లలిత వదులుకో దలచలేదు.

మణిమాల ఎంతో ఉత్సాహంగా కారియర్లు సర్దింది. ఫ్లాస్కుల్లో కాఫీ పోసింది. లలిత రాగానే కూచోబెట్టి లలిత వద్దంటున్నా ఫలహారాలు రుచి చూపించింది. ఆ పూలతోట ఎంత బాగుంటుందో లలితకు వర్ణించి చెప్పింది. తీరా డ్రైవర్ కారు సిద్ధం చెయ్యగానే ''అబ్బా! నాకు కడుపు నొప్పి!'' అంటూ మంచంలో పడుకుంది.

లలిత కంగారు పడింది.

''డాక్టర్ని పిలిపించండి. ఎప్పుడైనా ఇలా వస్తుందా?'' అంది ఆదుర్దాగా.

మాధవ్ ఏం మాట్లాడకుండా మణిమాలను చూస్తూ సోఫాలో కూర్చున్నాడు.

''ఏం కాదు! నిన్న పచ్చిమిరపకాయ బజ్జీలు ఇష్టమని ఎక్కువగా తిన్నాను. దాని ఎఫెక్ట్. నువ్వూ మాధవ్ వెళ్ళండి. నేను రెస్ట్ తీసు కుంటాను.''

లలితకు మతిపోయినట్లయి ''అదెలా ..'' అని మాధవరావు ముఖం చూసి ఏటూ చెప్పలేక నిలబడిపోయింది...

''ఎలా లేదు. ఏం లేదు. మాధవ్‌కి ఆ పూలతోటలో గడపటం చాలా ఇష్టం! బహుశః ఆ తోట నువ్వూ ఇష్టపడతావు. వెళ్ళిరండి...'' అని లలిత ఏం మాట్లాడటానికీ అవకాశమియ్యకుండా పనిమనిషిని పిలిపించి సర్దినవన్నీ కారులో పెట్టించింది.

లలిత నిస్సహాయంగా మాధవరావు వంక చూసింది. అతనేం ఆలో చిస్తున్నాడో లలిత కంతుపట్టలేదు. అలాగే కూచున్నాడు.

సరిగ్గా ఆ సమయంలో దిగింది రాగిణి.

అప్పటివరకూ శిలలా కూచున్న మాధవరావు రాగిణిని చూడగానే ''రండి! నా ఆఫీస్‌రూంలోకి వెళ్దాం!'' అని లేచాడు.

కారులో పనిమనిషి సర్దుతోన్న సామానులు చూపించి రాగిణి

ప్రయాణ సన్నాహంలో ఉన్న లలితా మాధవరావులను చూసింది. తనను చూడగానే జీవం లేనట్లు పాలిపోయిన లలిత ముఖాన్ని చదువు కుంది వెంటనే అక్కడినుంచి కదలలేకపోయింది.

పాలిపోయిన లలిత ముఖంలోకి చూసి ప్రసన్నంగా నవ్వింది.

"పాపం! మాధవరావుగారితో ఎక్కడికో వెళ్దామని ప్రోగ్రాం వేసుకున్నట్టుగా ఉన్నావు. నా మూలంగా అంతా పాడయింది. అయామ్ వెరీసారీ లలితా! నాకు తెలియకుండానే ఎప్పటికప్పుడు నీకు అడ్డుపడు తున్నాను. నిన్నిలా కష్టపెట్టటం నాకు కష్టంగానే ఉంది. నేనేం చెయ్యను చెప్పు! నిజం చెపుతున్నాను. నేను నీకోసం ఏమైనా చెయ్య గలిగితే సంతోషంగా చేస్తాను. నువ్విలా బాధపడుతోంటే చూడలేను!"

కంఠంలో ఎక్కడలేని ఆప్యాయతా ధ్వనింపచేస్తూ అంది రాగిణి.

లలిత సమాధానం చెప్పలేదు. వంచిన తల ఎత్తకుండా అలాగే కూచుంది.

మాధవరావు ఒక్కసారి రాగిణిని లలితను చూసాడు. వెంటనే లేచి "మిస్ రాగిణీ! ఇప్పుడు నాకు మీతో మాట్లాడే తీరికలేదు. తర్వాత రండి! కమాన్ లలితా!" అంటూ లలిత చెయ్యి పట్టుకుని కార్లో కూచో బెట్టి పక్కన కూచుని డ్రైవర్‌తో "పోనీయ్!" అన్నాడు.

యజమాని మూడ్స్ బాగా అర్థంచేసుకున్న డ్రైవర్ వెంటనే కారు స్టార్ట్ చేశాడు.

అనుకోని ఈ సంఘటనకు కొయ్యబొమ్మలా నిలిచిపోయింది రాగిణి మాత్రమే కాదు. మణిమాల కూడా! ఒక్కటే తేడా! రాగిణి కళ్ళు నిప్పులుపోసాయి. మణిమాల కళ్ళలో నీళ్ళు ఉబికాయి.

తన చేతిలో చల్లగా మంచులా ఉన్న లలిత చెయ్యి వదిలేసాడు మాధవ్. అంతవరకు తనచెయ్యి మాధవ్ చేతిలో ఉందనే స్పృహకూడా లేని లలిత సిగ్గుపడి మాధవ్‌కు ఎడంగా జరిగి వంటినిండా పైట కప్పుకుంది

"థేంక్స్!" అంది.

"దేనికి, థేంక్స్!" అల్లరిగా అడిగాడు. బిత్తరపోయి చూసిన లలితను చూసి పకపక నవ్వాడు.

మాధవరావు సాధారణంగా నవ్వడు. అతనలా నవ్వటం మొదటి సారిగా విన్న లలితకు ఆ నవ్వులో ఏదో సంగీతం వినిపించినట్లయింది. రాగతాళాలకు అతీతమయిన సహృదయం ధ్వనించే సంగీతమా ఇది?

అంతలోనే గంభీరంగా మారిపోయిన మాధవరావు "రాగిణి మీకు తెలుసా?" అన్నాడు.

"తెలుసు!"

"ఎలా తెలుసు?"

"నా స్నేహితురాలు!"

కొంచెంసేపు మాధవరావు మాట్లాడలేదు. తరువాత అన్నాడు.

"ఒక స్నేహితుడిగా మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను. అలాంటి స్నేహాలు మీకు మంచివికావు."

"మీలాంటి వారికేనా అలాంటి స్నేహాలు మంచివి?" వెటకారంగా అనేసి నాలిక కరచుకుంది లలిత. భయంగా మాధవరావుని చూసింది.

మళ్ళీ నవ్వాడు మాధవరావు.

ఆ నవ్వు వింటున్న కొద్దీ తనలో ఏదో కొత్తశక్తివచ్చి చేరుకుం టున్నట్లు అనిపించసాగింది లలితకి.

"క్షమించండి!" అంది.

"మీ మాటలు ఒక రకంగా నిజమే! మాలాంటివారికే అలాంటి స్నేహాలు మంచివి. నేరస్థులని ట్రాప్ చెయ్యటానికి వాళ్ళని ఉపయో గించుకుంటాం మేము!" స్నేహ స్వరంతో అన్నాడు మాధవరావు. లలి తలో కుతూహలం పెరిగింది.

"రాగిణిని కూడా అలాగే ఉపయోగించుకుంటున్నారా?"

"లేకపోతే, ఆవిడతో నాకేం అవసరం? ఆఫీసర్ రాజు గవర్న మెంట్ డబ్బును దుర్వినియోగం చేస్తున్నాడని తెలిసింది. అతడు ప్రాస్టి ట్యూట్స్‌తో హోటల్స్‌లో గడుపుతాడని కూడా రిపోర్ట్స్ వచ్చాయి. అతణ్ని ట్రాప్ చెయ్యటానికే రాగిణిని ఉపయోగించుకుంటున్నాం."

గుండె ఝల్లుమంది లలితకి.

మారిన లలిత ముఖ కవళికలు గమనిస్తూ "అదేమిటి అలా అయి పోయారు? అన్నట్లు రాగిణి మీ స్నేహితురాలన్నారు కదూ! భయపడ కండి! ఆవిడకేమీ జరగదు!" అన్నాడు.

లలిత క్షణాలలో సర్దుకుంది. తన పక్కనఉన్న వ్యక్తి పోలీస్ ఆఫీసర్. ముఖంచూస్తూ మనసు చదవగల ప్రజ్ఞాశాలి. తను హెచ్చరికగా ఉండాలి. ఉన్నట్లుండి "డ్రైవర్! లలితమ్మగారి ఇంటికి పోనీయ్!" అన్నాడు మాధవ్.

లలిత చాలా సంతోషించింది. మణిమాలలేకుండా ఇలా మాధవ రావుతో కలిసి పిక్నిక్‌కి వెళ్ళాలనిలేదు లలితకి.

"మీ ఇంటికి వెళ్దాం! మీకు అభ్యంతరంలేకపోతే, ఒక్కసారి వీణ వాయించండి. వినేసి ఇంటికి వెళ్ళిపోతాను. నాకు చాలా పను లున్నాయి." అన్నాడు మాధవ్ లలితతో.

"తప్పకుండా రండి. మీరు నా వీణ వింటాననటంకంటె నాకు కావలసిన దేముంది?" సంతోషంగా అంది లలిత.

# 10

పకపక నవ్వాడు రాజు. షాక్ తిన్నట్లుగా చూస్తోన్న లలిత ముఖం చూసి మరింత విరగబడి నవ్వాడు. పొంగి పొంగి కెరటాల్లా వస్తోన్న నవ్వును ఆపుకోవటానికి విశ్వప్రయత్నం చెయ్యవలసి వచ్చింది.

"లాభంలేదు లలితా! ఏం లాభంలేదు!" నవ్వు నాపుకునే ప్రయత్నంలో నవ్వుమధ్య అస్పష్టంగా అన్నాడు.

లలితకు అతని మాటలు అర్థం కావటంలేదు.

"ఏమనుకుంటున్నావ్ నువ్వు? నువ్వు చెప్పిన మాటలు విని రాగిణిని వదిలేసి... నిన్ను పెళ్ళి చేసుకుని .." మళ్ళీ నవ్వాడు రాజు.

అర్థమయిపోయింది లలితకు! తనను తానెంత నికృష్ట స్థితిలోకి దిగజార్చుకుందో, ఒక్కసారిగా అర్థమయిపోయింది. "రాగిణిని నేను వదిలెయ్యటానికి నువ్వింత శ్రమపడక్కర్లేదు లలితా! రాగిణిని నేను పెళ్ళి చేసుకుంటావా? ఎవరు చెప్పారు నీకు? నేను .. ఐ. ఎ. ఎస్. ఆఫీసర్ని రాగిణిని పెళ్ళి చేసుకుంటానని అనుకున్నావా? మినిస్టర్లు తమ కూతుళ్ళ నిస్తామని వస్తున్నారు. కలెక్టర్లు సంబంధాలు కలుపుకోవాలని కబుర్లు పంపుతున్నారు. నేను ఎవరిని పడితే వాళ్ళని పెళ్ళి చేసుకుంటానా?"

పకపక నవ్వుతున్నాడు రాజు.

హఠాత్తుగా లేచి బయటకు నడిచింది లలిత.

మాధవరావు రాజును ట్రాప్ చెయ్యటానికి రాగిణిని ఉపయోగించుకుంటున్నాడని తెలిసిన క్షణంనుంచీ లలిత స్థిమితంగా ఉండలేకపోయింది. ఒక్కక్షణం "అంతే కావాలి శాస్తి. అనుభవించనీ!" అనిపించక పోలేదు. కానీ అలాంటి ఆలోచన వచ్చినందుకు తనమీద తనకే చికాకు కలిగింది.

రాజు తనను నిర్లక్ష్యం చేసినంత మాత్రాన రాజు నాశనం కోరుకో గలదా? ఇలాంటి రహస్యం తెలిసిన తరువాత .. రాజును రక్షించగలిగే శక్తి తన చేతుల్లో ఉండీ చూస్తూ ఊరుకోగలదా?

రాజును కలుసుకుని తనకు తెలిసిన రహస్యం రాజుకి చెప్పేసింది!

రాజు విని పకాలున నవ్వాడు. 'ఈ రకంగా నన్ను రాగిణికి దూరం చేద్దామనుకుంటున్నావా?' అని పరిహాసం చేసాడు!

ఇదీ ఒకందుకు మంచికే జరిగింది. ఇప్పుడు తన మనసు చాలా తేలిగ్గా ఉంది! తన ఎదురుగా పకపక నవ్వే ఆ రాజు తను ప్రేమించిన రాజు కాదు. తనకెన్నడూ పరిచయంలేని తన ఊహలకందని ఎవరో అతి సామాన్య వ్యక్తి.

రాజు తెలివి తక్కువ వాడు కాదు, అందుకే లలిత మాటలు

నమ్మలేకపోయాడు. తను చేసిన నేరమేమీ లేదు. గవర్నమెంట్ డబ్బు తను వాడుకున్నదీ లేదు. ఆ రోజు రాగిణితో తనను చూడగానే లలిత ముఖం ఎలా అయిపోయింది? అఫ్‌కోర్స్! లలిత తనను ప్రేమించింది! చాలా మంచిది! సందేహం లేదు! అయితే మాత్రం! తనలాంటి ఐ. ఎ. ఎస్. ఆఫీసర్‌కి లలితలాంటి భార్య ఏం బాగుంటుంది? ఎలాంటి ఆఫర్స్ వస్తున్నాయి? ఎందుకైనా మంచిది! రాగిణిని కదిలించి చూడాలి!

రాగిణి రాగానే రాగిణి ముఖకవళికలు పరిశీలనగా చూస్తూ అనేసాడు "ఇది విన్నావా? నిన్ను పోలీస్ డిపార్ట్‌మెంట్ నన్ను ట్రాప్ చెయ్యటానికి పంపిస్తోందట!"

నిర్ఘాంతపోయింది రాగిణి. "ఎవరు చెప్పారు" అంది.

"లలిత!"

"అయితే ఇంకేం? నేను వెళ్ళిపోతాను. నువ్వూ లలితా మళ్ళీ స్నేహితులయిపోవచ్చు!"

వెళ్ళిపోవటానికన్నట్లు బయలుదేరింది రాగిణి. అడ్డగించాడు రాజు.

"అంత తేలిగ్గా నిన్ను వెళ్ళనివ్వను! నేను తిరస్కరించినందుకు లలిత ఎంత బాధపడుతోందో, తిరిగి నన్ను పొందాలని ఎలా తపసు చేస్తోందో. నాకు తెలియదనుకున్నావా? పాపం, లలిత..."

కిలకిల నవ్వింది రాగిణి. ఆ నవ్వు వింటూ సర్వమూ మరచిపోయాడు రాజు. 36"-28"-36" లో మునిగిపోయాడు.

ఒక నెలరోజులు రాజు రాగిణి విషయంలోనూ అన్ని విషయాల్లోనూ చాలా జాగ్రత్తగా ఉన్నాడు. ఏమీ జరగలేదు. 'అసూయ ముందు పుట్టి ఆడది తర్వాత పుట్టింది' అని నవ్వుకున్నాడు.

రాజులాంటి బ్రహ్మచారి కళ్ళ కెదురుగా కనిపిస్తోంటే పెద్దలూరు కోరు. చాలా గొప్ప గొప్ప సంబంధాలొస్తున్నాయి రాజుకి. ఎవరిని చేసుకోవాలో నిర్ణయించుకోలేక పోతున్నాడు. ఈ సందట్లోపడి రాగిణి విషయం ఇంచుమించు మరిచిపోయాడు.

ఆరోజు రాగిణితో కలిసి రాజు ఖరీదైన హోటల్లో ఉండగా మాధవరావు ఆ హోటల్ మీద రైడ్ చేశాడు. రాజును అరెస్ట్ చేసారు.

గవర్నమెంట్ డబ్బు హరించుకుపోయింది. ఈ అక్రమానికి ఎవరో ఒకరు బాధ్యులు కావాలి! రాజుని చూపించారు! రాజు డబ్బు నిలువ చేసుకున్నట్టుగా ఆధారాలేమీ లేవు. సొంత ఆస్తి కూడా లేదు. కానీ 'కాల్ గరల్స్'తో తిరుగుతున్నాడు! డబ్బంతా ఈ విధంగా ఖర్చుపెట్టి ఉంటాడా? వేరే ఎక్కడైనా రహస్యంగా దాచాడా?

రాజును సస్పెండ్ చేసారు. విషయం విచారణలోకి వచ్చింది.

# 11

మణిమాల కావాలని లలితతో స్నేహం పెంచుకోసాగింది. దానికి లలిత కూడా సంతోషించింది. మణిమాలా మాధవరావులతో కలిసి భోజనం చెయ్యటం, ఆ దంపతులు వింటూఉండగా వీణ వాయించటం, అప్పుడప్పుడు వాళ్ళిద్దరితో కలిసి పిక్నిక్లకి కూడా వెళ్ళటం సాధారణమయి పోయింది లలితకి.

మాధవరావు మోహన్ అనే పేరుగల ఇద్దరు ముగ్గురు వ్యక్తుల ఆచూకీలు తెలుసుకుని ఫోటోలు తెప్పించారు. కానీ అవేవీ లలిత తమ్ముడు మోహన్వికావు. మాధవరావు విశ్వప్రయత్నం చేస్తున్నాడు. మోహన్ క్లాస్ మేట్స్ ఎవరెవరో తెలుసుకుని వాళ్ళందరి దగ్గరా మోహన్ గురించిన వివరాలు సేకరించాడు. మోహన్ కలిసి పనిచేసిన సంఘసభ్యులతో కూడా మాట్లాడాడు. మోహన్ స్నేహితులలో ఒకరి దగ్గిర మోహన్ ఉన్న గ్రూప్ ఫోటో ఒకటి సంపాదించగలిగాడు. దాని ఆధారంతో మోహన్ ఆచూకీ తెలుసుకోవటానికి పూనుకున్నాడు.

‘‘ఫోటో దొరికింది కనుక కొంచెం రోజుల్లోనే మీ తమ్ముడ్ని మీ దగ్గిరకు తీసుకురాగలను.’’ అన్నాడు మాధవరావు.

లలిత ఈ వార్త వెంటనే తల్లికి చెప్పింది. మంచంలో పడి కొడుకును గురించిన బెంగతో తల్లడిల్లిపోతున్న జానకమ్మ కళ్ళలోకి జీవం వచ్చింది. ‘‘ఎప్పుడే! ఎప్పుడొస్తున్నాడువాడు?’’ అంది ఆశగా.

‘‘త్వరలోనే వచ్చేస్తాడమ్మా!’’ మాధవరావు మీది నమ్మకంతో తల్లికి ధైర్యం చెప్పింది లలిత.

మణిమాల కబురందుకొని ఎప్పటిలా ఉత్సాహంగా వచ్చిన లలిత మణిమాల ముఖం చూసి బిత్తరపోయింది.

ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్లు వడిలిపోయిఉంది మణిమాల ముఖం.

‘‘అలా ఉన్నారేం?’’ అంది లలిత.

‘‘నేనొక్కటి చెపుతాను. ఇవాళ నామాట కాదనకు! మాధవ్ నిన్ను తనతో తీసికెళ్తాడు. వెళ్ళు.’’

మణిమాల ఒకటి రెండు సార్లు లలితను, మాధవరావును మాత్రమే బయటికి పంపాలని ప్రయత్నించింది. లలితా మాధవరావు లిద్దరు ఆ ప్రయత్నాన్ని తీవ్రంగా ప్రతిఘటించటంతో విరమించుకుంది. మణిమాల ప్రాధేయపడుతున్నట్లుగా అలా మాట్లాడేసరికి ఏం తోచక అక్కడే ఉన్న మాధవరావును చూసింది లలిత.

‘‘ప్లీజ్! రండి!’’ అన్నాడు మాధవరావు. అతడా మాటలన్న ధోరణి లలిత కేదో భయం కలిగించింది.

"ఏమిటిదంతా..." అంది.

"రండి!" అంటూనే కారులో కూచున్నాడు మాధవరావు.

దడదడ లాడే గుండెలతో కారులో కూర్చుంది లలిత. కారు డ్రైవ్ చేస్తూ తిన్నగా రోడ్డువంకే చూస్తూ కూచున్నాడు మాధవరావు.

జైలుముందు కారాగేసరికి లలితకు మతిపోయినట్లయింది.

మాధవరావు దిగి కారు డోర్ తెరిచి "దిగండి!" అన్నాక కాని తనక్కడే దిగాలని నమ్మకం కలగలేదు లలితకి.

ఎన్నెన్నో మాట్లాడాలని ఉంది. ఏదేదో అడగాలనిఉంది. కానీ గొంతు పొడారి పోతోంది లలితకి. యాంత్రికంగా మాధవరావు వెంట నడిచింది. అతడు కూర్చోమన్న కుర్చీలో కూచుంది. కొంచెంసేపట్లోనే ఖైదీ యూనిఫాంలో ఉన్న యువకుణ్ణి పోలీసులు లలిత ముందుకు తీసుకొచ్చారు.

"మోహన్!" ఒక్క గావుకేక పెట్టింది లలిత.

మోహన్ లలిత ముఖంలోకి చూసి తల దించుకున్నాడు. గిర్రున తిరిగి బయటికెళ్ళి పోతున్న అతణ్ణి పోలీసులనుసరించారు.

లలిత కళ్ళనుండి కన్నీరు కాలువలు కట్టింది. వణికిపోతున్న లలిత భుజం చుట్టూ చెయ్యివేసి తన రుమాలుతో కన్నీళ్లు తుడిచాడు మాధవరావు. తనేంచేస్తోందో, ఏం జరుగుతోందో, ఏమీ తెలియటంలేదు లలితకి. లలితను నడిపించుకుంటూ తీసుకొచ్చి కారులో కూచోబెట్టాడు మాధవ్. లలితకు కన్నీళ్ళాగటంలేదు.

"మీ ఇంటిదగ్గిర దింపనా!" అన్నాడు మాధవరావు. తల్లి ముఖం గుర్తుకొచ్చి వణికిపోయింది లలిత.

"వద్దు! వద్దు! తమ్ముడొస్తాడని గంపెడాశతో ఉంది అమ్మ. ఇప్పుడిప్పుడే కాస్త లేచి తిరుగుతోంది. అమ్మముఖం ఎలా చూడగలనో అర్థం కావటంలేదు. నాన్న అలాగ! తమ్ముడిలాగ! నన్నెక్కడికయినా కొంచెం సేపు తీసికెళ్ళండి. కొద్దిగా స్థిమితపడనీయండి!"

లలిత ఎన్నడు ఇంత బేలగా మాట్లాడలేదు. జాలితో మనసు తరుక్కుపోయింది మాధవరావుకి.

"సినిమాకు వెళ్దామా?" అన్నాడు.

"ఎక్కడికైనాసరే!"

నిలబడలేక పోతున్న లలిత భుజం చుట్టు చెయ్యివేసి నడిపించుకొంటూ సినిమాహాల్లో కొచ్చి లలితను కూచోబెట్టి తను పక్కన కూచున్నాడు మాధవరావు.

ఆరోజే రాగిణి కూడా తన సేవాసదనం స్నేహితులతో కలిసి సినిమా

కొచ్చింది. లలితా మాధవరావులను చూడగానే రాగిణి కేదో ఈర్ష్య కలుక్కుమంది.

తనకు ఈర్ష్య ఏమిటి? ఎందుకు? ఎవరిమీద? రాగిణిని మాధవరావు చూసాడు. రాగిణితో పాటు రాగిణి స్నేహితులను చూసాడు. రాగిణి నవ్వబోయింది. ఆవిడ ఒక మనిషే కానట్లు తల తిప్పుకున్నాడు మాధవ రావు. రాగిణి మనసు భగ్గుమంది.

రాగిణి కట్టుకున్నది మైసూర్ జార్జెట్ చీర! దగ్గర దగ్గర అయిదు వందలుంటుంది. ఎర్రటి ఎరుపులో ఉన్న ఆ చీరకి మాచ్ అయ్యేలా నెక్లెస్, దుద్దులు, గాజులు, ఉంగరం, అన్నీ ఉన్నాయి. అన్నీ ఖరీదైనవే! అందమైన ఆ చీరలో శరీరకాంతి మరింత అందంగా కనిపిస్తోంది. చుట్టు పక్కల పురుషుల చూపులు రాగిణిమీద నుంచి కదలటంలేదు.

తనను చూసుకుని లలితను చూసింది రాగిణి. ఏం చీరో సరిగ్గా తెలియటంలేదు. పాతబడి ఉంది. కొద్దిగా నలిగినట్లుగా కూడా ఉంది. ఏ అలంకరణా లేదు సరికదా, ముఖమంతా వడిలిపోయి ఉంది. జుట్టు రేగి ఉంది. అయితే ఆ వడిలిన ముఖంలో ఏదో ఆకర్షణ రాగిణి గుర్తించకుండా ఉండలేకపోయింది.

మాధవరావు కూల్ డ్రింక్ తెప్పించి తనే లలిత కందించాడు. ఎందుకనో సీసా పట్టుకున్న లలిత చేతులపై తన చెయ్యి వేసాడు.

ఉండుండి లలితతో ఏదో మాట్లాడుతున్నాడు. లలితను నవ్వించ డానికి ప్రయత్నిస్తున్నాడు. ఒక్కసారి అపురూపంగా లలిత కనీ కనపడ నట్లు నవ్వింది. ఏం మెరుపులు, ఆ నవ్వులో!

రాగిణి సినిమా చూడలేదు. లలితా మాధవరావులనే చూస్తూ కూచుంది.

సినిమా పూర్తి కాగానే రాగిణి నిగ్రహించుకోలేక "హలో! లలితా!" అని దగ్గరకు రాబోయింది. లలిత ఏదీ వినిపించుకోగలిగే స్థితిలో లేదు. వినిపించుకున్న మాధవరావు రాగిణి ఎక్కడ సమీపిస్తుందోనన్నట్లు గబగబ లలితను నడిపించి కారులో కూచోబెట్టాడు.

'ఆపాదమస్తకమూ భగభగలాడింది రాగిణికి. లలిత షాక్ నుండి కొంచెం కోలుకున్నట్లు కనిపించాక మాట్లాడటం మొదలుపెట్టాడు.

"మీరు నన్ను క్షమించాలి లలితా!"

"దేనికి?"

"మోహన్ అరెస్టవడానికి కారణం నేనే!"

లలిత దిగ్గున తలెత్తి ఆశ్చర్యంగా చూసింది.

"మోహన్ గురించి తెలుసుకోవటానికి మీరు నా సహాయం కోరక

పోయినా బాగుండేది. ఆ ఫోటో ఆధారంగా ప్రయత్నించేసరికి అనుకోని వివరాలు తెలిసాయి. మోహన్ గేంగ్‌తో కలిసి దొంగతనాలు చేస్తున్నాడు. అందరినీ అరెస్ట్ చేసాం!'' లలిత మాట్లాడలేదు.

మాధవరావు చెయ్యిజాపి లలిత చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. మంచులా చల్లగా ఉంది. ''నన్ను క్షమించు లలితా!''

మొదటిసారిగా ఏకవచనంలో చనువుగా సంబోధించాడు మాధవరావు. అంతటి విషాదంలోనూ అది గుర్తించింది లలిత మనసు.

''మీరు నన్ను క్షమించమని అడగక్కర్లేదు. మీరేం తప్పు చేసారని?'' శాంతంగా అంది.

ఆ సమాధానానికి మాధవరావు ఆశ్చర్యపోయాడు. లలితను లోలోపల మెచ్చుకున్నాడు. ఒక్క నిట్టూర్పు విడిచాడు!

# 12

పని కట్టుకుని తన దగ్గరకువచ్చిన రాగిణిని చూసి చికాగ్గా ముఖం చిట్లించుకున్నాడు మాధవరావు.

''నమస్తే!'' తనకు అలవాటయిన ధోరణిలో వయ్యారంగా విలాసాలుపోతూ నమస్కారం చెయ్యబోయింది రాగిణి

తీక్షణంగా ఒక్కసారి రాగిణిని పైనుండి క్రిందకు చూసాడు మాధవరావు ఆ చూపులతో తనకు తెలియకుండానే విలాసాలు మరిచి పోయి తిన్నగా నిలబడిపోయింది రాగిణి తనకే అర్ధంకాని భయంతో దడదలాడుతున్న గుండెలను సర్దుకుని మామూలు ధోరణిలో నవ్వటానికి రెండు నిముషాలుపట్టింది రాగిణికి.

శ్యామలాంబగారి సేవాసదనంలో చేరినప్పటినుండీ రాగిణికి అనేక మంది 'ప్రసిద్ధపురుషుల'తో 'పరిచయాలు' ఏర్పడ్డాయి. వాళ్ళలో ఏ ఒక్కరిని గురించీ ప్రత్యేకంగా ఏ నాడు రాగిణి ఆలోచించలేదు.

కొన్నికొన్ని సందర్భాలలో రాజకీయ ఖైదీలను సైక్రియాటిస్ట్‌ల సహాయంతో సొంత ఆలోచన అనేది రాకుండా తయారుచేసి ఉపయోగించు కొంటారట!

సేవాసదనంలోఉన్న స్త్రీల పరిస్థితి ఇంచుమించు అలాగే ఉంటుంది. సైక్రియాటిస్ట్‌లు ప్రత్యేకించి రాకపోయినా వాళ్ళు మసలే వాతావరణంలో, శ్యామలాంబగారు సృష్టించే పరిస్థితుల్లో వాళ్లకు చీరలు, నగలు, డబ్బు, తప్ప మరేదీ ముఖ్యంకాదు. అలంకరణలు విలాసాల్లో వాళ్ళు ఒకరితో ఒకరు పోటీలుపడేలా శ్యామలాంబగారు తన మాటలతో రెచ్చగొడుతుంది. ఆ ప్రవాహంలోపడి కొట్టుకుపోతూ ఎంతగా విలాసాలు గుమ్మరించగలిగితే అంత ప్రజ్ఞావంతుల మనుకోగలిగితే దశలోకి వచ్చే

సారు వాళ్ళు. రాగిణి ఎప్పుడూ ఆలోచించేది ఒకే ఒక వ్యక్తిని గురించి ఆ వ్యక్తి లలిత.

లలిత అంటే రాగిణికి ఎంతో అభిమానం. చిన్న తనంలో అనేక విధాల తనను ఆదుకున్న లలితను రాగిణి మరిచిపోలేదు. భగవంతుడి దయ వల్ల ఆ నికృష్టదశలోనుండి తను బయటపడింది! ఇప్పుడు లలితకే తను సహాయం చెయ్యగలిగే దశలోఉంది. తను తలుచుకుంటే లలిత తమ్ముడికి ఉద్యోగం ఇప్పించగలదు. లలిత కూడా ఇంకా మంచి ఉద్యోగంలోకి వచ్చేలా చెయ్యగలదు. ఆర్థికంగా కూడా లలితకు సహాయం చెయ్యటానికి సిద్ధంగాఉంది. కానీ లలితకు తన సహాయం అక్కర్లేదు. లలిత ధర్మ పన్నాలు చెపుతూ తనను అసహ్యించుకున్నా, తన సామాన్యమైన ధోరణిగా రాగిణి అర్థంచేసుకోగలిగేది! కాని లలితకళ్ళలో తనమీద జాలి! ఎందుకా జాలి? తనకంటె లలిత ఏం బావుకుంటోందని ఆ జాలి! ఆ నాడు రాజు ముందు లలిత ముఖం ఎలా అయిపోయింది? ఆ సౌభాగ్యానికేనా, తనను చూసి జాలిపడటం?

కానీ, మాధవరావు? తనను చూసి కూడా నిర్లక్ష్యంచేసి లలితతో వెళ్ళిపోయాడు! సినిమాహాల్లో లలితను పసిపాపను బుజ్జగించినట్లు అనునయిస్తూ తనను చూసి ముఖం చిట్లించుకున్నాడు.

లలిత మాధవరావును ప్రేమిస్తోందా? మాధవరావుకు పెళ్ళయి పోయింది. పెళ్ళయిన మాధవరావును ప్రేమించే లలిత నైతికంగామాత్రం తనకంటె ఏం ఎక్కువ?

తనను నిర్లక్ష్యంచేసి లలితతో వెళ్ళిపోయిన మాధవరావు లలితను నిర్లక్ష్యంచేసి తనతో రావాలి! అప్పుడు లలిత... అఫ్కోర్స్ లలితంటే తనకేం కోపంలేదు! లలితకేసహాయంచెయ్యాలన్నా తను సిద్ధమే!

అవును! లలిత తననుచూసి జాలిపడకూడదు! తనే జాలిపడి సహాయంచెయ్యాలి! ఏం చెయ్యమన్నా చేస్తుంది!

ఎదుటి వ్యక్తి నిలువునా పులకించేలా చిలిపిగా నవ్వింది రాగిణి తెల్లబోయిచూసాడు మాధవరావు. ఆ చూపులతో ధైర్యంతెచ్చుకున్న రాగిణి తనే ఒక కుర్చీ దగ్గరకిలాక్కుని కూర్చుంది.

"ఏం పనిమీద వచ్చారు?"

మారిపోయిన మాధవరావు ముఖమూ, అతని కంఠమూ, రాగిణిలో ఎన్నడూ ఎరగని బెదురును కలిగిస్తున్నాయి.

"పని లేకుండా రాకూడదా?"

గారాబాలుపోతూ అంది రాగిణి. రాగిణి ముఖంలోకి చూసి పకాలున నవ్వాడు మాధవరావు.

మాధవరావులాంటి వ్యక్తులను అంతవరకూ కలుసుకోలేదు రాగిణి అతని సమక్షంలో మనసెందుకో గడగడవణికిపోతోంది. తన ధోరణి తను సాగించటానికి చాలా శ్రమ పడవలసివస్తోంది.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"ఆయుధాలను ఎదుటి వ్యక్తులమీద ప్రయోగించటానికే ఉపయోగించుకుంటారు. ఆత్మహత్య చేసుకోవటానికి కాదు! మీ కింతమాత్రం కూడా తెలియదేమా అని నవ్వొచ్చింది!"

రాగిణి తెలివి తక్కువది కాదు! మాధవరావు మాటలకు ఆవిడ ముఖం తెల్లగా పాలిపోయింది క్షణాలలో కూడ దీసుకుని తనూ మాధవరావును చూసి విరగబడి నవ్వింది.

'ఎందుకు నవ్వుతున్నార'ని మాధవరావు అడగలేదు. అడగక పోయినా రాగిణి చెప్పింది. కావాలని తెచ్చుకుని కృత్రిమంగా నవ్వుతూ.

"మీ అమాయకత్వం చూస్తోంటే నాకు నవ్వొస్తోంది. తెలియక పోతే సరి, పామును కూడా పూలమాలలా మెళ్ళో వేసుకోవచ్చు."

అప్పటికీ రాగిణి మాటల్లో పెద్ద కుతూహలం ప్రకటించలేదు మాధవరావు.

యధాలాపంగా "నీకేమైనా తెలిస్తే చెప్పరాదూ!" అన్నాడు.

"మిమ్మల్ని లలితతో సినిమాహాల్లో చూసాను నేను!"

కవ్విస్తున్నట్లున్న ఆ ధోరణికి నిటారుగా కూర్చున్నాడు మాధవరావు.

"అయితే?"

"ఏం లేదు! లలితతో నిశ్చింతగా సినిమాకు వెళ్ళగలిగిన, మీరు నన్ను చూసి నిష్కారణంగా ఉలికిపడుతుంటే నవ్వురాదూ?"

"ఎంత సాహసం! లలితతో నిన్ను పోల్చుకుంటున్నావా?"

ఈ మాటలు చాలా లోతుగా తగిలాయి రాగిణికి. తన బెదురు, సంకోచమూ వయ్యారాలూ, విలాసాలూ అన్నీ మరిచిపోయింది. నాగినిలాగ తలపైకెత్తి "ఏదీ లలిత నాకంటె దేనిలో ఎక్కువ?" అంది.

"ఎన్నిరకాల రంగులు పులుముకున్నా, ఎన్ని విధాలుగా నగిషీలు చెక్కుకున్నా. కాగితం పువ్వు సహజసుగంధాలు విరజిమ్మే గులాబికి సాటిరాదు!"

"ఓహో! అయితే ఆ "సహజసుగంధాలు" మీదాకా ఎంతవరకూ వచ్చాయి? ఆవిడ రాజుకి ప్రియురాలని మీకు తెలుసునా? మీరు ఆవిడని నమ్మి నన్ను గురించిచెప్పిన రహస్యం రాజుకి చెప్పేసి రాజుని కాపాడ టానికి ప్రయత్నించిందని తెలుసునా? నేను నా చాకచక్యంతో రాజుని నమ్మించి కార్యం సాధించానని తెలుసునా?"

నిర్ఘాంతపోయాడు మాధవరావు ఆ ముఖం చూస్తూ కసిగా నవ్వుకుంది రాగిణి.

"వెళ్తాను. దయ ఉంచండి! ఈ కౌగిలం పువ్వుతో... ఈ మర బొమ్మతో... ఈ ఆయుధంతో ఏదైనా పని పడినప్పుడు కబురు చెయ్యండి."

వెళ్ళిపోతున్న రాగిణి కళ్ళలో నీళ్ళు విచిత్రంగా కదిలించాయి మాధవరావుని... రాగిణి విలాసాలూ, చిరునవ్వులూ, వయ్యారాలూ చూసి చీదరించుకున్నాడు. నవ్వుకో గలిగాడు. కానీ ఆ రెండు కన్నీటి బొట్లు చూసేసరికి మనసు కరిగిపోయింది.

రాగిణి మాటలు నిజమేనా? కావచ్చు! ఆనాడు తాను చెప్పిన విషయం వినగానే లలిత ముఖంలో వచ్చిన మార్పు... ఆ మార్పుకి కారణం. రాగిణి స్నేహితురాలు కావటం, అనుకున్నాడు!

మనసంతా చాలా చికాగ్గా అయిపోయింది. అంత చికాకుపడవలసిన అవసరమేం వొచ్చింది? రహస్యం బయటపడటం పొరపాటే అయినా, దానివల్ల ఏ ప్రమాదమూ జరగలేదు. ఆరోజు, మాటల సందర్భం అలా రాబట్టి ఆ మాత్రం నోరు జారాడు. ఇకముందు లలిత విషయంలో మరింత జాగ్రత్తగా ఉండచ్చు. కాకపోతే తను ఎంతో ఉన్నతురాలని భావించిన లలిత ఇలా ప్రవర్తించటం కష్టంగా ఉండచ్చు. అందుకు లలితమీద అసహ్యం కలగాలి! మనసెందుకిలా మధనపడాలి? లలిత రాజుకు ప్రియురాలని తెలియటమే యీ అశాంతికి ఓ కారణమా? గుండె గుభిల్లుమంది మాధవరావుకి! తన ఆలోచనను తనే అసహ్యించుకున్నాడు

అద్దంముందు కూచుని అలంకరించుకొంటూన్న మణిమాల అద్దంలో మాధవరావు ప్రతిబింబాన్ని చూసి నవ్వింది. ఆ నవ్వు చాలా కొత్తగా గమ్మత్తుగా కనిపించింది మాధవరావుకి. అందులో ఆనందమెంత ఉందో విషాదమంత ఉంది. దుఃఖాన్ని అణచుకుని ఆ దుఃఖంలోనే ఏదో ఆనందం అనుభవిస్తున్నట్టుగా ఉంది.

"నీకొక గుడ్ న్యూస్!" అంది మణిమాల అలా నవ్వుతూనే.

"చెప్పు..."

"లలిత నిన్ను ప్రేమిస్తోంది!"

బొమ్మలా నిలబడిపోయాడు మాధవరావు ఒక్కక్షణం! కోపంగా "మణీ! మతి ఉండి మాట్లాడుతున్నావా? నన్ను నువ్వు అనుమానిస్తున్నావని భ్రమపడమంటావా?" అన్నాడు.

"లేదు మాధవ్! అలాంటి భ్రమలేమీ పడక్కర్లేదు. నేను చెప్తున్నది నీ విషయం కాదు! లలిత విషయం! లలిత ప్రేమిస్తోంది నిన్ను!"

"అలాగా! ఎలా గ్రహించావు? వీణ వాయించిందనా? మనతో కలిసి నువ్వు బలవంతం చేస్తే పిక్నిక్‌కి వచ్చిందనా?" వెటకారంగా అడిగాడు మాధవ్.

"అవేవీ కాదు మాధవ్! ఇలాంటి వాటికంటె చాలా బలమైన ఆధారంతోనే గ్రహించాను. డాక్టర్ వినోద్ దగ్గరకు నన్ను వెళ్ళద్దని బ్రతిమాలింది. నీకింత అశాంతి కలిగించటం న్యాయంకాదని పోట్లాడింది. ఎలాగైనా మనిద్దరం సుఖంగా ఉండటంకంటె తనకు కావలసింది లేదంది. కోపంతో, ఉద్రేకంతో, నేను కొట్టిన చెంపదెబ్బని కూడా భరించి 'మీ కర్థంకావటం లేదు. ఇలాంటి వినోద్‌లు లక్షమంది జతగూడినా మాధవరావుగారితో సరికారు!' అంది! ఇప్పుడు చెప్పు! లలిత నిన్ను ప్రేమించటంలేదూ?"

నవ్వుతోన్న మణిమాల చూపులనుండి తన చూపులు తప్పించుకున్నాడు మాధవరావు.

# 13

లలితను చూచి చవటనవ్వు నవ్వాడు రాజు. అతని నవ్వులో అంత చవటతనం చూడటం లలిత కది రెండవసారి. మొదటిసారి రాగిణితో కలిసి తన నెదుర్కొన్నప్పుడు నవ్వాడు అలా. ఆనాడు ఆ చవటతనంతో పాటు ఏదో దర్పమూ, అహంకారమూ కూడా ఉన్నాయి. ఈ నాడు ఎంతో దైన్యం ఉంది.

ఎన్నో రోజుల తర్వాత పని కట్టుకుని లలిత ఇంటి కొచ్చాడు రాజు. మనిషి చిక్కిపోయాడు. ముఖం కాస్త కళతప్పింది. అతణ్ని చూస్తోంటే ఏ వికారమూ కలగలేదు లలితకి! "కూచో రాజూ!" అంది మామూలుగా.

లలిత ఇంత మామూలుగా మాట్లాడేసరికి తబ్బిబ్బయ్యాడు రాజు. లలిత తన పైన కోపగించుకుని తిడితేనే అతనికి బాగుండేది.

"నిన్ను చూట్టానికి నాకు ముఖం చెల్లడంలేదు లలితా!" నిజంగానే వంచిన తల ఎత్తలేక అన్నాడు రాజు.

"ఫరవాలేదు! అంత కాని పని నువ్వేంచేసావు? జీవితంలో ఇంకా ఇంకా పైకి పోవాలనుకోవటం సహజమే!"

తలఎత్తి లలిత ముఖంలోకి చూసాడు రాజు. ఆ ముఖంలో ఏకోశానా కోపపు ఛాయలులేవు ఆ మాటల్లో నిష్ఠూరమూ లేదు. అతిశాంతంగా, అతి మామూలుగా ఉంది. రాజు నీరయిపోయాడు. ఇక తనేం మాట్లాడీ లాభంలేదని అర్థమవుతోనేఉంది. అయినా లలిత మంచిది.

"నన్ను క్షమించు లలితా!"

"నువ్వు తప్పు చేసావని నే ననుకోవటం లేదు రాజా దేనికి

క్షమించను?"

"నువ్వు నాకు సాయం చెయ్యాలని వచ్చావు కానీ, నేను..."

"నేను నీకు సాయం చెయ్యలేకపోయినా, నువ్వు నాకు చాలా సాయం చేసావు."

"నేను నీకు సాయం చేసానా?"

"అవును రాజూ! నువ్వు చిక్కుకుపోయిన ఊబిలోంచి నిన్ను కాపాడలేకపోయాను. కానీ, నేను చిక్కుకున్న ఊబిలోంచి నువ్వు నన్ను కాపాడావు!"

రాజు తెలివి తక్కువవాడు కాదు. లలిత ముఖంచూసి నప్పటి నుండీ ఆశలు నిలుపుకోలేకపోతున్న రాజు మనసు ఈ మాటలతో పూర్తిగా నిరాశతో నిండిపోయింది. అయినా తన ప్రయత్నం మానుకో దలచుకోలేదు. ప్రస్తుతం అతనికున్న ఆధారం లలిత మాత్రమే! అమాటే అన్నాడు మరో రకంగా. "నాకీ లోకంలో ఎవరూ నీకంటె ఎక్కువ కాదు లలితా! ఆ విషయం చాలా ఆలస్యంగా అర్థం చేసుకున్నాను."

లలిత నవ్వింది. "ఫరవాలేదు రాజూ! రోజురోజుకీ మనం మారుతూ ఉంటాం! మనతోపాటు మన అభిప్రాయలూ మారుతూ ఉంటాయి. ఈ రోజు ఈ అభిప్రాయానికివచ్చావు. రేపు ఏ అభిప్రాయానికొస్తావో?"

"లేదు! లేదు! లలితా! ఇంక ఈ జన్మలో ఈ అభిప్రాయం మారదు. నువ్వు 'ఊ' అంటే ఈ క్షణంలో నిన్ను పెళ్ళిచేసుకుంటాను."

"నీ అభిప్రాయాలు మారకపోవచ్చు రాజూ! నా అభిప్రాయాలు మారచ్చుగా! నేనూ నీలాంటి మనిషినే!"

ఇలాంటి సమాధాన మేదో వినవలసివస్తుందనే భయపడుతున్న రాజు చటుక్కున లలిత రెండుచేతులూ పట్టుకున్నాడు.

"ప్లీజ్! లలితా! నన్ను అర్థంచేసుకో! నిన్ను నిజంగా ప్రేమించాను కానీ... కానీ." రాజుకి మాటలు దొరకటంలేదు. అతని ముఖంలో దైన్యమూ, మాటలలో ఆరాటమూ, లలితకు జాలిని కలిగిస్తున్నాయి, ఒక విధమైన కంపరాన్నీ కలిగిస్తున్నాయి.

ప్రాక్టికల్‌గా ఆలోచిస్తే రాజు అభ్యర్థనని అంగీకరించటమే మేలు! రాజుని పెళ్ళిచేసుకోకంటే, తన కిప్పుడు పెళ్ళి చెయ్యటానికి తలిదండ్రులు సిద్ధంగాలేరు. పెళ్ళికాకుండా ఒంటరిగా ....

ఆలోచనల మధ్య మరొకరూపం లలిత మనసుమీద దాడిచేసింది. కాని దానికి స్పష్టమైన ఆకృతి లేకుండానే తరిమేసింది లలిత.

"ఏం రాజూ! ఇప్పుడెలాగూ పెద్దపెద్ద ఆఫీసర్లు తమ కూతుళ్ళ నిస్తామని రారు కనుక నన్ను చేసుకుంటానంటున్నావా?"

ఈ మాటలతో రాజు ఊపిరితీసుకున్నాడు. స్థిమితంగా కూచున్నాడు.

"అదేమిటి లలితా! ఇప్పుడు నేను ఐ. ఎ. ఎస్. ఆఫీసర్ని కానా?"

"అవున సస్పెన్షన్‌లో ఉన్న ఆఫీసర్‌వి!"

"నేరం లేదని రుజువయితే సస్పెన్షన్ కేన్సిలవుతుంది!"

"కావాలిగా!"

"అవుతుంది, నువ్వు ప్రయత్నిస్తే."

"నేనా? అతి సామాన్యురాలిని. నావల్ల ఏమవుతుంది?"

"నువ్వు మాధవరావుగారికి చెప్తే, మాధవరావుగారు ఏమైనా చెయ్యగలరు."

లలితకు తల గిర్రున తిరిగిపోయింది. ఇదా సంగతి! ఇందుకా, రాజు తన దగ్గిరకు వచ్చింది?

"నీకు కావలసింది అదే అయితే, నువ్వు రావలసింది నా దగ్గిరకు కాదు రాజూ! ఇలాంటి పనులకి నేను పనికిరాను!"

"ప్లీజ్ లలితా! నా కోసం... కాదు! మనకోసం..."

లలితకు మండిపోసాగింది.

"ఎవరికోసమైనా నావల్ల ఏమవుతుంది రాజూ! ఇలాంటి పనులు సాధించటానికి కావలసిన 36"-28"-36" లక్షణాలు నాకు లేవు."

"అది కాదు లలితా! మాధవరావుగారికి నీమీద ప్రేమ! నీ మాట కాదనరు!"

"మాధవరావుగారికి నామీద ప్రేమా? నాకే తెలియని ఈ విషయం నీకెలా తెలుసు రాజూ!"

"సారీ లలితా! నేను ఎవరాక దురుద్దేశంతో అనలేదు. ఎంతో ఆత్మీయులతో కాని పోలీస్ ఆఫీసర్లు ఇలాంటి రహస్యాలు చెప్పరు. అందుకని." లలితముఖం నల్లబడిపోయింది. మనసు విపరీతంగా బాధపడింది.

"ఆత్మీయురాలి ననుకొని ఆయన నాకా రహస్యం చెప్పలేదు. నేను ఆత్మగౌరవం గలిగిన దాన్నని భ్రమపడ్డారు. నా అభిమానం నిలబెట్టడానికి ప్రయత్నించారు. ఆ సందర్భంలో ఒక అపార్థాన్ని తొలగించటానికి ఈ విషయం చెప్పారు. బలహీనురాలినై ఆయన నాకిచ్చిన విలువను నిలుపుకో లేకపోయాను. ఆయన స్వభావం నాకు తెలుసు. నా నిజ స్వరూపం తెలిస్తే నన్ను ఎంతైనా అసహ్యించుకుంటారు!"

ముడుచుకున్న లలిత ముఖాన్నీ, కళ్ళలో తిరుగుతున్న నీళ్ళనీ చూస్తుంటే రాజుకి చేదు మింగుతున్నట్లుగా ఉంది. తెలియకుండానే ఏదో అక్కసు కలిగింది.

"ఆ మాధవరావుకి మణిమాలమీద చాలా ప్రేమ. ఆవిడ ఎలాంటి

దైనా ఆవిడను వొదిలిపెట్టడు. ప్రేమమాట ఎలాఉన్నా పరువు ప్రతిష్ట లను వదులుకోడు. మాధవరావు నిన్ను పెళ్ళిచేసుకోడు!"

ఉలికిపడి విచిత్రంగా రాజు ముఖంలోకి చూసింది లలిత! ఏమిటిది? రాజు కింకా తనమీద...ఆలోచించదలచుకోలేదు లలిత.

"రాజూ వెంటనే ఇక్కడ్నుంచి వెళ్ళిపో" కఠినంగా అంది లలిత. ఒక చవటనవ్వు నవ్వి అక్కడనుంచి వచ్చెయ్యటం తప్ప గత్యంతరం లేక పోయింది రాజుకి.

ఎలాగైనా తను నిర్దోషినని రుజువు చేసుకోవాలి! ఎలా? ఆలో చించి ఆలోచించి, మాధవరావుగారి దగ్గరకే బయలుదేరాడు రాజు.

రాజుని చూసి ముఖం చిట్లించుకున్నాడు మాధవరావు. కూర్చోమని కూడా అనలేదు. మాధవరావు తనే కూచున్నాడు.

"లలిత మీ దగ్గరకు వెళ్ళమంది. అందుకే ధైర్యంగా వచ్చాను." అన్నాడు.

ఉలికి పడ్డాడు మాధవరావు.

"లలిత...లలిత పంపించిందా, మిమ్మల్ని నా దగ్గరకి?"

మాధవరావు ఆశ్చర్యానికి పరమానందం అనుభవించాడు రాజు. తన చేస్తున్న అన్యాయ మేమిలేదు అన్నీ నిజాలే చెప్తున్నాడు. నిజాలు కావా?

"అవును. లలిత వెళ్ళమంది. 'మాధవరావుగారు న్యాయస్వరూ పులు. న్యాయాన్ని తప్పకుండా కాపాడతారు' అంది."

మాధవరావు ముఖం కొద్దిగా మెత్తబడింది.

"ఈ న్యాయా న్యాయాలు ఎవరు నిర్ణయించగలరు? అన్యాయమని రుజువయ్యేవరకు అంతా న్యాయమే!"

"నేను సిన్సియర్ గా చెపుతున్నాను సార్! నేను ఏతప్పూ చెయ్య లేదు. ఇప్పుడాలోచిస్తే ఇదంతా ముందునుంచీ పెద్ద ట్రేప్ అనిపిస్తోంది."

మాధవరావు కుతూహలంగా ముందుకు వంగాడు.

"బాపినీడుగారికీ, రాగిణికీ ఉన్న కాంటేక్ట్స్ బట్టి ఇందులో బాపి నీడుగారి జోక్యం ఉందనిపిస్తోంది. ఆయనకు అన్ని విషయాలూ తెలిసి ఉండచ్చు."

అదిరిపడ్డాడు మాధవరావు.

"బాపినీడు గారెవరో, తెలిసే మాట్లాడుతున్నారా మీరు?"

"తెలిసే మాట్లాడుతున్నాను సార్! మీరూ ఆలోచించండి! అలాంటి వాళ్ళే ఇలాంటివి అవలీలగా సాధించగలరు!"

"ఒక వేళ మీరన్నమాట నిజమే అయినా, ఆయన్ని టేకిల్ చెయ్యటం సామాన్య విషయంకాదు."

"మీరే అలా అంటే ఇక న్యాయానికి నిలువ నీడ ఎక్కడ సార్?"

"న్యాయం గురించి మాట్లాడుతున్నారు? రాగిణితో మీకేమిటి స్నేహం?"

రాజు తలవంచుకున్నాడు. గొణుగుతున్నట్లు అన్నాడు.

"అఫ్‌కోర్స్ అయామ్ వీక్ సర్! రాగిణి ఏదో నా ఆఫీసర్ హోదా చూసి వస్తోందనుకుని చాపల్యానికి లొంగిపోయాను. అంతే సర్! అంతకు మించి ఏమీ లేదు."

"సరే వెళ్ళండి చూద్దాం!"

ఆ మాత్రమే మహాభాగ్యమనుకుని వెళ్ళిపోయాడు రాజు 'థేంక్యూ లలితా!' అనుకున్నాడు మనసులో.

లలిత వ్యక్తిత్వం, ఆమెలోని నిజాయితీ మాధవరావుపై ఎంతో ప్రభావం చూపాయి రాజు వ్యవహారంలో ఆమె పరిస్థితిపై జాలికలిగింది.

'నీకోసం తప్పకుండా రాజుకి సాయం చేస్తాను లలితా!' అను కున్నాడు మనసులో.

# 14

ఏది తమకందదో దానిమీదే ఆశలు పెంచుకోవటం మానవ స్వభావం కాబోలు! రాగిణి ఎంత ప్రయత్నించినా మాధవరావును మరిచిపోలేక పోతోంది! మాధవరావులో రాగిణి ఏం చూసింది? అన్నదానికి సమాధానం లేదు. అసలెవరిలోనైనా ఏమైనా చూడటానికి రాగిణి ఎన్నడూ ప్రయత్నించలేదు. తనను తిరస్కరించిన మాధవరావులో ఏదైనా విశిష్టత రాగిణి మనసుమీద ఆమెకు తెలియకుండానే ముద్రవేసిందేమో! ఈ రకంగా తిరస్కరింపబడటం కూడా రాగిణికి మొదటి అనుభవం. బాధాకరమైన వింత అనుభవం సాధారణంగా శ్యామలాంబగారు బాపినీడుగారి దగ్గరకు పంపించటం. బాపినీడుగారు మరొకరి దగ్గరకు పంపించటం శాయశక్తులా ఆ వ్యక్తిని ఎవరనే ఆలోచన కూడా లేకుండా అలరించటం బాపినీడుగా రిచ్చిన బహుమతులందుకుని సంతోషంగా తిరిగిరావటం. ఇదే అలవాటు రాగిణికి. తనంత తానుగా ఏనాడు ఎవరికీ దగ్గరకావాలని ప్రయత్నించ లేదు. అలా ప్రయత్నించిన నాడు ఆ వ్యక్తి తనను తిరస్కరిస్తాడనేది ఊహ కందనిది!

రాగిణి మాధవరావు గురించి ఊహిస్తున్న సమయంలోనే మాధవ రావు దగ్గరనుండి రాగిణిని రమ్మని కబురు వచ్చింది. ఆ కబురు వచ్చినందుకే ఆశ్చర్యపోతున్న శ్యామలాంబ రాగిణి ఉత్సాహంగా బయలుదేరటం చూసి మరింత ఆశ్చర్యపోయింది. సాధారణంగా ఆ సమాజంలో పిల్లలు డబ్బు పేరు చెపితే తప్ప ఉత్సాహం చూపించరు. పోలీస్ ఆఫీసర్ల పేరు వింటేనే

భయపడతారు. విధిలేనప్పుడు తప్ప వాళ్ళ దగ్గరకి వెళ్ళటానికి ఒప్పుకోరు. బయలుదేరబోతున్న రాగిణి దగ్గరకు వచ్చి "మాధవరావుగారు నిన్నెందుకు పిలిపించారో తెలుసా?" అంది శ్యామలాంబ.

రాగిణి తనకు అలవాటైన ధోరణిలో చిలిపిగా నవ్వి "ఎవరైనా నన్నెందుకు పిలిపిస్తారు?" అంది.

శ్యామలాంబ ముఖం చిట్లించి "మాధవరావుగారు అలాంటి వ్యక్తి కాదని విన్నాను. జాగ్రత్తగా ఉండు." అంది హెచ్చరిస్తున్నట్లు.

రాగిణి ముఖం చిన్నబోయింది.

మాధవరావు తన ప్రైవేట్ రూంలోకి రాగిణిని చిరునవ్వుతో ఆహ్వానించాడు.

"మీకు బాపినీడుగారు ఎంత కాలంగా తెలుసు?" రాగిణి పూర్తిగా కూర్చోకుండానే అడిగాడు మాధవరావు

ఆ ప్రశ్న వింటూనే "అమ్మో!" అనుకుంది రాగిణి. అలాంటి ప్రశ్నలకు సమాధానా లియ్యకూడదని రాగిణికి తెలుసు. వాళ్ళ శిక్షణలో అదొక భాగం. పకపక నవ్వింది రాగిణి.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"నేను లలిత ననుకున్నారా? మోహించిన వాళ్ళతో రహస్యాలన్నీ చెప్పెయ్యటానికి!"

రాగిణి ముఖంలోకి చూసి చిన్నగా నవ్వాడు మాధవరావు.

ఆ నవ్వు రాగిణిని ఇరిటేట్ చేసింది. అప్పుడప్పుడు లలిత కూడా ఇలాగే నవ్వుతుంది.

"అయితే, నాకు చెప్పరు కాని, రహస్యా లున్నాయన్న మాట!" హాస్యంగా అన్నాడు మాధవ్ "ఓ బోలెడన్ని రహస్యాలు! కమ్మని... తీయని రహస్యాలు! ఎవరికీ చెప్పకూడని రహస్యాలు!" అంది నవ్వుతూ.

'తెలివైనది' అనుకున్నాడు మాధవరావు. ఈ 'తెలివి'లోను ఎన్నెన్ని రకాలు?

"పోనీ, మనం వ్యాపార సరళిలోనే మాట్లాడుకుందాం! నా ప్రశ్నలకు సమాధానం చెప్పినందుకు మీకెంత చెల్లించుకోవాలి?"

కలుక్కుమంది రాగిణికి. ఈ మాధవరావు తనలో కలిగిస్తూన్న భావాలన్నీ తనకు కొత్తవే!

"నా వ్యాపారం రహస్యాలమ్ముకునే వ్యాపారం కాదు" అంది.

నీళ్ళు నిండిన కళ్ళతో ప్రతిఫలించే ఏదో వ్యధను విస్తుపోయి చూసాడు మాధవరావు. మొదటిసారిగా రాగిణిమీద జాలి కలిగింది.

"గుడ్! నాకు కావలసింది సాధించలేకపోయినా మీరంటే

గౌరవం కలుగుతోంది. పోలీస్ ఆఫీసర్‌గా ఇలాంటి నిబ్బరాన్ని మెచ్చుకో కుండా ఉండలేను..."

ఇంక వెళ్ళి రావచ్చు అనే ధోరణిలో మాట్లాడాడు.

రాగిణికేదో నీరసం ఆవహించినట్లయింది. ప్రయత్నించినా కూర్చున్న చోటినుండి లేవలేకపోయింది.

"మీరు నాకోసం కబురు చేసారనగానే ఎంతో ఆశపడ్డాను..." మాధవరావు కనుబొమలు ఒక్కసారి ఆశ్చర్యంగా పైకిలేచి అంతలో క్రిందకు వాలిపోయాయి. ఏమీ అడగలేదు.

"నాలో అందం ఒక్కటే కాదు. నేను మొగవాడికి చాలా చాలా ఇవ్వగలను."

పూర్తిగా దిగజారిన రాగిణి పైకి నిలబడే ప్రయత్నంలో గర్వంగా అంది.

"అవును! ఎన్నెన్నో ఇవ్వగలరు. ఆనందం తప్ప .."

"ఏమంటున్నారు? ఒక్కసారి నాతో ఆనందించిన వాళ్ళని అడిగితే..."

"అడగక్కర్లేదు, నాకు తెలుసు. వాళ్ళకు, మీకు కూడా ఆనంద మంటే ఏమిటో తెలియదు. అంచేత ఆనందం ఇచ్చానని మీరు, పుచ్చు కున్నామని వాళ్ళూ భ్రమపడుతున్నారు!"

రెండు కళ్ళు పెద్దవిచేసి చూసింది రాగిణి. "అయితే మీరు చెప్పండి! ఆనందమంటే ఏమిటో .."

"అలా మాటల్లో చెప్పేదికాదు కనుకనే చాలామందికి తెలియదని అనగలిగాను. నిజమైన అనుభూతులేవీ ఏవేవో సూత్రాలకు లొంగి ఉండవు. యాంత్రికంగా లెక్కవేసి చెప్పే స్థాయిలో అసలుండవు. మీరు ఎన్నో నేర్చుకోగలరు! ఎంతో ప్రదర్శించగలరు! కానీ మనసుని తాకే ప్రేమ ఎక్కడ సంపాదించగలరు? అది అక్కడా ఇక్కడా దొరి కేది కాదు. ప్రయత్నించి పుట్టించుకునేది కాదు. నా ఉద్దేశంలో సృష్టికి మూలమైన ఆనందానికి ఆధారం ప్రేమ మాత్రమే. అదొక్కటి చాలు! కష్టపడి నేర్చుకున్న అన్ని చాతుర్యాలనూ మించిన కళలతో జీవింప చెయ్యటానికి..."

తనను తను మరిచి మాట్లాడుతోన్న మాధవరావు కళ్ళ వెలుగుల మీదనుండి దృష్టి మళ్ళించుకోలేకపోయింది రాగిణి "నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను." అనేసింది.

పకాలున నవ్వాడు మాధవరావు.

"మీకు ప్రేమంటే ఏమిటో తెలియదనటానికి ఇంతకంటె పెద్ద నిదర్శనం అక్కర్లేదు!"

భరించలేకపోయింది రాగిణి.

"నాకు ప్రేమంటే ఎందుకు తెలియదు? తెలుసు! ప్రేమంటే మీ మణిమాల డాక్టర్ వినోద్‌మీద చూపుతున్నది!!"

పట్టరాని కోపంతో వణికిపోయాడు మాధవరావు. లేచి వచ్చి రాగిణి రెండు చెంపలూ టపటప వాయించాడు.

రాగిణి కళ్ళలోంచి కన్నీరు జలపాతంలా ఉబికింది.

"అయాం సారీ!" అన్నాడు చేతిని నుదుటిమీద పెట్టుకొని.

"ఎందుకు సారీ చెప్పటం? మణిమాల మీ భార్య. ఆవిడని మేం ఏమీ అనకూడదు. అంటే మీరు భరించలేరు. కానీ మమ్మల్ని మాత్రం మీరు ఎన్నైనా అనగలరు. అతి సునాయాసంగా అనగలరు. చిరునవ్వుతో అనగలరు!"

ఏడుస్తూనే వెళ్ళిపోయింది రాగిణి.

చాలా సేపటివరకూ రాగిణి మాటల తాకిడినుంచి తప్పించుకోలేక పోయాడు మాధవరావు.

సేవాసదనం బ్రోతల్‌లాంటిది కాదు. అక్కడివాళ్ళు ఎప్పుడైనా వెళ్ళిపోవచ్చు. కానీ వెళ్ళరు. అంత "హైక్లాస్" జీవితాని కలవాటు పడినవాళ్ళు బయటికొచ్చి మామూలుగా బ్రతకలేరు.

"నేను పెళ్ళిచేసుకుంటాను." అంది రాగిణి శ్యామలాంబతో. నివ్వెర పోయిన శ్యామలాంబ తన భావాలను లోపల అణచుకుంది.

రాగిణిలో ఏదో మార్పు వచ్చిందని అర్థమయింది శ్యామలాంబకి. 'ఈ విషయం బాపినీడుతో ఆలోచించాలి' అనుకుంది.

"అలాగే! చేసుకో! నీ కోరికలకు వేటికి అభ్యంతరపెట్టాను?" అంది. అని రాగిణి ముఖంలోకి పరిశీలనగా చూసింది. రాగిణి ముఖంలో విశ్వాసం కనిపించలేదు. ఒక్క నిట్టూర్పు వదిలింది. అంతే!

శ్యామలాంబ ద్వారా విషయం విన్న బాపినీడు ఆలోచనలో పడ్డాడు.

"రాగిణిని బయటకు పోనియ్యటం మంచిదేనా?"

"మంచిదికాదు. కానీ బలవంతపెట్టటం అంతకంటె మంచిదికాదు."

"మన రహస్యాలు రాగిణికి తెలుసనుకుంటున్నావా?"

"వివరంగా తెలియవు. కానీ రాజు వ్యవహారంలో మనం తనను ఎలా ఉపయోగించుకున్నామో తెలుసు. అదీగాక తనను అక్కడికీ, ఇక్కడికీ పంపిస్తున్నది మనమేనని సప్రమాణంగా బయటపడినా చాలు!"

"అదంతా రుజువు కావటం కష్టంలే!"

"అనుమానం మాత్రం ఎందుకు కలిగించాలి?"

బాపినీడు ఆలోచనలో పడ్డాడు.

"రాగిణితో చెప్పు. రాగిణిని నేనే పెళ్ళిచేసుకుంటాను"

శ్యామలాంబ ఆశ్చర్యపోయింది. "మీరా" అంది.

"ఏం? ఇద్దరు పెళ్ళాల్ని పోషించలేనా?"

"కానీ, రాగిణి పెళ్ళయ్యాక ఇలాంటి పనులకు ఒప్పుకోకపోవచ్చు."

"సరేలే! అది కాకపోతే, దాన్ని తలదన్నిన వాళ్ళు మరొకళ్ళు. అందుకేం కాదు."

శ్యామలాంబ ద్వారా విషయం విన్న రాగిణి శ్యామలాంబకంటె ఎక్కువ ఆశ్చర్యపోయింది. మనసు పనిచెయ్యలేదు. సంతోషం కలగలేదు. కాదనటానికి నోరురాలేదు.

బాపినీడుగారితో సేవాసదనంలోనే రాగిణికి పెళ్ళయిపోయింది.

అందరూ "ఎంత అదృష్టవంతురాలివి" అని ఒకటికి పదిసార్లంటె 'కాబోలు!' అనుకుంది.

తనను చూసి మిగిలినవాళ్ళు ఈర్ష్యపడుతోంటే ఆ ఈర్ష్య చూసి గర్వపడింది.

బాపినీడు తనకోసం ప్రత్యేకించి ఏర్పాటుచేసిన బంగళాలోకి బాపినీడు భార్యగా ప్రవేశించింది.

ఎదురుగా ఫోన్ కనిపించింది.

వెంటనే మాధవరావు నంబర్ డయల్ చేసింది.

"హలో! మిసెస్ బాపినీడు స్పీకింగ్!"

"... ... ..."

"నాకు ఏం అక్కర్లేదు. ఎలా ఉన్నారో తెలుసుకుందామని. ఒక్కసారి మా ఇంటికి రండి. ఆనందనగర్ కాలనీలో 17వ నంబర్ ఇల్లు. ఇంటిముందు బాపినీడుగారి నేమ్ ప్లేట్ ఉంటుంది."

ఫోన్ పెట్టేసిన రాగిణిని ఆశ్చర్యంగా చూసాడు బాపినీడు. గర్వంగా నవ్వింది రాగిణి. ఆలోచించుకుంటూ నవ్వుకున్నాడు బాపినీడు.

## 15

రాగిణి మాధవరావుకు రెండు మూడుసార్లు ఫోన్ చేసింది. తన ఇంటికి రమ్మని. తనదే అయిన ఆ ఇల్లు, తన చీరలు, నగలు, బాపినీడు భార్యగా తనహోదా, అవన్నీ మాధవరావుకు చూపించాలని తహతహ.

మొదట కొంచెం సందేహించిన మాధవరావు రాగిణి ఆహ్వానాన్ని అంగీకరించాడు. అతనికి బాపినీడు బాగా తెలుసు. అలాంటి వ్యక్తి రాగిణిని పెళ్ళి చేసుకోవటం ఆశ్చర్యంగా ఉంది. బాపినీడు గురించిన వివరాలు తెలుసుకోవాలనీ ఉంది.

మాధవరావు తన ఇంటికి వస్తానని అనగానే రాగిణి సంతోషానికి

హద్దులులేవు. తనకున్న చీరల్లో మంచి చీరకట్టుకుంది. బోలెడు నగలుపెట్టుకుంది. సన్నని నడుముమీద మువ్వల వడ్డాణంపెట్టుకుంది. కాళ్ళకు గజ్జెల పట్టీలుపెట్టుకుంది. ఫలహారాలు సిద్ధంచేసింది. ఒక విధమైన ఆరాటంతో మాధవరావు రాకకోసం ఎదురుచూస్తూ కూచుంది.

సరిగ్గా వస్తానన్న టైంకే వచ్చాడు మాధవరావు. విశాలమైన ఆ ఇంటినీ, ఇంట్లోఉన్న ఖరీదైన ఫర్నిచర్‌నీ మాధవరావు పరిశీలనగా చూస్తోంటే గర్వంతో పొంగింది రాగిణి మనసు.

“కంగ్రాచ్యులేషన్స్, మిసెస్ బాపినీడుగారు!” చిరునవ్వుతో అన్నాడు మాధవరావు.

బాపినీడు భార్యగా తన గొప్ప ప్రకటించుకోవాలనే రాగిణి తాపత్రయమూను. అయినా మాధవరావు నోట ఆ కంగ్రాచ్యులేషన్స్ ఎందుకో వెక్కిరించినట్లు వినిపించాయి.

“ఇన్నాళ్ళు పెళ్ళిమీదకు మనసుపోలేదు. ఎందరెందరో చేసుకుంటామని వచ్చినా, చేసుకోనని అన్నాను. కానీ, ఎన్నాళ్ళని ఒంటరిగా ఉండగలను? బాపినీడుగారు చాలా మంచివారు. నన్ను బాగా అర్థం చేసుకుని పెళ్ళి చేసుకుంటానని అన్నారు. కాదన లేకపోయాను. ఎప్పటికైనా పెళ్ళి చేసుకుని స్థిరపడటమే మంచిదని అనుకున్నాను.”

“గుడ్ చాలా మంచిపని చేసారు. బాపినీడుగా రెక్కడ?”

“బాపినీడుగారికి లక్షపనులు. ఎప్పుడూ ఏ ఇంట్లోనూ స్థిరంగా ఉండరు. ఈ క్షణం ఇక్కడ, మరోక్షణం ఎక్కడో! కానీ ఒక్కరోజైనా నన్ను విడిచిపెట్టిఉండరు. ఏదో ఒక టైంలో తప్పకుండా వస్తారు.”

“అంటే, ఇప్పుడు రావచ్చా?”

“అహ! ఇప్పుడురారు. రేపటివరకూ రారు. ఏదో పనిమీద తిరుగుతున్నారు.”

“ఆయన లేనప్పుడెందు కాహ్వానించారు నన్ను?”

కావాలని చిలిపిగా అడిగాడు మాధవరావు. అతనికి రాగిణి ఏకాంతంలోనే తనను ఆహ్వానించిందని తెలుసు. అతడు కూడా బాపినీడు లేని సమయంలోనే రాగిణితో మాట్లాడాలనుకున్నాడు. అయినా రాగిణి లోతులు కనుక్కోవాలని అలా మాట్లాడాడు.

“భలేవారు! కావాలని ఆయన లేనప్పుడు పిలవలేదు. ఏవిటో అలా కుదిరింది. అసలు ఆయన కూడా ఉంటేనే బాగుండేది.”

రోషంగా అంది రాగిణి. సరిగా ఆ సమయానికే “ఎవరాయన? ఏం బాగుండేది?” అంటూ నవ్వుతూ ప్రవేశించాడు బాపినీడు.

గతుక్కుమంది రాగిణి. కొన్ని నిముషాలు ఆవిడ ముఖం రక్తం బొట్టు లేనంత తెల్లగా పాలిపోయింది. ఎంతో చతురురాలైన రాగిణి తనను

తాను కూడ దీసుకుని మామూలుగా ఉండటానికి విశ్వప్రయత్నం చెయ్యవలసివచ్చింది.

తన మనోభావాలు దాచుకోవటానికి అలవాటుపడిన మాధవరావు మాత్రం తన ఆశ్చర్యాన్ని బయటపడనీయలేదు. చిరునవ్వుతో బాపినీడుని విష్ చేసాడు.

"మీ మాటే అనుకుంటున్నాం. మీకు నిండా నూరేళ్ళు ఆయుర్దాయం. మీరు కూడా ఉంటే బాగుండేదని."

'అహహ' అని నవ్వాడు బాపినీడు. "నాకు నూరేళ్లు ఆయుర్దాయం ఎందుకండీ! బ్రతికి ఏం చెయ్యాలి?" అన్నాడు.

"అహ! అలా అనకండి. మీలాంటివాళ్ళు దేశానికి ఎంతో సేవ చేస్తున్నారు. ఇంకా చెయ్యాలి."

"మా దేముంది లెండి. చేస్తున్నది మీరు."

"ముందు మీరు చేస్తోంటే మీ వెనకాల మేమూ, మేం చెయ్యవలసింది చేస్తున్నాం."

కళ్ళు చిట్లించి చూడబోయిన బాపినీడు చేతికి చిరునవ్వుతో ఫలహారం పళ్లెం అందించి "తీసుకోండి!" అన్నాడు.

బాపినీడు చిరునవ్వుతో అందుకుని "మీరు కానీయండి!" అన్నాడు.

బాపినీడు, మాధవరావు ఇద్దరూ నామ మాత్రంగానే తిన్నారు. అప్పటికి రాగిణి కొంచెం కోలుకుంది. మామూలు వయ్యారాలు ఒలకబోస్తూ మాట కలిపింది.

"మాసారా! ప్రేమ ఉన్నచోట పిల్చిస్తే పలుకుతారు అని అంటారు. నేను మిమ్మల్ని తలుచుకున్నాను. మీరు వచ్చారు."

"ఇలా తలుచుకున్నప్పుడల్లా వస్తూనే ఉంటాను." గట్టిగా నవ్వుతూ అన్నాడు బాపినీడు. అందులో వెటకారం ఎవరికైనా స్పష్టంగా అర్ధమవుతుంది. ఎంత ప్రయత్నించినా నవ్వలేక పోయింది రాగిణి.

బాపినీడు మాధవరావుతో మాటలు మొదలుపెట్టాడు. "శ్యామలాంబగారు రాగిణికి పెళ్ళి చేసుకోవాలని ఉంది అని నాకు చెప్పారు. మొదట కొంచెం సందేహించినా చివరకు నేనే చేసుకుంటానని అన్నాను. స్త్రీ కోసం కాదు. స్త్రీలు, అందాలు బోలెడు బజార్లో దొరుకుతాయి కుప్పలు తిప్పలుగా. ఇల్లు దిద్దుకోవటానికి ఒక ఆడదాని అవసరమూ లేదు నాకు. మా ఆవిడకే ఏమీ పనిలేదు. ఎందరో పనిమనుష్యులున్నారు. కానీ, రాగిణి లాంటి యువతిని ఒక్కతెను కాపాడినా, ఒక మంచి పని చేసినట్లే ననిపించింది. ఏ ముందండీ, ఇలాంటి వాళ్ళ జీవితాలు. ఈనాడు సొగసు వయ్యారాలు గుమ్మరిస్తోంటే ఆనందించి ఏదో ఇంత ముఖాన్న పారేస్తారు. రేపు వయసు మళ్ళాక వీళ్ళకు విలువేమిటి? రూపం ఆధా

రంగా బ్రతికేవాళ్ళకు ఆ రూపం నశించగానే ఏం రక్షణ? ఈనాడు అవసరమయి ఉపయోగించుకున్నవాళ్ళే ఆనాడు ఛీ కొడతారు. ఆనాటిదాకా ఎందుకూ, ఇప్పుడే ఛీ కొడతారు పబ్లిక్‌లో ఎదురయితే! రాగిణిని పెళ్ళి చేసుకోవటంవల్ల నేను ఎంతో అవమానం ఎదుర్కోవాలి అని నాకు తెలుసు! అందరూ "నీ కిదేం కర్మ!" అని జాలిపడుతున్నారు. అంతే మరి, ఒక మంచి పని చెయ్యాలంటే కొన్ని అవస్థలు ఎదుర్కోక తప్పదు. నావల్ల ఒక అభాగ్యురాలి మనసుకి కొంత ఆనందం కలిగితే పరవాలేదు. నేను ఏమైనా తట్టుకుంటాను."

తలపైకెత్తి అలవాటైన ధోరణిలో అహంకారంతో గర్వంగా నవ్వాడు బాపినీడు.

ఆ ఇంట్లో అడుగుపెట్టాక అంత సేపటికి అప్పటికి రాగిణి ముఖం లోకి పరిశీలించి చూసాడు మాధవరావు.

రాగిణి కూర్చుంది అక్కడే. ఎక్కడికి కదలగలదు? వింది మాధవ రావు మాటలన్నీ. వినక? నవ్వింది! అంతే! అదొక్కటే చెయ్యగలదు మరి!

రాగిణి ముఖానికి క్రీం పూసుకుంది. ఆపైన ఫారిన్ పౌడరు అద్దుకుంది. కనుబొమలు దిద్దుకుంది. పెదవులకు లేత ఎరుపు లిప్‌స్టిక్ ఖరీదైనది పెట్టుకుంది. వీటన్నిటినీ కరిగిస్తూ బిందెలతో బాపినీడు మాటలు గుమ్మరించిన కళ్ళ నీటి చారలు ఆ ముఖంమీద, ఆ నవ్వులో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

అక్కడే ఉండి ఆ చిత్రహింస చూడలేక పోయాడు మాధవరావు.

"ఇంక వెళ్తాను." అని లేచాడు.

# 16

బాపినీడు సగర్వంగా అట్టహాసంతో తను చేసిన 'త్యాగాన్ని' వివరిస్తోంటే, నిస్సహాయంగా కూర్చున్న రాగిణి ముఖం మాధవరావుకు మరపు రావటంలేదు. అంతకంటె కూడా మరొక విషయం అతణ్ని ఆకర్షించింది. బాపినీడు మరునాటి వరకు రాడని చెప్పింది రాగిణి. అలాంటి వాడు ఆ సమయంలో రావటం కాకతాళీయమేనా? ఎందుకో అలా అనిపించలేదు మాధవరావుకి. ఆ విషయం నిర్ధారించుకోవాలనిపించింది.

వెంటనే రాగిణికి ఫోన్ చేసాడు.

మాధవరావు కంఠం విన్న రాగిణికి ఆనందంతో పిచ్చెక్కినట్లయింది. "మీరేనా? నిజంగా మీరేనా?" అంది.

కలుక్కుమంది మాధవరావు మనసు. రాగిణి తన ఎదురుగ నిలబడి విలాసాలు గుమ్మరిస్తూ "మిమ్మల్ని ప్రేమిస్తున్నాను." అన్నప్పుడు ఏ వికారమూ కలగలేదు కాని ఈనాడు ఈ మాటలు వింటుంటే ఎలాగో అనిపించింది.

"అవును. నేనే! నువ్వొకసారి మా ఇంటికి రా? రాగలవా?"

"ఎందుకు రాలేను? తప్పకుండా వస్తాను. ఇప్పుడే వస్తాను."

ఫోన్ పెట్టేసి క్షణాలలో తయారయింది. గాలిలో తేలిపోతున్నట్లు ఇల్లు దాటగలిగింది. కాంపౌండ్ గేట్ దాటలేక పోయింది. గేటు దగ్గర చౌకీదార్ "ఎక్కడికీ?" అన్నాడు.

నిర్ఘాంతపోయింది రాగిణి.

"ఎక్కడికో నీకు చెప్పాలా! గేటు తెరు!" అంది కోపంగా. వాడు నిర్లక్ష్యంగా, నిరసనగా నవ్వాడు.

"మీరు బయటకు వెళ్ళటానికి వీల్లేదు. అయ్యగారు మిమ్మల్ని ఎక్కడికీ కదలనియ్యొద్దని అన్నారు." తల గిర్రున తిరిగింది రాగిణికి.

ఎదురుగా రాక్షసుడిలా నవ్వుతూ చౌకీదార్.

తిరిగి ఇంట్లోకొచ్చేసింది. కోపంగా బాపినీడుకి ఫోన్ చేసింది.

రాగిణి కంఠం వినగానే బాపినీడు చికాకు పడ్డాడు.

"ఏం భార్యామణీ! నీ మాయప్రేమ కాస్త తగ్గించు తల్లీ! నాకు పనులున్నాయి."

"నన్ను బయటకు వెళ్ళనీయొద్దని చౌకీదార్ కి చెప్పారా?"

ఈ మాటలు వింటూనే విరగబడి నవ్వాడు బాపినీడు. "మహాతల్లివి ఎక్కడకు బయలుదేరావ్?"

"నేనడిగినదానికి సమాధానం చెప్పండి."

"అవును. నేనే చెప్పాను. నువ్విప్పుడు బాపినీడు భార్యవి. ఊరి మీద పడి తిరగటానికి వీల్లేదు. నా మర్యాద నేను నిలుపుకోవాలి!"

"ఆ సంగతి నాకు చెప్పచ్చుగా! ఆ చౌకీదారుతో చెప్పించటం దేనికి?"

"నీకు చెప్తాను, నువ్వు వింటావు!? అహ్హహ్హ! కనకపు సింహాసనమున కూర్చొబెట్టినా వెనుకటి గుణాలు పోవని నాకు బాగా తెలుసు. ఎటు తిరిగింది గాలి?"

ఫోన్ పెట్టేసింది రాగిణి.

శ్యామలాంబ సేవాసదనంలో చేరాక రాగిణి ఎప్పుడూ ఏడవలేదు. ఆనాడు కుమిలి కుమిలి ఏడ్చింది.

మాధవరావు తనంతట తను ఫోన్ చేసాడు. ఎన్నడూ ఎరగనంత ఆర్ద్రంగా మాట్లాడాడు. ఆ మాటలు వింటుంటే కేవలం ఆ పొడి మాటలు...ఏమి విశేషం లేని మాటలు కొద్దిపాటి ఆర్ద్రతతో వినిపించిన మాటలు వింటోంటే మనసుకు కలిగినంత హాయి ఏనాడు కలగలేదు. మాధవరావు తనను రమ్మన్నాడు. కానీ తను వెళ్ళలేక పోయింది. ఏదో భరింపరాని అశాంతితో రేగిపోసాగింది మనసు. తనను ప్రేమగా పలక

రించే ఒక స్నేహ స్వరం వినాలనిపించింది. వెంటనే గుర్తొచ్చిన వ్యక్తి లలిత.

సేవాసదనంలో స్నేహితులు ఎందరో ఉన్నారు. కానీ వాళ్ళలో ఏ ఒక్కరినీ కలుసుకోవాలని లేదు, లలితనే చూడాల్సనిపిస్తోంది. లలితకి ఫోన్ చేసింది.

"నేను లలితా! రాగిణిని ఒకసారి మా ఇంటికిరావూ!"

అటువైపునుండి నిశ్శబ్దం.

"రావూ?" మళ్ళీ అడిగింది రాగిణి.

"వస్తాను."

# 17

తను స్వయంగా ఫోన్ చేసినా రాగిణి వస్తానని రాకపోవటం మాధవరావుకి చాలా ఆశ్చర్యం కలిగించింది. మళ్ళీ ఫోన్ చేసాడు.

"మాధవరావుగారేనా? అయామ్! సారీ! నేను రాలేకపోయానండీ! ఇంకెప్పుడు రాలేను బహుశా."

రాగిణి కంఠం ఎలానో ఉంది.

"అదేం? ఎందుకు రాలేరు?"

"ఇప్పుడు నేను మిస్. రాగిణిని కాదుగా! మిసెస్ బాపినీడుని! ఎక్కడికైనా ఆయనతో కలిసి వెళ్ళటమే బాగుంటుంది. ఒంటరిగా వెళితే మర్యాదగా ఉండదు!"

"ఐసీ! మరి. నిన్న వస్తానన్నారు .."

"అప్పుడు అప్పుడింత ఆలోచించలేదు..."

"ఈ ఆలోచనలన్నీ తర్వాత వచ్చినవన్నమాట! మీకే వచ్చాయా? ఎవరైనా చెప్పిపెట్టారా?"

"భలేవారు! నాకామాత్రం తెలియదనుకున్నారా?"

"ఆల్ రైట్! ఎప్పుడైనా నేనే మీ ఇంటికి వస్తాను."

అటువైపునుండి ఏ సమాధానమూ రాలేదు. న్యాయంగా ఉత్సాహంతో "రండి!" అనవలసింది. ఫోన్ పెట్టేసి ఆలోచనలోపడ్డాడు మాధవరావు.

అప్పుడే వచ్చిన లలిత చనువుగా "ఏమిటాలోచిస్తున్నారు?" అంది.

లలితకు మణిమాలా మాధవరావులతో బాగా చనువు ఏర్పడిపోయింది- ఇద్దరితోనూ కొంచెం స్వతంత్రించి మాట్లాడగలుగుతోంది.

"రాగిణి గురించి..."

"తను చాలా సుఖపడుతున్నట్లు మనలనందరినీ నమ్మించడానికి ఎంతో తాపత్రయపడుతుంది. ఆ ఆరాటంలోనే పాపం. ఆ మనసులో

వెలితి అర్థమవుతుంది. నిన్న వెళ్ళాను. ఎందుకో రాగిణిని చూస్తే నాకు కలిగేది జాలిమాత్రమే!"

"నిన్న వెళ్ళారా మీరు?" "అవును!"

"మీరు వెళ్ళాక బాపినీడుగారు రావటం జరిగిందా?" "లేదు."

"మీరు రాగిణితో ఫ్రీగా మాట్లాడగలిగేరా?"

"ఆ. ఎందుకిలా అడుగుతున్నారు?"

"ఏం లేదు. బాపినీడు ఇంట్లో ఉండని సమయం చూసుకుని రాగిణి నన్ను రమ్మంది. కానీ నేను వెళ్ళిన కొంచెంసేపట్లోనే బాపినీడు వచ్చాడు. రాగిణి ఇక్కడికి రావటానికి కూడా ఏవో ఆటంకాలున్నట్లే అనిపిస్తోంది. ఇదంతా చూస్తోంటే నా అనుమానం మరింత ఎక్కువవుతోంది. లలితా! నువ్వే నాకు సహాయం చెయ్యాలి! రాగిణి ద్వారా బాపినీడుకు సంబంధించిన రహస్యాలు తెలుసుకోవాలి!"

"రాగిణి ఇప్పుడు బాపినీడు భార్య!"

"అందుకే మన పని సులువవుతుంది!"

"రాగిణి ఈ సహాయం చేస్తుందా?"

"చెయ్యదలచుకుంటే చెయ్యగలదు!"

"బాపినీడుకు ఎందుకు ద్రోహం చేస్తుంది?"

"ఎందుకు చెయ్యదు? రాగిణికి బాపినీడు ఎవరు?" చిత్రంగా నవ్వాడు మాధవరావు ఆ నవ్వు చూస్తూ నిలబడిపోయింది లలిత.

"ఏమైనా, ఇలాంటి సహాయం చెయ్యమని రాగిణిని నేనెలా అడగగలను?"

"ప్లీజ్ లలితా! ఇదంతా నీ కోసమే..."

"నా కోసమా?"

మాధవరావు అల్లరిగా నవ్వాడు.

"అవును. నీ కోసమే! ఈ రకంగా రాజు నిర్దోషి అని రుజువు చెయ్యటానికి వీలవుతుందేమోనని .."

లలిత ముఖం పాలిపోయింది. మాధవరావు వంక దీనంగా చూసింది. కలవరపడ్డాడు మాధవరావు. "ఏమిటి లలితా!"

లలిత ఏం మాట్లాడలేదు.

"నీకు అపాయం జరుగుతుందని భయపడకు, నేనుండగా నీకు .."

"అది కాదు. ఈ విషయం ఎలా చెప్పాలా అని ఆలోచిస్తున్నాను..."

"చెప్పు! నాతో నువ్వేది ఎలా చెప్పినా ఫరవాలేదు."

"ఆ మాత్రం అభయమిచ్చారు గనుక చెప్తున్నాను. రాజుకోసమని నేనేదీ చెయ్యలేను. మీ కోసం ఏం చెయ్యమంటారో చెప్పండి. ప్రపంచంలో దేన్నీ లక్ష్యపెట్టకుండా చేస్తాను."

ఈ మాటలు వింటూ బొమ్మలా నిలబడిపోయాడు మాధవరావు.

లలిత వెళ్ళేసరికి రాగిణి మంచంమీద బోర్లా పడుకుని కుమిలి కుమిలి ఏడుస్తోంది! రాగిణి అలా ఏడవటం లలిత ఎన్నడూ చూడలేదు. చిన్నతనంలో పినతల్లి చేతిలో అష్టకష్టాలూ పడే రోజుల్లో కూడా అలా ఏడవలేదు. మాడలేకపోయింది లలిత. రాగిణి దగ్గరగా కూచుని తలమీద చెయ్యివేసి ఆప్యాయంగా నిమిరింది.

దిగ్గున తలెత్తింది రాగిణి. "నువ్వా?" అంది.

"దుఃఖంలో ఉన్న నన్ను ఇంత ఆత్మీయంగా ఓదార్చే వారెవరున్నారా, అని ఆశ్చర్యపోతున్నాను. నువ్వింకా నాకున్నావని ఆశ మిగల్లేదు." కళ్ళు తుడుచుకుంటూ అంది రాగిణి.

"ఎందు కేడుస్తున్నావ్, ఇంతగా .."

"ఇంక నాకు మిగిలింది ఆ ఏడుపే! నేను ఈ ఇల్లు కదిలి బయటకు అడుగుపెట్టడానికి వీల్లేదు. స్నేహితులను కలుసుకోడానికి వీల్లేదు. ఎవరిళ్ళకు వెళ్ళడానికీ వీల్లేదు. చివరికి సినిమాలకూ, షికార్లకూ, వెళ్ళడానికి కూడా వీల్లేదు. ఇది నాకొక ఖైదులాగానే ఉంది."

"ఇందుకేనా, ఏడుపు?"

"అంటే, ఇది నీకు మామూలుగానే అనిపిస్తోందా?"

"మొదటినుండీ నువ్వేం కావాలని కోరుకున్నావ్? ఏం కావాలనుకుని శ్యామలాంబగారి దగ్గరచేరావ్? చీరలూ, నగలూ, ఐశ్వర్యమే గా! అవన్నీ ఇప్పుడూ నీకున్నాయిగా! మరెందుకు ఏడుపు?"

రాగిణి లలితను విస్తుపోయి చూసింది.

"లలితా! నన్ను వెక్కిరిస్తున్నావా?"

"లేదు! లేదు! ఒకప్పుడు నేననుకున్న మాటలే నీతో అంటున్నాను. నిజంగా మనకేం కావాలో మనకు తెలుసా? ఏ దేవతలో మనకు వరాలియ్యటానికి సిద్ధపడితే నిజంగా మనకు సౌఖ్యం కలిగించేవి కోరుకోవటం మనకు చేతనవుతుందా? మనం కోరినవి మనకు దక్కినంత మాత్రాన సుఖపడగలమా? నీ సంగతే చూడు. నువ్వు కోరిన చీరలూ, నగలూ, దక్కాయి కాని ."

"నేను చీరలూ, నగలూ. కావాలనుకున్నాను. కాని, ఇలా గా?"

"ఆత్మ వంచన చేసుకోకు లలితా! అప్పుడైనా నువ్వు వీటికోసం కొంత వదులుకున్నావు. ఇప్పుడు వాటికొంత నాలుగు విధంగా వదులుకుంటున్నావు.'

"ఆ మాటకొస్తే లోకంలో మిగిలిన అందరూ మాత్రం కొన్నికొన్ని వదులుకోవటం లేదా?"

"అవును. ఒకటి పొందాలంటే మరొకటి వదులుకోవాలి. ఏది

పొందాలో, ఏది వదులుకోవాలో, నిర్ణయించుకోవటంలోనే జీవితపు విలువలు ఆధారపడి ఉన్నాయి."

రాగిణి మాట్లాడలేదు. అసలే బాధపడుతున్న రాగిణిని తను మరింత బాధ పెడుతున్నానా అనుకుంది సంభాషణ మార్చాలని "రాగిణీ! నువ్వు నాకొక్క సహాయం చెయ్యగలవా?" అంది.

రాగిణి ఉత్సాహంతో మొహమంతా వెలిగిపోతుండగా పట్టరాని సంతోషంతో "నేను నీకు సహాయం చెయ్యగలనా? తప్పకుండా చేస్తాను. చెప్పు" అంది.

తనకు సహాయం చెయ్యటానికి రాగిణి ఇంత ఉత్సాహపడుతుందని లలిత ఏనాడూ అనుకోలేదు. అంతకు ముందువరకు ఏడవటంవలన ఉబ్బిన ఆ ముఖంలో కొత్తగా వచ్చిన వికాసాన్ని చూస్తూ, "నేను ఎప్పుడు నా ఆనందమే చూసుకుంటాను. మరొకరి ఆనందం కోసం నా ఆనందం త్యాగం చెయ్యను. అయినా నేను వచ్చిన పని చెప్తున్నాను. ఆలోచించుకుని చెయ్యగలిగితే చెయ్యి. నాకోసం కాదు. మాధవరావుగారి కోసం" అంది లలిత.

"ఆయన కోసమయితే మరింత సంతోషంగా చేస్తాను చెప్పు."

"బాపినీడుగారికి సంబంధించిన రహస్యాలు తెలుసుకుని చెప్పమన్నారు."

"అదా...... .."

"ఏం? ఇష్టంలేదా?"

"ఇష్టం లేకపోవటం కాదు. నాకు కూడా ఏదీ సరిగ్గా తెలియదు. వాళ్ళు తెలియనివ్వరు. అన్ని విధాలా జాగ్రత్తలో ఉంటారు. శ్యాములాలుగారు నన్ను ఎవరెవరి దగ్గరకు పంపించారో ఆ వ్యక్తుల పేర్లు చెప్పగలను. ప్రస్తుతానికి నేను చెయ్యగలిగినదింతే!"

రాగిణి చెప్పిన పేర్లన్నీ ఒక కాగితంమీద రాసుకుంది లలిత

"లలితా! నిన్నొకమాట అడగనా?" సంకోచిస్తూ అంది రాగిణి.

"అడుగు."

"ఈ ప్రయత్నమంతా రాజు నిర్దోషి అని రుజువుచెయ్యటానికేనా? రాజును పెళ్ళిచేసుకోవాలనేనా ఈ తాపత్రయమంతా"

కొన్ని క్షణాలు మాట్లాడలేకపోయిన లలిత చివరకు సమాధానం చెప్పింది.

"కాదు. రాజు గురించి నేనేమీ ఆలోచించటంలేదు."

"మరి ..?" రాగిణి ప్రశ్నార్థకాన్ని అలాగే వదిలేసి "వెళ్ళొస్తాను." అని అక్కడ్నుంచి వచ్చేసింది లలిత.

# 18

మోహన్ విడుదలయ్యాడు. మాధవరావు ప్రయత్నంవల్ల మోహన్‌కి ఉద్యోగంకూడా దొరికింది. జానకమ్మ కోలుకుంది. లేచి తిరుగుతోంది.

రాజు వచ్చాడు. వస్తూ వెంకట్రావుకోసం పళ్ళూ, మిఠాయిలూ తీసుకొచ్చాడు. వెంకట్రావు ఆనందంగా వాటి నందుకున్నాడు. జానకమ్మకి చక్కని లక్ష్మి విగ్రహం తీసుకొచ్చాడు. "ఎందుకు బాబూ!" అంటూ కాదనలేక తీసుకుంది జానకమ్మ. మోహన్‌కి మంచి పర్స్ ఇచ్చాడు. లలితకు చక్కని రాధాకృష్ణుల విగ్రహం కానుకగా తెచ్చాడు. లలిత మాత్రం అది తీసుకోలేదు.

"ప్లీజ్! తీసుకో లలితా! నీకోసం షాపులన్నీ గాలించి తెచ్చాను." అన్నాడు రాజు.

"అయామ్ సారీ రాజూ! పరాయివాళ్ళనుండి బహుమతులు తీసుకోవటం నాకు అలవాటులేదు."

రాజు ముఖం చిన్నబోయింది.

"ఈనాడు నేను కొంచెం కష్టదశలో ఉన్నానని చిన్న చూపు చూడకు లలితా! మళ్ళీ నాకు మంచి రోజులు రాకపోవు." నిష్ఠూరంగా అన్నాడు.

నిర్ఘాంతపోయింది లలిత!

నెపం తనమీద వేస్తున్నాడు రాజు. భరింపరాని కోపం వచ్చినా నిగ్రహించుకుంది. శాంతంగా సమాధానం చెప్పింది.

"మారుతున్న దశలనుబట్టి మనసు మార్చుకోవటం నాకు అలవాటు లేదు రాజూ! ఎదుటి మనుష్యులను అర్థంచేసుకున్నప్పుడు మాత్రం దానికి అనుగుణంగా నా మనసు మార్చుకుంటాను."

రాజు సమాధానం చెప్పలేకపోయాడు.

ఇదెక్కడి రాజు! ఇలాంటి రాజునా తను ప్రేమించింది! ఆ రోజుల్లో రాజులోని ఈ మూర్తి తనకు కనపడకుండా ఎక్కడ దాక్కుంది? ఆలోచిస్తూంది లలిత.

"మోహన్‌కి మాధవరావుగారి ప్రయత్నంవల్లే ఉద్యోగం దొరికిందట గా!" ఉన్నట్లుండి అడిగాడు రాజు.

"అవును. ఎవరో ఒకరి ప్రయత్నం లేకుండా ఉద్యోగాలు దొరికే రోజులు కావు గదా, ఇవి!"

"అంతే! అంతే! లలితా! దయచేసి కొంచెం నా విషయం కూడా మాధవరావుగారికి చెప్పవూ?"

లలిత మనసులో చీదర తారాస్థాయి నందుకుంది. రాజుని ఏడిపించాలనిపించింది.

"నేను చెప్తే ఆయన చేస్తారని నమ్మకమేనా రాజూ?"

"తప్పకుండా చేస్తారు. ఆయనకు నువ్వంటే చాలా అభిమానం!"

"ఎంత అభిమానం ఉంటే మాత్రం? మొగవాళ్ళు తాము అభి మానించే వ్యక్తులకి ఊరికే సాయం చెయ్యరు. ఆ అభిమానం తిరిగి పొందగలిగినపుడే చేస్తారు!"

"నీకూ ఆయనంటే అభిమానమేగా లలితా!"

"ఆ సంగతి నీకు తెలుసా రాజూ!"

"ఎందుకు తెలియదు? అందరికీ తెలుసు!"

"ఓహో! అందరికీ తెలుసన్నమాట! అయితే నువ్వు నన్నెలా పెళ్ళిచేసుకుంటావ్!"

"అదేమిటి లలితా!"

"ఛీ! ఛీ! సిగ్గులేదూ?"

అప్పటికి లలిత తన నెక్కడికి లాక్కుపోతోందో రాజుకి అర్థమయింది. అవమానంతో లోలోపల ఉడికిపోయాడు. రాజు అవస్థ అర్థం చేసుకున్న లలిత హాయిగా నవ్వింది.

దిగ్గున లేచి వెళ్ళిపోయాడు రాజు.

'పరవాలేదు!' అనుకుంది లలిత.

రాగిణి దగ్గరనుండి లలిత తెచ్చిఇచ్చిన పేర్లు చూసిన మాధవరావుకు మతిపోయినట్లయింది. వాళ్ళందరు పెద్దపెద్ద ఆఫీసర్లు. ఎంతో పరపతి గలవాళ్లు. అలాంటి వ్యక్తుల విషయంలో అనుమానించి విచారణ సాగించటం మాటలుకాదు. అయినా మాధవరావు సాహసించాడు. విచారణలో అనేక విషయాలు బయటపడ్డాయి. శ్యామలాంబగారు రాగిణిని, ఇంకా రాగిణిలాంటి వాళ్ళనూ ఉపయోగించి, ఆయా ఆఫీసర్ల చేత అనేక రకాల గ్రాంటులు సేంక్షన్ చేయించుకుంది. వీటిల్లో చాలా సంస్థలు కేవలం కాగితాలమీదనే ఉన్నాయి. మరికొన్ని నామమాత్రంగా ఉన్నాయి.

ఈ విషయాలన్నీ అన్ని వివరాలతో పత్రికలలో వచ్చాయి. ఆ ఆఫీసర్లమీద ఏక్షన్ తీసుకున్నారు బాపినీడుకు రగిలిపోయింది. కోపంగా రాగిణి దగ్గర కొచ్చి బెల్టుతో గొడ్డును బాదినట్లు బాదాడు.

"నాకేం తెలియదు." అని గోలపెట్టింది రాగిణి.

"తెలీదూ! నువ్వు కాకపోతే, ఆ మాధవరావుగాడికీ సమాచారం అందజేసింది ఎవరు? దొంగ రాస్కెల్! ఎంత గుండెలు తీసిన బంటువే! ఇంటిముందు కాపలా పెట్టాను. ఫోన్‌కాల్స్ చెక్ చేయిస్తున్నాను. అయినా ఎలాగో ఒకలాగ సాధించావు. చెప్పు వాడికీ సమాచారం ఎలా అందించావో చెప్పు..."

మళ్ళీ బాదాడు బాపినీడు.

బాపినీడు మాటలు తనకు కలిగించిన బాధ ముందు ఆ దెబ్బల బాధ మరిచి పోయింది రాగిణి.

"దురాత్ముడా! ఇదా, నువ్వు చేస్తున్న పని? ఇందుకా నువ్వు నన్ను పెళ్ళిచేసుకున్నది?"

"ఓహో! మరి తను రెందుకండీ నన్ను పెళ్ళిచేసుకున్నది? నన్ను అలా వీపు తిప్పనిచ్చి అడ్డమైన గాడిదలనీ రప్పించుకుని నా డబ్బుతో కులకటానికా? పదిమందిలో ఇష్టంవచ్చినట్లు ఊరేగి నా పరువు బజారుపాలు చేయటానికా? రోగ్! పెళ్ళట, పెళ్ళి...ఎన్ని జన్మలకు తెలుస్తుందే పెళ్ళికి అర్థం నీకు?"

కసిగా మాట్లాడుతున్న బాపినీడు ఫోన్ మ్రోగటంతో రాగిణిని వదిలేసి వెళ్ళిపోయాడు. ఫోన్‌లో మాట్లాడుతూ జేబులోంచి నీలం అట్ట ఉన్న చిన్న డైరీ తీసి దానిలో ఏదో వ్రాసుకోటం గమనించింది రాగిణి. అతడు ఇదివరలో కూడా అలానే కొన్ని ముఖ్య విషయాలు నోట్ చేసు కునేవాడని గుర్తు కొచ్చింది.

# 19

"లలితా! ఇవాళ సాయంత్రం మనం సినిమా కెళ్దాం!" అంది మణిమాల.

లలిత ఎప్పటిలా తల ఊపలేదు. ముఖం చిట్లించుకుని "ఇంక ఈ కపట నాటకాలు సాగవు మణిమాలా!" అనేసింది.

మణిమాల తరచుగా లలితను ఏదో ఒక ప్రోగ్రాం అంటూ బయలు దేర తియ్యటమూ. చివరి క్షణంలో ఏదో వంకతో తను తప్పించుకుని, మాధవరావునూ, లలితనూ మాత్రమే పంపాలని చూడటమూ, మాధవరావు తెలివిగా ఆ సమయానికి ఏదో ఒక పని ఉందని తప్పుకోవ టమూ మామూలైపోయింది. ఎప్పటికప్పుడు మాధవరావుతో కలిసి బయలుదేరటానికి తను సిద్ధమైనట్లు కనపడటమూ, అతడు తప్పుకోవటమూ, లలితకు చాలా అవమానంగా ఉంది. నిజానికి లలిత ఒప్పుకుంటున్నది మణిమాల మాటలు కాదనలేని మొహమాటంతో .. మాధవరావు కూడా తనతో కలిసి రావటానికి సిద్ధపడితే, అప్పుడు తన మనసెలా ఉండేదో, దానికి లలిత దగ్గర సమాధానంలేదు.

ఒకపక్క ఈ అవమానమే భరించలేకుండా ఉంటే అంతకంటే ఎక్కువగా బాధిస్తోంది నిరాశతో. "నేనేమయిపోయినా పరవాలేద"ని కృంగిపోతున్న మాధవరావు ముఖం.

అందుకే ఏమయితే అయిందని ధైర్యంగా ఎదుర్కొంది మణిమాలని.

"కపట నాటకాలా?" ఆశ్చర్యం నటిస్తూ అంది మణిమాల.

లలితకి మరింత మండిపోయింది.

"నువ్వు డాక్టర్ వినోద్‌తో ఇష్టం వచ్చినట్లు తిరగటంకోసం మాధవరావుగారి కొక జతను చూసి పెట్టక్కర్లేదు. అందుకు నన్ను ఉపయోగించుకుంటానంటే నేను ఒప్పుకోను."

లలిత మాటలకు మణిమాల కోపం తెచ్చుకోలేదు సరికదా, తనకు అలవాటైన ధోరణిలో నిర్లక్ష్యంగా నవ్వింది.

"పూర్ లలితా! నేను డాక్టర్ వినోద్‌తో కలిసి తిరగాలనుకుంటే అడ్డు చెప్పేదెవడు? అందుకోసం మాధవ్ కొక జతను చూడక్కర్లేదు నేను..."

లలితలో కసి పెరిగిపోతోంది.

"అయితే ఇంకేం? ఊరేగు! మధ్యలో నన్నెందుకు చంపుతావ్?

"మాధవ్‌ని కూడా సుఖపడేలా చేద్దామని..."

"ఆహా! ఎంత ప్రేమ! ఆదర్శ పత్నివంటే నువ్వే! కానీ ఇంత కాలమయినా ఆయన్ని నువ్వు అర్థం చేసుకోలేదా? ఒక ధర్మానికీ, ఒక నీతికీ కట్టుబడి ప్రవర్తించే మనిషి ఆయన. ఏ సుఖాలకోసమూ, తను అధర్మమని అనుకున్న మార్గంలో అడుగుపెట్టరు. భార్య చచ్చిపోతే. మరొక పెళ్ళి చేసుకుంటారేమో! ధైర్యంగా విడాకులిచ్చి విడిపోతే మరొకరిని ప్రేమించగలరేమో! కానీ, తాళికట్టిన భార్య ఉండగా ఏ పరిస్థితుల్లోనూ ఆయన మరొక జంటను వెతుక్కోరు. ఇంక ఈ వృథా ప్రయత్నాలు మానెయ్యి..."

మణిమాల మాట్లాడలేదు. లలితకు మరింత ధైర్యం వచ్చింది.

"మణిమాలా! నా మాట విను. ఊబిగుంటలో ఉన్న నిర్గంధ కుసుమంకోసం పరుగులు పెట్టకు .."

"షటప్! గెటవుట్!" గట్టిగా అరిచింది మణిమాల.

"వెళ్తున్నాను. కానీ నువ్వు మళ్ళీ కబురు పంపగానే వస్తాను. మళ్ళీ చెప్తున్నాను. అదృష్టవంతు లందరిలో అదృష్టవంతురాలివి జీవితాన్ని చేతులారా నరకం చేసుకోకు!"

లలిత వెళ్ళిపోయినా, మణిమాల చాలాసేపు ఆలోచిస్తూ కూర్చుండి పోయింది. చివరకు లేచి డాక్టర్ వినోద్ దగ్గరకే బయలుదేరింది. ఎప్పటి లాగే మాధవ్‌కు స్లిప్ రాసిపెట్టింది.

రాత్రి పదిగంటల సమయంలో కాలింగ్ బెల్ విని తలుపు తెరిచిన మాధవరావు రాగిణిని చూసి తెల్లబోయాడు.

గడగడ వణికిపోతోంది రాగిణి. "నన్ను లోపలకు రానిస్తారా? లేకపోతే తిన్నగా ఏ రైలుకిందకో పోయి ఆత్మహత్య చేసుకోవలసిందే!"

"రండి! రండి!" అన్నాడు మాధవరావు.

ఆ రోజు బాపినీడు రాగిణి దగ్గరే ఉన్నాడు. బాపినీడు ఉండటం

వల్ల చాకీదారు నిర్లక్ష్యంగా నిద్రపోతున్నాడు. రాగిణి ఇంతకు తెగిస్తుందని ఊహించలేని బాపినీడు బాగా త్రాగి మత్తుగా నిద్రపోతున్నాడు. అలాంటి సమయంలో ప్రాణాలకు తెగించి వచ్చేసింది రాగిణి.

రాగిణి సాహసానికి మాధవరావు కూడా ఆశ్చర్యపోయాడు. అభిమానంగా రాగిణి చెయ్యి పట్టుకుని "ఎంత పని చేసావు రాగిణీ! ఎంత ప్రమాదం?" అన్నాడు. "మీరీమాత్రం ఆదరంగా మాట్లాడతానంటే ఇంకా ఎంత సాహసమైనా చేస్తాను." అంది రాగిణి చిరునవ్వుతో. మాధవరావు గతుక్కుమని రాగిణి చెయ్యివదిలి దూరంగా కూచున్నాడు. పకపక నవ్వింది రాగిణి మెరుస్తున్న కళ్ళతో .. మాధవరావు తేరుకుని "ఎందుకొచ్చారు?" అన్నాడు.

"మీకు సహాయం చెయ్యటానికే వచ్చాను. బాపినీడు తను ఎవరికి సహాయంచేసినా, ఏంచేసినా, ఆ వివరాలు డైరీలలాంటి చిన్న నీలి అట్ట బౌండు బుక్స్‌లో రాసుకుంటాడు. అలాంటివి సాధారణంగా అతని బట్టల బీరువాలో ఒక షెల్ఫ్‌లో ఉంటాయి. ఇంకా ఏవేవో కాగితాలు కూడా చూసినట్లు గుర్తు. ఇంతకంటే నాకేం తెలియదు."

మాధవరావు ఆలోచనలో పడ్డాడు. బాపినీడులాంటి ప్రముఖ వ్యక్తి ఇంటిమీద రైడ్ చెయ్యటం మాటలుకాదు. ఒక వేళ ఏ ఆధారాలూ దొరక్కపోతే తన పని చాలా ఇరుకున పడుతుంది. కానీ, రాగిణి మాటలను బట్టి బాపినీడు ఏదో కుంభకోణం నడిపిస్తున్నట్లే ఉంది.

"మీరు నాకొక్క ఉపకారం చెయ్యాలి."

మళ్ళీ వణికిపోతూ అంది రాగిణి.

"ఏమిటిది?" అనుమానంగా అడిగాడు మాధవరావు.

"దయచేసి నన్ను జైల్లో పెట్టించాలి!"

"నీకు మతిపోయిందా? ఇదా, ఉపకారం?"

"అవును. ఇదే పెద్ద ఉపకారం. జైల్లో పోలీసు కాపలా మధ్య గాక, ఎక్కడున్నా నన్ను బాపినీడు బ్రతకనివ్వడు. నాకు బ్రతకాలని ఉంది. బాపినీడు అరెస్టు కావటం చూడటానికి బ్రతకాలని ఉంది. చెప్పండి. నన్ను జైల్లో పెడతారా? లేదా?"

మాధవరావు జాలిగా చూసాడు రాగిణిని.

చివరకు తనకు తానై జైలు కోరుకునే పరిస్థితికి వచ్చింది రాగిణి!

మాధవరావు అతి సాహసంతో బాపినీడు ఇంటిమీద రైడ్ చేసాడు. బాపినీడుకి వ్యవధి ఇయ్యకుండా రాగిణి తన దగ్గరకు వచ్చిన వెంటనే రైడ్ చేసాడు. బాపినీడు ఇంట్లో బయటపడిన రకరకాల డాక్యుమెంట్స్‌నిబట్టీ డైరీలనుబట్టీ చాలా విషయాలు బయటపడ్డాయి.

బాపినీడుకి రెండుమూడు అక్రమ వ్యాపార సంస్థలతో లావాదేవీ

లున్నాయి. డబ్బు పెట్టుబడిగా పెట్టి అతడు అయిదారుగురిని అధికారంలోకి తీసుకొచ్చాడు. ఆ అధికారాన్ని వినియోగించుకుని మళ్ళీ డబ్బు చేసుకుంటున్నాడు. అతనికి ఇదీ ఒక రకమైన వ్యాపారమయిపోయింది. శ్యామలాంబ అతనికి కుడిచెయ్యిలా పనిచేస్తోంది. సేవాసదనంలో ఉన్న స్త్రీలనందరినీ వాళ్ళు సమయానుకూలంగా ఉపయోగించుకుంటున్నారు. పెద్దపెద్ద పోలీస్ ఆఫీసర్లలో కూడా కొందరు బాపినీడుతో చేతులు కలిపినవారున్నారు. అందుకే బాపినీడుకి మరీ అడ్డులేకుండా పోయింది. గవర్నమెంట్ డబ్బు స్వాహా చేస్తున్నప్పుడు కొన్ని సందర్భాలలో అయినా ఆ విషయం బయట పడక మానదు. అప్పుడెవరో ఒకరిని సంఘానికీ, ప్రభుత్వానికీ, దోషిగా చూపించాలి. ఆ సమయానికి ఎవరో ఒకరిని పావుగా వినియోగించుకుంటారు. రాజుని అలాగే ఉపయోగించుకున్నారు.

రాజు నిర్దోషి అని రుజువయింది. బాపినీడు అరెస్టయ్యాడు.

బాపినీడుని చూసి పకపక నవ్వింది రాగిణి. "ఇన్నాళ్ళకు మిసెస్ బాపినీడుగా నా బ్రతుకు పండింది, నీతో సరిసమానమయిన సాంఘిక హోదా అనుభవిస్తున్నాను. ఇవాళనుంచీ నీకు నాకు పరువు ప్రతిష్ఠలు సమానమే! ఇద్దరం కటకటాల వెనక కలిసిమెలిసి కాపురం చెయ్యచ్చు!"

రాగిణి మాటలకు బాపినీడు కసిగా పళ్ళు నూరు కొంటుంటే మరింత నవ్వింది రాగిణి.

# 20

రాష్ట్రమంతా మాధవరావుకు జేజేలు పలికింది. వార్తా పత్రికలన్నీ మాధవరావును ప్రశంసించాయి.

ఇంతటి జయ జయ ధ్వానాల మధ్య బయటికి రాకుండా ఇంట్లో పడుకున్నాడు మాధవరావు.

ఎంతో సంతోషంతో అభినందించటానికి వచ్చిన లలిత మాధవరావును ఆ స్థితిలో చూసి విస్తుపోయింది.

"అలా ఉన్నారేం?" అంది ఆందోళనగా.

"మణిమాల డాక్టర్ వినోద్ దగ్గరకు వెళ్ళిపోయింది. ఇక్కడకు రానని ఉత్తరం రాసేసింది!"

బొమ్మలా నిలబడిపోయింది లలిత.

వృత్తిలో మాధవరావు సాధించిన విజయం సామాన్యమైనది కాదు. ఈనాడు అతను ఆనందంతో పొంగి పోవలసిన మాట, కానీ...

లలితకు ఎన్నెన్నో మాటలు నోటి చివరివరకు వచ్చి ఆగిపోతున్నాయి. ఏ ఒక్క భావాన్నీ మాటల్లో పెట్టలేక పోతోంది...

"సమాజం చిత్రమైనది లలితా! భార్య లేచిపోతే భర్తనే చులకనగా చూస్తుంది. ఫలానివాడి భార్య లేచిపోయింది. అని చెప్పుకుంటుంది.

అది ఆ భర్త లోపంగా భావించి నవ్వుతుంది. సంఘంలో ఇలా నవ్వుల పాలు కావటం నా కిష్టంలేదు. అందుకే ఇంతవరకూ ఎంతో సహించాను. కానీ చివరికి నేనిది ఎదుర్కోక తప్పలేదు! నా అపరాధమేమీ లేకుండానే నా కింత పెద్ద శిక్ష."

"మీరు...మీరు ..సంఘం కోసమే ఇంతగా భయపడుతున్నారా? అందుకే బాధ పడుతున్నారా?"

"పూర్తిగా అదొక్కటే కాదు. మణిమాలను నేనెంతో ప్రేమించాను. అన్నీ తెలిసి కూడా మణిమాలను వదులుకోలేక పోయాను. మణి నా కళ్ళముందు. నా ఇంట్లో ఉంటే చాలనుకున్నాను. ఎందుకో ఇప్పటికీ మణిమాల డాక్టర్ వినోద్‌ని ప్రేమించిందని నమ్మలేక పోతున్నాను. తనిలా వెళ్ళిపోతే నేను భరించలేనని తెలుసు. ఎందుకు వెళ్ళి పోయిందో?"

నిలువునా వణికిపోయింది లలిత. మణిమాల ఎందుకు వెళ్ళి పోయిందో మాధవరావుకు తెలియక పోయినా లలితకు తెలుసు.

"నన్ను క్షమించండి! ఈ దారుణానికి నేనే కారకురాలి నేమో!"

"ఛ! నిన్ను అనుమానించి వెళ్ళిపోయిం దనుకుంటున్నావా, మణిమాల?"

"అది కాదు. ఆవిడ ఇక్కడున్నంతవరకూ మీరు మరొకరిని ప్రేమించరని అన్నాను..."

నిర్ఘాంతపోయి చూసాడు మాధవరావు. లలిత తడబడి పోయింది.

"నన్ను అర్థంచేసుకోండి. ఆవిడ వెళ్ళిపోవాలని నేనా మాటలనలేదు. మీరు మరొకరిని ప్రేమించరనీ, ఆవిడ మిమ్మల్ని బాధపెట్టటం న్యాయంకాదనీ..."

మాధవరావు ముఖం చూస్తోన్న లలితకు మాటలు పెగల్లేదు. అక్కడినుండి వెళ్ళిపోయింది. అక్కడే ఉండి అతన్ని ఓదార్చి ధైర్యం చెప్పాలనుకుంది. ఎలాగైనా ఆ ముఖంలో దిగులును మరిపించి చిరునవ్వు తెప్పించాలనుకుంది. కానీ ఈ పరిస్థితుల్లో తన ప్రవర్తన ఎలా అర్థంచేసుకుంటాడో మాధవరావు? తను కావాలని మణిమాలను పంపించేసి ఇలా దగ్గర కావటానికి ప్రయత్నిస్తోందనుకుంటే ..అనుకుని చీదరించుకుంటే.

ఆ రాత్రే దారుణం జరిగిపోయింది. మాధవరావును ఉత్తరాలతో బెదిరించిన దుండగులు కేవలం బెదిరింపులతో ఆగిపోలేదు. అక్షరాలా తమ మాటలు అమలు జరిపారు. పదిమంది గూండాలు మాధవరావు ఇంటి మీదకొచ్చి పడ్డారు. మాధవరావు నిద్రలో ఉండడంవల్ల వెంటనే

ప్రతిఘటించలేక పోయాడు. అతనికి తీవ్రంగా గాయాలు తగిలాయి. రక్తం అపరిమితంగా స్రవించింది. ఆ మరునాటికి కాని ఎవ్వరికీ ఏ విషయము తెలియలేదు. వంటిమీద స్పృహలేని దశలో అతణ్ని డాక్టర్ వినోద్ హాస్పిటల్లోనే చేర్పించారు. మాధవరావును హాస్పిటలో చూసి పిచ్చిదయి పోయింది మణిమాల. అతని బెడ్ దగ్గరే ఉండిపోయింది.

తెలివి రాగానే మణిమాలను చూసిన మాధవ్ ఆస్యాయంగా "మణీ!" అన్నాడు _ ఏదో మాట్లాడబోయిన అతనికి అంతలోనే ఆయాసం వచ్చింది.

"మాధవ్! నువ్విక్కడ ఉండటానికి వీల్లేదు. వెంటనే వేరే హాస్పిటల్ లో చేరాలి. టాక్సీ పిలిపిస్తాను" ఆరాట పడుతూ అంది.

మాధవరావు మాట్లాడలేక ఆయాస పడుతున్నాడు. అతి ప్రయాసతో అన్నాడు_"మణీ! నేనింక ఎంతకాలం బ్రతుకుతానో తెలియదు. ఈ కొంచెం రోజులయినా నన్ను భరించలేవా?"

మణిమాలకు దుఃఖం పొంగి వస్తోంది. అయినా ఏడవలేదు. క్రింది పెదవిని మాత్రం రక్తం చిమ్మేలా కొరుక్కుంది

"మాధవ్! నా మాట విను. ఇక్కడెవరూ వినిపించుకోవటం లేదు, టాక్సీ తీసుకొస్తాను. మనం ఇంకో హాస్పిటల్ కు వెళ్ళిపోదాం."

"మనం?..." "అవును! నేనూ నీతో ఉంటాను."

"మరి, వినోద్?" "అతడి కర్మ?"

"అంటే? మళ్ళీ నాతో ఉందామనా?"

"ఉండను? నన్ను క్షమించగలిగే శక్తి నీకుంది. కానీ ఆ క్షమను భరించే శక్తి నాకు లేదు."

"క్షమించటం కాదు మణీ! నేను నిన్ను ప్రేమిస్తున్నాను"

"మాధవ్! నీకు తెలుసు. నేనూ నిన్ను ప్రేమిస్తున్నాను. అందుకే ఆ ప్రేమను ఉపయోగించుకోను. మాధవ్ మనం ఇక్కడినుంచి వెళ్ళిపోవాలి. నీ ఫ్రెండ్స్‌తో చెప్పు. టాక్సీ తెప్పించు."

"ఎందుకంత ఆరాటం మణీ? డాక్టర్ వినోద్ నామీద పగ తీర్చుకుంటాడనా? ఈ స్థితిలో అతనికి నామీద పగ ఏం ఉంటుంది? నేను బ్రతికి బయట పడతానా? బ్రతికినా మళ్ళీ మామూలుగా ఉంటానా?"

"అది కాదు మాధవ్! నా మాట విను ..?"

"పరవాలేదు మణీ! అతనిమీద నాకు పగ ఉండాలికాని, అతనికి నామీద పగ ఎందుకుంటుంది? ఈ మూన్నాళ్ళ ముచ్చటకోసం మీ ఇద్దరి మధ్య మనస్పర్థ ఎందుకు కలిగిస్తాను నేను? ఇక్కడే ఉంటాను. నా చివరి క్షణాల్లో నా కంటికి కనపడు చాలు!"

మణిమాల ఇంక నిగ్రహించుకోలేక పోయింది. మాధవరావు గుండెలమీద వ్రాలి వెక్కి వెక్కి ఏడ్చేసింది. మణిమాల తనమీద వ్రాలి పోవటం శారీరకంగా ఆ పరిస్థితిలో బాధనే కలిగించినా మనసుకు కలుగుతున్న హాయికోసం ఆ బాధను భరించాడు మాధవ్.

మణిమాల పరిస్థితి అర్థం చేసుకుని వెంటనే లేచి "సారీ!" అంది.

నువ్వు "సారీ!" అంటున్నావు. నేను "థేంక్స్" చెపుతున్నాను.

"మాధవ్! ఇంక నిజం చెప్పకుండా ఉండలేను. ఏదెలా జరిగినా సరే! డాక్టర్ వినోద్ డాక్టర్ కాదు. అబద్ధాల డాక్టర్! అతని డిగ్రీ అబద్ధపు డిగ్రీ...అతను నీకు వైద్యం చెయ్యటం భరించలేను నేను."

తన చెవులను తనే నమ్మలేక పోయాడు మాధవరావు.

డాక్టర్ వినోద్, డాక్టర్‌గా పేరు ప్రఖ్యాతు లార్జించుకొని కొన్ని సంవత్సరాలుగా పెద్ద ప్రాక్టీస్ చేస్తూ ఎన్నో బ్రాంచీలు, ఎందరో అసిస్టెంట్‌లు ఉన్న డాక్టర్ వినోద్, అబద్ధాల డాక్టరా?

జనం ఇంత వెఱ్ఱివాళ్ళా? అంతే అమాయకులు మోసపోక ఏం చేస్తారు? తనను మాత్రం, తన స్నేహితులు ప్రత్యేకించి ఇక్కడికే తీసుకు రాలేదా? అలానే అందరూ వచ్చి ఉంటారు. అదృష్టం బాగుండి రోగాలు తగ్గితే అదంతా డాక్టర్ ప్రతిభగా చెలామణీ అయిపోతుంది ప్రాణాలు పోయినా అది డాక్టర్ పొరపాటని ఎవరూ అనుకోరు. ఒకసారి పేరుప్రఖ్యాతు లొచ్చాక, అదేదో నయంకావడానికి వీల్లేని రోగ మనుకుంటారు.

"ఈ విషయం నాకెందుకు చెప్పావు మణీ?" బాధగా అన్నాడు మాధవరావు.

"చెప్పాలని చెప్పలేదు. నిన్ను మరో హాస్పిటల్‌కి తీసుకుపోవాలి. నా మాట ఎవరూ వినిపించుకోవటం లేదు. ఏం చెయ్యను?"

"ఈ సంగతి తెలిసాక నేనేం చేస్తానో తెలుసా?"

"తెలుసు వెంటనే ఈ సంగతి రిపోర్టు చేస్తావు."

"మరోలా ప్రవర్తించటం నా సాధ్యం కాదు. అదే చేతనయితే ఈనాడు ఈదశలో ఉండేవాడిని కాదు."

"నాకెందుకు చెప్తున్నావు? నేను నీకు కొత్తదాన్ని గాదు."

"నీమీద కసితో ఈ రిపోర్టు చేస్తున్నానని అనుకోవుగా!"

"అలా అనుకోగలిగితే నా ప్రాణానికి హాయిగానే ఉంటుంది. కానీ, నామీద నీకేమీ కసిలేదని నాకు తెలుసు. అదీగాక వ్యక్తికీ వ్యక్తిగత మయిన కక్షలకు నువ్వు ముడిపెట్టవని కూడా నాకు తెలుసు. ఏమైనా చెయ్యి. ముందిక్కడ్నుంచి కదలాలి."

మాధవరావు స్నేహితుల ద్వారా వెంటనే డాక్టర్ వినోద్ మీద రిపోర్ట్ డిపార్టుమెంట్ కు చేరిపోయింది.

మాధవరావును మరొక హాస్పిటల్ లో జాయిన్ చేసారు. అప్పటి వరకు మాధవరావుతోనే ఉన్న మణిమాల "నేనొక్కసారి ఇంటికి వెళ్ళొస్తాను మాధవ్!" అంది.

"ఎక్కడికి? డాక్టర్ వినోద్ దగ్గరకా?"

"ఇంకెక్కడికి వెళ్తాను?"

"ఇప్పుడొద్దు మణీ! బహుశః మరో రెండు మూడు గంటల్లో అతను అరెస్ట్ అవుతాడు.

"అందుకే! ఆ సమయానికి ముందు అతనితో ఉండాలని."

"ఎందుకు? హెచ్చరిద్దామనా? లాభంలేదు. ఇప్పుడతను ఎటూ తప్పించుకోలేడు."

"తప్పించడానికీ కాదు, తప్పుకోవడానికీ కాదు. ఇంతవరకు అతనితో కలిసి చాలా చాలా అనుభవించాను. ఇదికూడా అతనితో కలిసి అనుభవించాలని..."

మాధవ్ మాట్లాడలేదు. అతనికి ఆయాసంగా ఉంది. మాట్లాడలేకపోతున్నాడు. అతనికి మణిమాలను ఆపాలని ఉంది. కానీ ఆవిడ ఆగదని తెలుసు.

మాధవ్ విషయం తెలిసి ఆదుర్దాగా హాస్పిటల్ లో కొస్తున్న లలిత, మాధవరావున్న గదిముందే మణిమాలకు ఎదురుపడింది. మణిమాల లలిత వంక దిగులుగా చూసి 'లలితా ఆయన లోపలున్నారు జాగ్రత్తగా చూడు' అని చెప్పి వెళ్ళిపోయింది.

మణిమాల ఇంటికి చేరుకునేసరికి డాక్టర్ వినోద్ కోపంగా పచార్లు చేస్తున్నాడు.

"మాధవరావును పట్టుబట్టి నువ్వే మరొక హాస్పిటల్లో చేర్పించావుటగా!" అని అడిగాడు.

"అవును!"

"ఏం?"

"మాధవ్ కి నువ్వు వైద్యంచెయ్యటం నేను భరించలేను గనుక."

వినోద్ ముఖం తెల్లగా పాలిపోయింది.

"కొంపతీసి అన్ని విషయాలూ చెప్పావా, నీ మొగుడితో..."

"మాధవ్ కి అన్ని విషయాలూ చెప్పాను."

"అతడు ఊరుకోడు!"

"అవును, అప్పుడే రిపోర్టు వెళ్ళిపోయింది."

"రాక్షసీ..." అంటూ పట్టరాని కోపంతో వినోద్ మణిమాల కంఠం నులమసాగాడు.

మణిమాల ఒక్క కేక పెట్టలేదు. వదిలించుకోవటానికి ప్రయత్నించలేదు. ఆ హింసనంతా భరిస్తూ అలాగే కూచుంది.

డాక్టర్ వినోద్‌ని అరెస్ట్ చెయ్యటానికి పోలీసులు వచ్చేసరికి మణిమాల శరీరం అతని చేతుల్లో వేలాడుతోంది.

కొన ఊపిరితో ఉన్న మణిమాల అస్పష్టంగా "మాధవ్" అనగలిగింది.

క్షణాలలో మణిమాలను మాధవ్ ఉన్న హాస్పిటల్‌కే తీసికెళ్ళారు. మణిమాలను ఆసితిలో చూసి మాధవ్‌కు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. పాపం! అతనిది లేవలేని పరిస్థితి.

మాధవ్‌ని చూస్తూ మాట్లాడటానికి విశ్వప్రయత్నం చేసింది మణిమాల.

"మాధవ్! అయామ్ ప్రౌడ్ ఆఫ్ యు."

కష్టంమీద ఆ మాత్రం అనగలిగింది. అవే మణిమాల చివరి మాటలు. ఆ తరువాత రెండు మూడు గంటల్లోనే మణిమాల ఆత్మ విశ్వంలో లీనమయిపోయింది.

# 21

పూలూ, పళ్ళూ స్వీట్స్ తీసుకుని సంబరంగా వచ్చాడు రాజు లలిత ఇంటికి. రాజు ముఖంలో అంత వికాసం ఇటీవలి కాలంలో చూడలేదు లలిత.

"కంగ్రాచ్యులేషన్స్ రాజూ!" అంది చిరునవ్వుతో.

"థేంక్యూ లలితా! నిజంగా మళ్ళీ నా డ్యూటీలో నేను చేరగలిగానంటే అది నీ చలవే! మెనీ మెనీ థేంక్స్."

లలిత ముఖం చిట్లించుకుంది.

"అలా మాట్లాడకు రాజూ. నేను నీకోసం చేసింది ఏంలేదు. రాగిణి చేసింది. నీకోసమని చెప్పలేననుకో! కానీ పాపం, ఇదంతా రాగిణి చలవ. మిగిలినదేమైనా ఉంటే మాధవరావుగారి సహాయం. అంతే! నాదేం లేదు."

"పోనీలే! ఎలా అయితేనేం? శనిరోజులు పోయాయి. ఎప్పటినుండో నీతో చెప్పాలనుకుంటున్న సంగతి ఇప్పుడు నిస్సంకోచంగా చెపుతున్నాను లలితా! ఇదివరకే చెప్పాలనుకొన్నాను. కానీ, అప్పుడు నేనున్న దశలో ఆ మాటలకు విలువ ఉండదేమోనని చెప్పలేదు."

"ఏమిటది రాజూ?"

"నేను నిజంగా నిన్ను ప్రేమించాను లలితా! నిజం ఒప్పుకుంటున్నాను. నాలో చాంచల్యం ఉంది. రాగిణితో ఇంకా రాగిణిలాంటి మరికొందరితో సంబంధాలు పెట్టుకున్నాను. కానీ నా మనసు ఎప్పుడూ నీకోసమే అలమటించేది. ఏదో గొప్ప సంబంధం చేసుకోవాలని అనుకున్నాను. కానీ ఎవరిని చూసినా నా మనసులో నువ్వు మెదిలి ఎవరినీ